ప్రబోధాత్మక వ్యాఖ్య

కామ, లోభ, మాత్సర్యము లనెడి సజీవ పాశములలో తగుల్కొనిన మానవాళిని ఆధ్యాత్మికంగా పునర్జీవింప చేయుటకు భగవాన్ శంకరాచార్యులవారు రచించిన గ్రంథములలో "భజగోవిందం" అత్యుత్తమమైనది. ప్రాపంచిక విషయవాసనాభిలాషుల కామ క్రోధ జ్వరమునకు ఇది ఒక దివ్యౌషధము. ఈ గ్రంథము "నేనెవరు?" అనే వేదాంత విచారమును ప్రేరేపించి, అన్వేషకుని ఆత్మశాంతి, ఆనందములవైపు నడిపించును.

భగవాన్ శంకరుల వారి ఈ అమృత గానమునకు స్వామి సుందర చైతన్యానందులవారి ప్రబోధాత్మక మైన వ్యాఖ్యానమును గాంచుటకు నేను కడు ముదితుఁడను. జ్ఞాన స్ఫూర్తిని కలిగించు ఈ గ్రంథము ప్రతి ఒక్కరు పఠించదగినది.

శ్రీ సుందర చైతన్యానంద సనాతన ధర్మ దీపికాధారి. అతని ఆధ్యాత్మిక కార్యక్రమములను ఆశీర్వదించుచున్నాను.

శుద్ధానంద భారతి




# భజ గోవిందం

స్వామి సుందర చైతన్యానంద

భజగోవిందం

స్వామి సుందర చైతన్యానంద

అష్టమ ముద్రణము వరకు 11 వేల ప్రతులు

నవమ కెరటము ... మార్చి 1994 ... 2 వేలు ప్రతులు



ప్రతులకు :

సుందర చైతన్య ఆశ్రమం

ధవళేశ్వరం - 533 125

ఫోన్ : 378

వెల: రు 20-00

ముఖచిత్ర రచన:

బాబూరావు

ముద్రణ :

శ్రీ లక్ష్మీగణపతి బైండింగ్ వర్క్సు

కొవ్వూరు - 534 350

ఫోన్: 575



# ఆరాధన

కాలంలో జనించింది జగత్తు. జగత్తులో జన్మించాడు జీవుడు. జగత్తు ప్రేరేపిస్తుంది. జీవుడు ప్రవర్తిస్తాడు.

జగత్తు పరిణామక్రమము. జీవుడు పరిపూర్ణయుతము. పరిణామశీలమైన జగత్తు దుఃఖాలయము. పరిపూర్ణుడైన జీవుడు ఆనందనిలయము.

జీవ జగత్తుల ఈ విచిత్ర సంబంధం మానవుని పరిమిత మనోబుద్ధులకు అందని సత్యమై నిలిచింది. విశాలమైన ఈ విశ్వంలో మానవుని మనుగడ ఏపాటిది? బతుకుబాటలో నడక సాగించే మానవుని జీవిత గమ్యమేమిటి? జీవన తీరమెక్కడ? ఈ ప్రశ్నలకు సమాధానలు మహర్షులు గ్రంథాల్లో భద్రపరచారు. తమకు ధ్యానస్థితిలో అందిన అతీంద్రియ జ్ఞాన సముదాయమే మహర్షి వాఙ్మయము.

నాకున్న స్వల్ప వివేక వైరాగ్యములను తోడుచేసుకొని శాస్త్ర వనవాటికలో ప్రవేశించాను. శాస్త్ర రహస్యాలను జీర్ణించుకోవాలని ప్రయత్నించాను. ప్రతిచెట్టువద్ద నిలబడి నా గోడంతా వినిపించాను. ప్రతి పువ్వుదగ్గర కూర్చుని పసిబిడ్డలా విలపించాను. చెట్లు పట్టించుకోలేదు. పూలు వినిపించుకోలేదు. పిచ్చివాడిలా నాలో నేను మాట్లాడుకోసాగాను. ఉన్మాదినై ఊళ్ళన్నీ తిరిగాను. సందేశం అందలేదు. సమన్వయం కుదరలేదు.

నా మనోగగనంలో వ్యాపించియున్న శాస్త్ర మేఘాలను చూస్తూనే ఉన్నాను. ఈలోగా సవ్వడి అయింది. ఉరిమిన మబ్బుల మధ్య శంకర వాఙ్మయ మెరుపు మెరిసింది. ఆ మెరుపులో విశ్వమంతా దేదీప్యమానంగా గోచరించింది. ఆ కాంతి ప్రసారముతో హృదయములో వ్యాపించియున్న అంధకారము అదృశ్యమైంది. మనసులో నిండియున్న సమస్యలు శాంతి సముద్రములోపడి మునిగిపోయాయి. మనసు కుదుటపడింది. హృదయం ప్రశాంతతను పొందింది.

ప్రాపంచిక విషయ తుఫానులో చిక్కి ముక్కలైపోతున్న నా జీవన నాకను తన భాష్య విజ్ఞాన తెరచాపచే తీరమునకు చేర్చి, శాంతి మనుగడను చేకూర్చిన శంకర భగవత్పాదుల ఆరాధనలో నా శేషజీవితాన్ని చరితార్థం చేసుకోవాలనుకున్నాను. ఆచార్యులవారి గ్రంథాల పై నా అవగాహనను గ్రంథస్థం చేయడంలో నా ఆరాధన సఫలీకృత మవుతుందని భావించాను. శ్రీ వారి భజగోవిందమునకు వ్యాఖ్య వ్రాయడానికి మొదట ప్రయత్నించాను. పూజ్యపాదులు రచించిన ఈ భజగోవింద శ్లోకములకు ఇప్పటికే ఎందరో మేధావులు, యతిపుంగవులు వ్యాఖ్యలు వ్రాసియున్నారు. నేనూ ఒక వ్యాఖ్య వ్రాసి గ్రంథాలయాలకు బరువుకావడం నా అభిమతం కాదు. ఇది కేవలం స్వగతారాధన. నా మనోక్షేత్రంలో పూసిన సుగంధ పుష్పాలను స్వామి పాదాలవద్ద సమర్పించుకోవాలనే ఆశ. వ్యాఖ్య వ్రాశాను. గ్రంథము పూర్తయింది. దేవతార్చన రూపంలో కొనసాగిన ఈ రచనకు ముద్రణ అవసరమెంతో నాకు తెలియదు. శంకర భావాలను నా హృదయంలో భద్రపరచుకొనాలని చేసిన ప్రయత్నమేగాని గ్రంథమును ముద్రించి విక్రయించాలనికాదు.

ముముక్షువులతో ముచ్చటించు సందర్భాలలో ఈ వ్యాఖ్య ప్రతలను తెరచి వారికి వినిపించేవాణ్ణి. వ్యాఖ్యానము రసవత్తరంగా నడిచిందని శ్లాఘించేవారు. ప్రభావితంగా ఉందని ప్రశంసించేవారు. ఈ పొగడ్తలు నాలో ఎలాంటి చలనాన్ని కల్గించలేక పోయాయి. నేను పనిముట్టుగా నిలవడమే ఆ ఉదాసీనతకు కారణము. గ్రంథమును ముద్రించినచో ముముక్షువులకు ఎంతగానో ఉపకరించ గలదని భక్తులు ప్రేరేపించారు. పట్టుపట్టారు. భక్తులసేవ భగవంతుని సేవ అని భావిస్తూ, వారికోర్కెమేరకు ఈ గ్రంథాన్ని ముద్రించాలను కున్నాము.

1981వ సంవత్సరము జూలై నెలలో ఈ గ్రంథాన్ని ప్రథమంగా ముద్రించాము. ఈ గ్రంథముయొక్క అవసరమును భక్తులు ఎంతగా గుర్తించి గౌరవించారో తేటతెల్లమైంది. ప్రస్తుతము ఈ గ్రంథము తొమ్మిదవ ముద్రణయై మీ అమృత హస్తములను అలంకరించుచున్నది

నా ఈ వ్యాఖ్యను ఆశీర్వదించి అమితానందముతో అభిప్రాయము వ్రాసి పంపారు కవియోగి మహర్షి శ్రీ శుద్ధానంద భారతీస్వాములవారు. వీరు యోగ సమాజ స్థాపకులు. 105 సంవత్సరముల జ్ఞానవృద్ధులు. వీరు ఆరువందల చక్కటి ఆధ్యాత్మిక గ్రంథములను రచించారు. మహాజ్ఞానులైన పూర్ణానంద, జ్ఞానసిద్ధ, రమణమహర్షి, షిరిడీబాబా, అరవింద, గాంధీజీ, స్వామి శివానందజీ ఇత్యాది మహర్షి పుంగవుల సహచర్యముతో, సహజీవనముతో తమ బ్రతుకును పండించుకున్న ఆత్మవిదులు, ఆప్తకాములు, శ్రీ శుద్ధానంద భారతీ స్వాములవారు. వీరు అమెరికా, జపాన్, రష్యా, ఫ్రాన్స్, ఇంగ్లండ్, స్విట్జర్లాండ్ మొదలగు పాశ్చాత్య దేశములు పర్యటించి, ఋషి వాఙ్మయాన్ని ప్రచారం చేసారు."Maharshi Shudhanandaji has completed the cycle of birth and death and attained liberation and his glory encircles the world"" మహర్షి శుద్ధా నందజీ జనన మరణ చక్రమును పూర్తి చేసుకొని ముక్తిధామ మలంకరించారు. వారి కీర్తి ప్రపంచమంతటిని ఆవరించినది" అని స్వామి శివానందులవారు వ్రాసియున్నారు. అట్టి పవిత్రాత్ములైన శ్రీ శుద్ధానందులవారు నా ఈ వ్యాఖ్యానమునకు అభిప్రాయమును వ్రాసిపంపుట వారికి నాయందున్న వాత్సల్యమేనని భావిస్తూ, వారికి సాష్టాంగ దండప్రణామము లాచరించుచున్నాను.

భక్తులారా! అందుకోండి. ఉపయోగపడే విషయమంటూవుంటే అది భగవంతుని ప్రసాదముగా భావించి స్వీకరించండి. నిరుపయోగమైన విషయం కనుపిస్తే అది నా జడమతినుండి వచ్చిందని నిర్ణయించి క్షమించండి.

శ్రీ కృష్ణార్పణమస్తు

ఇవ్విధాన
భగవత్సేవలో
మీ
స్వామి సుందర చైతన్యానంద

# శ్లోకానుక్రమణిక





## ENLIGHTENING COMMENTARY

*Bhaja Govindam is a masterpiece of Bhagawan Sankara for the spiritual regeneration of humanity caught in vital snares of lust, greed and envy. It is a cure for the Kama-Krodha fever of worldly men. It induces the Vedantic enquiry of "Who am I" and leads the seeker to self peace and bliss.*

*I was happy to see the Enlightening Commentary of Swami Sundara Chaitanyananda for this immortal song of Lord Sankara. Every one must read this enlightening book*

*Sri Sundara Chaitanyanada is the torch bearer of Sanatana Dharma. I bless his spiritual activities.*


SHUDHANANDA BHARATI

YOGA SAMAJ
ADYAR
MADRAS



# ప్రబోధాత్మక వ్యాఖ్య

కామ లోభ మాత్సర్యములనెడి సజీవ పాశములలో తగుల్కొనిన మానవాళిని ఆధ్యాత్మికంగా పునర్జీవింప చేయుటకు భగవాన్ శంకరాచార్యులవారు రచించిన గ్రంథములలో "భజగోవిందం" అత్యుత్తమమైనది. ప్రాపంచిక విషయ వానసాభిలాషల కామ క్రోధ జ్వరమునకు ఇది ఒక దివ్యౌషధము. ఈ గ్రంథము "నేనెవరు?" అనే వేదాంత విచారమును ప్రేరేపించి, అన్వేషకుని ఆత్మశాంతి, ఆనందములవైపు నడిపించును.

భగవాన్ శంకరులవారు ఈ అమృత గానమునకు స్వామి సుందర చైతన్యానందవారి ప్రబోధాత్మకమైన వ్యాఖ్యానమును గాంచుటకు నేను కడు ముదితుడను. జ్ఞానస్ఫూర్తిని కలిగించు ఈగ్రంథము ప్రతి ఒక్కరు పఠించదగినది.

శ్రీ సుందరచైతన్యానంద సనాతన ధర్మదీపికాధారి. అతని ఆధ్యాత్మిక కార్యక్రమములను ఆశీర్వదించుచున్నాను.

శుద్ధానంద భారతి

జ్ఞానబ్రహ్మ

పూజ్యశ్రీ స్వామి సుందర చైతన్యానంద



# భజగోవిందం

## ఉపోద్ఘాతం

పుణ్యభూమియైన ఆర్యావర్తము ఆదినుండి ఎన్నో క్లిష్టసమస్యల నెదుర్కొంటూ నడక సాగించింది. అనూహ్యమైన భయంకర పరిస్థితులు తలెత్తినను ఈ ఋషి భూమికి చల్లటి నీడ నిచ్చి నూతన జీవన దృక్పథాన్ని ప్రసాదిస్తూ కాపాడిన సనాతన ధర్మవృక్షము సజీవంగానే వుంది.

ఈదేశ సంపదను చూచి మతిభ్రష్టులైన విదేశీయులు జరిపిన దారుణ దండయాత్రలనే సూర్యరశ్మికి సనాతన వృక్ష పల్లవములు కలతచెంది వాడిపోయినవి. సాంఘిక దురాచారాల పెనుగాలులకు వాడిన ఆకులు రాలిపోయినవి. కులతత్వాల పేరిట చెలరేగిన మారణ హోమాలు సంస్కృతీ వృక్షాన్ని కొమ్మలు విరిచి నేలకూల్చాయి. భాషావివాదాలు, ప్రాంతీయ దురభిమానాలు ధర్మవృక్ష ఫలాలను నేలరాల్చాయి. భిన్న వ్యవస్థలను సుస్థిరపరచుటకై ఆధ్యాత్మిక అవగాహన లేని కొందరు మతోన్మాదులు ఏర్పరచిన సిద్ధాంతాలు, పరస్పర ద్వేషభావంతో సాగించిన రాద్ధాంతాలు ఫలించుచున్న కాయలను ధ్వంసం చేశాయి. ప్రజల జీవనాన్ని చావుదెబ్బకొట్టిన రాజకీయ దురంధరులు ఆడిన కపట నాటకాలు, బాధ్యతలు విస్మరించి హక్కులకొరకు పోరాడే స్వార్థ ప్రజానీకం చేసిన కల్లోల ప్రదర్శనలు చిగురిస్తున్న పూతను, పిందెలను మట్టిపాలు చేశాయి.

తరతరాలుగ ఈ విధమైన దురదృష్టకర సంఘటనలతో ఛిన్నాభిన్నమైన భారతీయ సంస్కృతి ఈ నాటికీ సర్వాంగ సుందరమై వెల్గొందుట ఆలోచనాపరుడైన ప్రతివ్యక్తిని ఆశ్చర్యములో ముంచక మానదు. ఈ పరిస్థితే మరియొక దేశమునకు ప్రాప్తించి ఉన్నట్లయితే ఆ దేశము ఈనాడు అదృశ్యమై చరిత్ర గ్రంథాలలో మాత్రమే నిలిచి

భారతదేశము పురాణపురుషు లుదయించిన పుణ్యభూమి. భారత పుణ్య సంస్కృతి దెబ్బతినే సమయమాసన్నమైనపుడు ఒక మహాత్ముడుదయించి వ్యవస్థను చక్కబరచేవాడు. ఎప్పటికప్పుడు మహాత్ముల చేత ఉద్ధరింపబడుతూ భారత సనాతన ధర్మ స్రవంతి చిరంజీవత్వాన్ని సంతరించుకొన్నది.

"యదాయదాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహం"

"ధర్మమునకు హాని, అధర్మమునకు వృద్ధి కలుగునపుడు నేనే స్వయముగా జన్మించి రక్షిస్తా"నని శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతలో తెలిపారు. ధర్మోద్ధరణకై వచ్చిన మహాత్ములను అవతార పురుషులుగ, భగవదంశలుగా భావించడం భారతీయ తత్త్వ అవగాహనలో ఒక విశేషం.

బౌద్ధధర్మనాస్తిక భావ ప్రభావంతో మోడుబారిన సనాతన ధర్మవృక్షం నిర్జీవమై, నిర్వీర్యమై క్షీణించనున్న ఒక దుర్దశలో ధర్మ పరిరక్షణకై కైలాసనాథుడైన మహేశ్వరుడు శ్రీ ఆదిశంకరులై అవతరించారు. పరస్పర భావ విరుద్ధమైన వివిధ మత సిద్ధాంతాలనే దట్టమైన మేఘాలను అద్వైత సిద్ధాంతమనే చల్లటి గాలిచే చెదరగొట్టారు. సమదర్శనమనే ఎరువువేసి, సత్సాంప్రదాయమనే జలముపోసి పూర్తిగ నశించనున్న హైందవ ధర్మవృక్షాన్ని పునర్జీవింప చేశారు. వారి ప్రేమ హస్తాలలో పెరిగిన సనాతన ధర్మవృక్షం అద్వైతమనే అమృత ఫలాన్నిచ్చింది.

బ్రహ్మమొక్కటే సత్యము; జగత్తు మాయాజనితము. తానువేరని భావించినా యదార్థానికి జీవుడు బ్రహ్మమే కాని అన్యము కాలేడు. ఉన్న ఒకే సత్యము భగవంతుడు. నీవు భగవంతుడవేనని అద్వైతము బోధిస్తుంది.నామరూపాత్మకమైన ప్రపంచానికి వ్యవహారిక మనుగడేకాని (Emperical existence) పారమార్థిక సత్యము (Transcendental reality) భగవంతుడేనని శ్రుతి సమ్మతం గాను, స్మృతిబద్ధం గాను,యుక్తి యుక్తంగాను ... బోధిస్తుంది.



అద్వైత సిద్ధాంతము శ్రీ శంకరులతో ప్రారంభమైనది కాదు. బ్రహ్మదత్తుడు, గౌడపాదుడు, వశిష్ఠుడు శంకరులకు ముందే ఈ అద్వైత సిద్ధాంతానికి ఒక రూపమివ్వడానికి ప్రయత్నం చేశారు. అద్వైతానికి శంకరులకు పూర్వం ఎంత చరిత్ర నడిచిందో వారి తరువాత కూడా అంత చరిత్ర వుంది. శంకరుల అనంతరం విద్యారణ్యస్వామి, వాచస్పతి, చిత్సుఖ, మధుసూదన సరస్వతిలాంటి మహాత్ములు వారి రచనల ద్వారా అద్వైత సిద్ధాంత స్థిరీకరణకు తీవ్రంగా యత్నించారు. కానీ అద్వైత మత స్థాపకులన్న పేరు ఒక్క శంకరులకే దక్కింది. అద్వైత మతాచార్యులైన వివిధ మహాత్ములు సమర్పించిన రంగు రంగుల విడిపూలను శ్రీశంకరులు ఏర్చి కూర్చి తన జ్ఞాన నైపుణ్యంతో మాలగాతీర్చి విశ్వనాథుని మెడలో అలంకరించి అర్పించారు.

శ్రీ శంకరులు ప్రబోధించిన అద్వైత సిద్ధాంతము ఇటీవల సముద్రములను దాటి పాశ్చాత్య తీరాలలో కాలిడింది. భౌతిక వాదంతో అలసిపోయి విసుగుచెందిన పాశ్చాత్యుల మనసులకు నూతనోత్సాహాన్ని ప్రసాదించింది. తమ హృదయాలలో నిండియున్న అశాంతిని రూపుమాపగల పరమ ఔషధమంటూ, యూరపు, అమెరికా ఖండాలలోని ఎందరో మేధావులు అద్వైతాన్ని కీర్తించారు. శంకరులకు జోహారు లర్పించారు. ఐన్‌స్టీన్ జీన్స్, ఎడ్డింగ్‌టన్ లాంటి శాస్త్రజ్ఞుల రచనలు అద్వైత సిద్ధాంతానికి పరిపుష్టిని కల్గించాయి. విజ్ఞానశాస్త్రము నేడు నిర్మిస్తున్న సోపానాలు అద్వైత ఆలయాన్ని చేరడానికేనని తేలిపోయింది. కనిపిస్తున్నదే సత్యమనుకున్న శైశవదశ ప్రసంగాలను దాటి మనం చాలాదూరం వచ్చామని శాస్త్రజ్ఞులు గుర్తించి విశాల భావంతో వెలిబుచ్చారు. పరిమితమైన మనోబుద్ధులు సత్యదర్శనం చేయలేవని శ్రీ శంకరులు ప్రబోధించగా, మానవుని బుద్ధి సత్యచిత్రాన్ని కలత పెట్టుచున్నదని "కాంట్" (Kant) అభిప్రాయ పడ్డారు. మనోబుద్ధుల పరిమిత దృష్టిలో ఇంద్రియాల పరిచ్ఛేదములో ఉన్నవాటిని ఉన్నట్లుగా చూడలేక పోతున్నామని ఎడ్డింగ్‌టన్ (Eddington) అభిప్రాయపడ్డారు.

సృష్టిని దర్శించే మహోకార్యంలో దృష్టి సవరణ అవసరమని శ్రీ శంకరులు బోధించారు. జ్ఞానాంజన ద్వారా మన మనో నేత్రంలోని భేద భావ చత్వారాన్ని తొలగించడానికి ప్రయత్నించారు.

శ్రీ శంకరులు కేరళ దేశంలో కాలడి అను గ్రామమున శివగురు ఆర్యాంబ యను పుణ్యదంపతులకు క్రీ. శ. 788వ సంవత్సరమున వరప్రసాదమై జన్మించారు. తన ఎనిమిదవ ఏటకే వేదవిజ్ఞాన మంతటిని అభ్యసించిన అసమాన ప్రజ్ఞా దురంధరులు శ్రీ శంకరాచార్యులవారు. దక్షిణ భారతదేశంలో జన్మించి, మధ్యభారతదేశంలో విద్యనార్జించి, ఉత్తర భారతదేశంలో సర్వజ్ఞ పీఠాన్నధిరోహించిన అద్భుత మహిమాన్వితులు. ముప్పదిరెండు సంవత్సరముల స్వల్ప జీవితకాలంలో నిర్విరామంగా కాలినడకతో సువిశాల భారతదేశమంతయు సంచరించి అద్వైత సిద్ధాంతమును వ్యాప్తిచేశారు. కన్యాకుమారి నుండి కాశ్మీరము వరకు వారు దర్శించని పుణ్యక్షేత్రము, బాగుచేయని ఆలయము లేదు. జీర్ణావస్థలో నున్న ఎన్నో ఆలయాలను పునరుద్ధరించారు. తంత్రసాధనలను పరిశుద్ధ పరచారు. దేశాటన చేయుచున్న సన్యాసులను "దశనామి సన్యాసులు" గా క్రమపరచారు.

శ్రీ శంకరులకు పూర్వము విశ్వరూపాన్ని ధరించి ప్రళయతాండవము చేయుచున్న బౌద్ధమతము శంకరుని ఆగమనంతో పరుగెత్తి దేశసరిహద్దులు దాటి చైనా టిబెట్ దేశాలలో తలదాచుకున్నది. పంద్రెండు వందల సంవత్సరములకు పూర్వము పూజ్యపాదుల ధాటికి నిలువలేక పారిపోయిన బౌద్ధమతము ఈ నాటికీ జన్మ భూమిలో కాలు పెట్టను శక్తిలేక భయకంపితమై యున్నది.

బౌద్ధమతాన్ని ఆచార్యులవారు సమూలంగా నశింపచేశారని, భారతదేశంలో బౌద్ధమతము లేకుండా పోవటానికి శ్రీ శంకరులే కారణమని చాలామంది భావిస్తుంటారు. అది సరియైన అవగాహన కాదు. బుద్ధుడు ప్రత్యేకించి ఒక మతాన్ని స్థాపించాడని విశ్వసించే వారికి పై [illegible] బుద్ధుడు



యదార్థానికి మత స్థాపకుడు కాడు. ఆనాడు హిందూసమాజంలో వున్న కొన్ని అసమానతలను తొలగించడానికి, అస్తవ్యస్త ఆచారాలను, హింసాకాండను రూపుమాపడానికి బుద్ధుడు ప్రయత్నించాడు. తాను బోధించిన నైతిక సిద్ధాంతాలు, ధార్మిక విలువలు హిందూ ధర్మశాస్త్రాలలో వున్నవేకాని నూతనమైనవి కావు. ఆనాటి సాంఘిక, నైతిక, ఆధ్యాత్మిక రంగాలలో అలముకున్న అంధకారాన్ని తుడిచిపెట్టి సమాజ శ్రేయస్సుకు ప్రయత్నించిన బుద్ధభగవానుని కదలిక సంస్కరణోద్యమమే కాని మత స్థాపన కాదు. సతీ సహగమన నిషేధానికి రాజారామమోహనరాయలు సాగించిన ఉద్యమాలు, ప్రచురించిన గ్రంథాలు నేటి సభ్య సమాజానికి ఎలా అవసరములుకావో, అలాగే బుద్ధుని అనంతరము వారు ప్రబోధించిన ధర్మము కూడా నిరుపయోగమే అయింది. అయితే బౌద్ధధర్మాన్ని స్వీకరించిన చక్రవర్తులు, రాజులు ఆ ధర్మాన్ని వ్యాప్తి చేయు నుద్దేశ్యముతో బౌద్ధభిక్షువులను ఇతర దేశములకు పంపడము వలన వారు బోధించిన ఆ ధర్మనీతి పాశ్చాత్యులకు క్రొత్తగా నున్నందు వలన విరివిగ ప్రచారము గావించబడి పాశ్చాత్య దేశాలలో బౌద్ధమతము వ్యాప్తి చెందడము జరిగినది.

బౌద్ధధర్మము మాతృదేశములో మాయమగుటకు ఆ మతములోని అసంపూర్ణ సిద్ధాంతములే కారణంగాని శంకరుల అద్వైతము కాదు. అన్ని మతాలలోని అసంపూర్ణతను తొలగించి వాటని పరిశుద్ధ మొనర్చుటయే శంకరుల మేధావిశేషం.

భగవత్పాదులు ప్రసన్న గంభీరమైన అద్వైత సిద్ధాంతముచేత భిన్నాభి ప్రాయాలతో పోరాడు మతశాఖలన్నిటిని సక్రమ మార్గములో ఉంచి "షణ్మత స్థాపనాచార్యులు" అయ్యారు. వీరిది నిర్మాణమేకాని నిర్మూలనకాదు. శంకరులు ఒక వ్యక్తి కాదు. వ్యవస్థ;

ఆవేశపరులకు ఆచార్యులు అనేకులు. ఆలోచనా పరులకు శంకరులే శరణ్యం. "శం కరోతి ఇతి శంకరః" శుభముల నొసగువాడు శంకరుడని భావము.

దేశసంచారము గావించి, ధర్మ ప్రచారముచేసి, జీర్ణాలయములను పునర్జీవింపచేసి, నిర్విరామంగా సేవ చేసిన కర్మయోగి శ్రీశంకరులు. భక్తి పారవశ్యంతో సామాన్య జనరంజకముగ అష్టకాలు, షట్కాలు, దైవప్రార్థనలు, భక్తిగేయాలు రచించి సర్వమానవాళి హృదయ క్షేత్రాలలో భక్తి బీజాలు నాటిన పరమ భక్తాగ్రేసరులు శ్రీ శంకరులు. ముముక్షువులకు మార్గమును చూపు కాంతిపుంజములవలె దేశ నలుమూలల శంకరమఠములను నిర్మించి అవి ఈనాటికీ అచంచల కార్యదీక్షతో నడుచునట్టి సంప్రదాయ ప్రణాళిక నేర్పరచిన మార్గదర్శకులు, కార్య నిర్వాహకదక్షులు శ్రీ భగవత్పాదులు. మతం పేరిట చెలామణిఅయ్యే సంఘ విద్రోహులను అదృశ్యం చేసిన సంఘ సంస్కర్త శ్రీశంకరులు. తన హృదయావేశంతో మనోరంజకమైన పదలాలిత్యముతో, ఆశ్చర్యచకితుల్నిచేయు గంభీర భావములలో కమనీయ కవిత్వమును, రసమయ సాహిత్యమును ప్రసాదించిన కవిశేఖరులు శ్రీశంకరులు.

శంకరుల బహుముఖప్రజ్ఞ అసమానము, ఆశ్చర్యము, అద్వితీయము, కుశాగ్రబుద్ధి, విశాలహృదయమను నేత్రములతో సత్యసాధమును అన్వేషించి అపూర్వ ఆధ్యాత్మమణిని లోకాని కందించారు. బ్రహ్మసూత్రములు, ఉపనిషత్తులు, భగవద్గీత యనెడి ప్రస్థానత్రయమునకు వారు వ్రాసిన భాష్యము శ్రీశంకరుల అద్భుత మేధాసంపత్తికి తార్కాణము. అట్టి అసమాన ప్రజ్ఞాదురంధరులై వేదాంతాకాశములో అప్రమేయ అనూహ్య సిద్ధాంత అంబారీవీధుల్లో విహరించే ఆ మహాజ్ఞాని, క్రిందనున్న సకల జీవరాసులను శాంతింప చేయుటకు వర్షరూపంలో దిగివచ్చు మేఘమువలె సాధారణ మానవులను సైతం తరింపచేయుటకు క్రిందికిదిగి వారి స్థాయిలో అర్థమగునట్లు రచించిన శివానంద లహరి, భజగోవిందము లాంటి గ్రంథములు ఆచార్యులవారి హృదయ విశాలత్వమును నిరూపించు దర్పణములై యున్నవి.

మనము ప్రస్తుతము అధ్యయనము చేయు గ్రంథము శ్రీశంకర భగవత్పాదులు సర్వమానవాళికి ఉపయుక్తమగునట్లు లిఖించిన "భజగోవిందము" [illegible] బహుళ



ప్రచారము గావింపబడి సర్వజన సమ్మతమై అలరారుచున్నది. మానవుని జీవితలక్ష్యమును గుర్తుచేస్తూ, లక్ష్యసాధనకై మానవకర్తవ్యమును తెలియపరుస్తూ, వ్యక్తి ఆధ్యాత్మిక ప్రగతిని నిరోధించే విరోధులను కనపరుస్తూ, అట్టి శత్రువులను జయించు తరుణోపాయమును చూపిస్తూ, మానవుని చేయిపట్టుకొని నడిపించి మాధవుని స్థాయికి గొనిపోవు శక్తి కలది యగుటచే ఈ భజగోవిందము పండిత పామర జనరంజకమై వెల్గొందు చున్నది.

ఒకనాడు శిష్యులు వెంటరాగా శంకరాచార్యులవారు కాశీ నగర వీధులలో నడుస్తూ వ్యాకరణ సూత్రమును వల్లెవేయుచున్న వృద్ధ బ్రాహ్మణుని చూశారు. జీవిత సంధ్యా సమయాన కూడా భగవంతునిపై దృష్టి మరల్చక ఐహిక సుఖాన్వేషియై చరిస్తున్న ఆ వ్యర్థ జీవిపై సానుభూతి కలిగి వెంటనే అతని నుద్దేశించి ఒక శ్లోకాన్ని గానం చేశారు. “ఓ మందమతీ! గోవిందుని భజింపుము. గోవిందుని కీర్తించుము. మరణకాల మాసన్నమైనపుడు, యమపాశము మానవుని బంధించివెంటకొని పోవునపుడు వ్యాకరణ సూత్రము నిన్ను రక్షించదు. గోవిందుని భజింపుము” అని అప్రయత్నంగా గానం చేశారు. లౌకిక మానవుని అయోమయ జీవితమును చూచి హృదయం ద్రవించిన శ్రీశంకరులు అంతటితో ఆగక మానవ జీవన వికాసానికి ఉపయోగపడు పన్రెండు శ్లోకాలు చెప్పారు. వీటినే “ద్వాదశ మంజరీక స్తోత్రము” అంటారు.

శంకరాచార్యులవారిని అనుసరించి నడుస్తున్న పదునలుగురు శిష్యులు ఆచార్యులవారి బోధతో ఉత్తేజితులై ఒక్కొక్కరు ఒక్కొక్క శ్లోకం చొప్పున పదునాలుగు శ్లోకాలు చెప్పారు. వీటిని “చతుర్దశ మంజరీక స్తోత్రం” అంటారు. శిష్యులు రచించిన చతుర్దశ మంజరీక స్తోత్రమును ఆలకించి సంతృప్తి చెందిన పూజ్యపాదులు ఆశీర్వచనముగ చివర నాలుగు శ్లోకాలు చెప్పారు. మొత్తం కలిసి ముప్పది శ్లోకాలుగ ఏర్పడిన ఈ గ్రంథము “భజగోవింద” మను పేరుతో ప్రాచుర్యము నొందినది. మానవుని మనసులోని మోహమును పారద్రోలు శక్తి గలది

గనుక దీనికి "మోహముద్గర" అను పేరుకూడా కలదు.

ఈ గ్రంథములో మొదట వరుసగా పండ్రెండు శ్లోకములు, చివరి నాలుగు శ్లోకములు కలసి శ్రీ శంకర భగవత్పాదులు రచించినవి. 13వ శ్లోకము నుండి ఇరవై ఆరవ శ్లోకము వరకు శంకరుల శిష్యులు రచించిన శ్లోకములు. సులభ గ్రాహ్యమగుటకు శిష్యులు చెప్పిన శ్లోకములకు ఆయా శ్లోకములకు క్రిందనే వారి పేర్లను ఉదహరించడము కూడా జరిగినది.

ఆచార్యులవారు ఈ భజగోవింద గ్రంథములో ఉపయోగించిన భాష నిస్సంకోచముగా హెచ్చరికలు చేయు ప్రబోధము. ఒక విచిత్ర పంథాలో నడిచింది. తల్లిలాగ బిడ్డను బుజ్జగించి ఓదార్చే రీతుల్లో ఈ గ్రంథ రచన జరుగలేదు. అపరాధియైన కుమారుని క్షేమంకోరి కళ్ళెఱ్ఱజేసి చేతిలోని కొరడా ఝుళిపించు తండ్రి యొక్క నిర్దాక్షిణ్య మందలింపు ఇందు కనబడుతుంది. అవసరాన్ని గుర్తించడమే ఇందులకు కారణము. ప్రమాద పరిస్థితులలో వ్యక్తి మర్యాదలకు, సంఘ ఆచారాలకు తావులేదు. అగ్ని ప్రమాదంలో చిక్కుకొని అల్లాడిపోతున్న వ్యక్తి సార్వభౌముడైన చక్రవర్తియే కావచ్చు. అలాగని అతనిని ఆ ప్రమాదము నుండి తప్పించు సందర్భములో వారి గౌరవమును చాటు పల్లకీ కోసం అన్వేషించడం అనవసరం, అప్రస్తుతం, అసందర్భం. అతనిని పట్టి నడిపించుటకు వీలుకానిచో కాళ్ళు పట్టుకొని ఈడ్చి బయటకు లాగినను తప్పులేదు. ప్రాణం రక్షించడమే ముఖ్యం.

సంసార సముద్రంలో భ్రాంతి యనెడి నావనెక్కి సుఖదుఃఖ తరంగాల మధ్య సతమతమవుతున్న మానవుడు, తన నావ మునిగి పోతున్నదని ఇతరులు హెచ్చరించిననూ లెక్కచేయక అజ్ఞానముతో యాత్ర సాగించు సమయాన వానిని రక్షించుటకు తీవ్ర పదజాలంతో చేయు మందలింపే ఈ భజగోవింద శ్లోకములలో ప్రతిధ్వనిస్తూ వుంటుంది.

భజగోవిందమ్ భజగోవిందమ్
గోవిందమ్ భజమూఢమతే
సంప్రాప్తే సన్నిహితే కాలే
నహి నహి రక్షతి డుకృఞ్ కరణే 1

గోవిందమ్ = గోవిందుని, భజ = భజింపుము, గోవిందమ్ = గోవిందుని, భజ = సేవింపుము; మూఢమతే = ఓ మూఢ మానవుడా; సన్నిహితే = నిర్ణయింపబడిన, కాలే = కాలము; సంప్రాప్తే = చేరువైనపుడు; డుకృఞ్ కరణే = వ్యాకరణ సూత్రము; నహి నహి రక్షతి = రక్షించలేదు.

భావముః– ఓ మూర్ఖుడా! గోవిందుని భజింపుము. గోవిందుని భజింపుము. గోవిందుని భజింపుము. నీ మరణ సమయమాసన్నమైనపుడు వ్యాకరణ సూత్రములు నిన్ను రక్షింపవు.

### వ్యాఖ్య

భజగోవిందములో ఈ ప్రారంభ శ్లోకము వ్యాకరణ సూత్రమును వల్లెవేయుచూ కాలమును వృథా చేసుకొనుచున్న వృద్ధ బ్రాహ్మణునుద్దేశించి శ్రీ శంకరులు ప్రవచించారు. ఈ భజగోవింద శ్లోకములు గానము చేయునపుడు ప్రతిశ్లోకము ముగియగానే పల్లవిగా ఈ మొదటి శ్లోకమును పాడుతుంటారు.

పుట్టిన వ్యక్తికి మరణము తప్పదు. మరణించిన వ్యక్తికి జన్మము తప్పదు. చావు పుట్టుకల చక్రభ్రమణం నుండి బయట పడితేనే గాని మానవునికి పరిపూర్ణశాంతి లభించదు.

భగవంతుని సాక్షాత్కారము పొందుటకు మానవజన్మ లభించినది.

భగవత్ప్రసాదితమైన బుద్ధిని భగవంతుని తెలుసుకొనుటకు ఉపయోగించినపుడే మానవజన్మసార్థకమవుతుంది. అందుచేతనే "పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి" అని ప్రహ్లాదుడు తెలియ చేశాడు. పరమాత్మను తెలిసికొనుటకు ఉపయోగించవలసిన బుద్ధిని ఐహిక సుఖ భోగములకొరకు ఉపయోగించుట వివేకవంతులు చేయదగిన పనికాదు.

The world is too much with us,
Late and soon,
Getting and Spending
We lay Waste our powers.

"సర్వత్ర వ్యాప్తము జగము. తదనుభవమును పొందుటకై
మనము సర్వశక్తులను వృథా చేసుకొను చున్నాము"
అంటారు విలియమ్ వర్డ్స్ వర్త్.

జన్మ వచ్చినది మొదలు ఇంద్రియ భోగలాలసత్వములో పడి, తుచ్ఛమైన ప్రాపంచిక సుఖములకొరకు మానవుడు జీవితమంతయూ వృథా చేసుకొనుచున్నాడు. ఒకనాడు తాను శ్మశాన వాటికకు అంకితం కావాలన్న నగ్నసత్యాన్ని మరచి మతి భ్రష్టుడులా సంచరిస్తున్నాడు. మరణము ప్రాప్తించకమునుపే పరమాత్మను తెలుసుకొని ముక్త పురుషులుకండని శంకరులు ప్రబోధిస్తున్నారు.

"డుకృఞ్ కరణే" అనునది పాణినీయ వ్యాకరణము సిద్ధాంత కౌముది ధాతు పాఠము నందున్నది. మరణ సమయమునందు వ్యాకరణము మానవుని రక్షించదని శ్రీ శంకరులు ఖండించడములో గంభీర భావమున్నది. అది కేవలం వ్యాకరణాన్ని మాత్రం ఉద్దేశించి వెలిబుచ్చిన అభిప్రాయం కాదు. ప్రాపంచికమైన విద్యలేవీ మానవుని మృత్యువునుండి తప్పించలేవని అర్థము. అనంతమును తెలియజేయు చదువే నిజమైన చదువు. అది ఆధ్యాత్మ విద్యయే కాని మరొకటి కాదు. ఏది తెలిసిన పిదప మరొకటి తెలియనవసరములేదో అట్టి అమృత విద్యను తెలిసికొనుటకు, అమృతత్వమును పొందుటకు మానవజన్మ ప్రాప్తించినది.

ఈ సత్యమును గ్రహించక సంసార ఊబిలో దిగి పూడుకుపోతున్న వ్యక్తిని శంకరులు "మూఢమతే" అని



సత్యమును చూడ శక్తిలేనివాడని అర్థము. వాడే నాస్తికుడు. "నాస్తికో మూఢ ఉచ్యతే". మూఢు డనగా నాస్తికుడని భావము. నాస్తికుడంటే దేవుడు లేడని నిరాధారంగా అశాస్త్రీయంగా వాదించే అప్రయోజకుడే కాదు. దేవుడున్నాడని శుష్క-పాండిత్యాన్ని ప్రదర్శిస్తూ, శూన్యహృదయంతో ఆచరణలో అక్రమప్రవర్తనతో మెలిగేవాడు కూడా నాస్తికుడే. వింటూ వినలేక చూస్తూ చూడలేక, చెబుతూ తెలుసుకోలేక దుఃఖాగ్నికి ఆహుతవుతూ అసత్యమార్గంలో పయనించే అందరినీ కలిపి మూఢమతులుగా శంకరులు సంబోధిస్తున్నారు.

కాలసర్పం పడగవిప్పి కాటువేయకముందే భగవంతుని తెలుసుకోమని శంకరులు ప్రబోధిస్తున్నారు. అందులకు తరుణోపాయము గోవిందుని భజించుటయేనని సాధనక్రమం కూడా తెలియచేస్తున్నారు.

"గోవింద" అను పదమునకు చాలా అర్థము లున్నవి.

1. గోవులను రక్షించువాడు గోవిందుడు. అంటే పశువులకాపరి అని అర్థముకాదు. ప్రతిమనిషి హృదయంలో పశుప్రవృత్తులు చోటుచేసుకొని మానవత్వమునే హరింపచేస్తున్నాయి. మానవునిలోని పశుప్రవృత్తులను అదుపులో ఉంచగలిగి రక్షించువాడు "గోవిందు" డని అర్థము.

2. "గో" అనగా భూమి అను అర్థము కూడా కలదు. అగాధమైన సాగర గర్భంలో భూమాత అదృశ్యమైనపుడు వరాహావతారమెత్తి భూమిని కనుగొని వెలికితెచ్చుటచేత శ్రీహరి గోవిందు డయ్యెనని మహాభారత శ్లోకము వివరించుచున్నది. ఈ భావమునే శంకరాచార్యులవారు మోక్షధర్మ శ్లోకములో నిర్ణయించడము జరిగినది. అదియును గాక ఈ జగన్నాటకమంతయు భూ ప్రపంచ రంగస్థలిపై ప్రదర్శించబడుచున్నందున, ఈ భూమికి ఆధారభూతుడైన మహావిష్ణువు "గోవిందు"డని పిలువబడుచున్నాడు.

3. "గో" అనగా వాక్కు అని కూడా అర్థము. వాక్కు అనగా శబ్దం. సృష్టిలోని సకల శబ్ద జాలమునకు భగవంతుడే కారణమై యున్నాడు. జంతువుల

తమ మనోభిప్రాయములను వ్యక్తము చేయుటకు వీలగు శబ్దమునందలి శక్తి తానై యుండుటవలన అచ్యుతుడు గోవిందుడని పిలువబడు చున్నాడు.

4. "గోభిర్వేదాంత వాక్యైరేవ వింద్యతే లభ్యత ఇతి గోవిందః" వేదాంత గ్రంథాలద్వారా వ్యక్తమగువాడు గోవిందుడని అర్థము.

"గోవిందుని భజింపుము" అని ఆచార్యులవారు మూడుసార్లు ప్రవచించడము జరిగినది. మూడు పర్యాయములు ఉచ్చరించుట కేవలం సత్యమును నొక్కి వక్కాణించుటయేనని భావించకూడదు. భగవంతునికై మనంచేయు ఆరాధన త్రికరణశుద్ధిగా అనగా మనోవాక్కాయ కర్మలందు ఏక శ్రుతిగా మెలగవలయుననెడి ధ్వని కూడా అందు లేక పోలేదు. అదియును గాక ఈ శ్లోకము భజగోవింద గ్రంథములో ప్రథమ శ్లోకము. మనం శాస్త్రాధ్యయనము చేయునపుడు శాంతి మంత్రమును పఠించుట ఆచారము. శాంతి మంత్రము నుచ్చరించునపుడు "శాంతిః శాంతిః శాంతిః"అని మూడుసార్లు ఉచ్చరించడము కలదు. ఆధిదైవిక, ఆదిభౌతిక, ఆధ్యాత్మిక విఘ్నములు కలుగకుండా కాపాడమని మనం భగవంతుని ప్రార్థించుటయే అందులోని అంతరార్థము. అలాగే ఈ ప్రారంభ శ్లోకములో "గోవిందుని భజింపు" మని మూడుసార్లు ప్రవచించడము ద్వారా విఘ్నశాంతిని కాంక్షిస్తూ ప్రతి మానవ హృదయములో పరమశాంతి నిండుకొనుటకు శ్రీ శంకర భగవత్పాదులు ఆవిష్కరణ చేయుచున్నట్లు తెలియుచున్నది.

మూఢ జహీహి ధనాగమ తృష్ణాం
కురు సద్బుద్ధిం మనసి వితృష్ణామ్
యల్లభసే నిజకర్మో పాత్తం
విత్తం తేన వినోదయ చిత్తం 2

మూఢ = ఓ మూర్ఖుడా; ధనాగమ = ధనసేకరణయందు, తృష్ణాం = ఆశను, జహీహి = విడువుము, మనసి = చిత్తములో, వితృష్ణాం = ఆశలులేకుండా, సద్బుద్ధిం = సద్భావములను, కురు =

= నీదైన పనిద్వారా, ఉపాత్తం = సంపాదించిన, యత్ = ఏ, విత్తం = ధనమును, లభసే = పొందెదవో, తేన = దానిచేత, చిత్తం = నీ మనస్సును, వినోదయ = ఆనందముగ ఉంచుకొనుము.

భావము:- ఓ మూర్ఖుడా! ధనాశను వదులుము. మనసును పరిశుద్ధ మొనర్చుకొనుము. భగవంతుడు నీకు ప్రసాదించిన దానితో (పూర్వజన్మ ఫల విశేషముతో ప్రాప్తించినది) మనసును నిరంతరము ఆనందముగ ఉంచుకొనుము.

## వ్యాఖ్య

పరమాత్మసాక్షాత్కారమే మానవ జీవిత గమ్యమనియు, అట్టి పరమ నిధానమును చేరితేగాని మానవునికి పరిపూర్ణ శాంతి లభించదనియు, మనిషిని భ్రమింపచేయు ప్రాపంచిక భోగలాలసత్వము మాయా జనితమనియు, అందుకు తరుణోపాయము గోవిందుని భజించుటయేనని శంకరులు మొదటి శ్లోకంలో వివరించారు. భగవంతుని చేరుటకు మానవుడు చేయు ప్రయత్నములకు అడ్డుగా నిలిచి ఆటంక పరచే శక్తులే ధనేషణ, దారేషణ, పుత్రేషణ అనెడి ఈషణ త్రయములని శాస్త్రము చెబుతున్నది. అందు మొదటిదైన ధనేషణ అను శత్రువు లక్షణములను, దానిని జయించు మార్గమును శంకరులు ఈ శ్లోకము ద్వారా తెలియజేయు చున్నారు.

"ధనాశను వదులుము" అని శ్రీ శంకరులు హెచ్చరిస్తున్నారు. ధనాశను వదలమంటున్నారేగాని ధనాన్ని వదలమని చెప్పడంలేదు. భగవానుని పవిత్ర సృష్టిలో ప్రతి వస్తువుకు ఒక ప్రయోజనముంది. వస్తు ప్రయోజనమును గుర్తించి తదనుగుణంగా నడుచుకున్న మానవునికి అశాంతి కలుగదు. వ్యామోహ పీడితుడై, వక్రబుద్ధితో అక్రమ జీవనాన్ని గడిపే మానవుని మనసుకు శాంతి లభించదు.

అగ్ని యొక్క ప్రయోజనములు అనంతములు. ఎన్నో విధాలుగా మానవజీవనానికి ఉపయోగపడే అగ్నిని

చేసుకునేందుకు ఎవ్వరైనా ప్రయత్నిస్తే పర్యవసాన మెలావుంటుందో అందరికీ తెలుసు. అగ్నితో మనం ఏర్పరచుకొనే సంబంధాన్నిబట్టి మనకు సుఖదుఃఖాలు ఏర్పడుతుంటాయి. అగ్ని తనకు తానుగా సుఖాన్నిగాని, దుఃఖాన్ని గాని ఇవ్వలేదు. అగ్నితో మన సంబంధం సక్రమంగా, ధర్మయుతంగా వుంటే మనకు శాంతి కల్గుతుంది. అక్రమంగా, అధర్మంగావుంటే అనంత దుఃఖం సంప్రాప్తిస్తుంది.

ధనమూ అంతే. ధనమనేది మంచీకాదు చెడూకాదు. ధనముతో సంబంధం కలిగియుండే వ్యక్తి మనసులోని ఆంతర్యాన్ని బట్టి ఫలితాలు నిర్ణయమవుతుంటాయి. ధనముయొక్క యదార్థ స్వరూపము తెలియక ధన వ్యామోహంతో జన్మనిచ్చిన తల్లిదండ్రులను చెఱసాలలో బంధించిన దుర్మార్గులు, సోదరులను హత్య చేసిన నరహంతకులు గత చరిత్ర పుటలలో అనేక చోట్ల కనుపిస్తారు. అలాగాక జీవితలక్ష్యాన్ని గుర్తుచేసుకుంటూ భగవంతుడు తనకు ప్రసాదించిన ధనముతో అనేక దేవాలయాలు నిర్మించి, ధర్మకార్యాలు నిర్వహించి, ప్రజోపయోగ కార్యక్రమాలు చేపట్టి, నిర్విరామంగా ప్రజాక్షేమానికి కృషిచేసి ఆదర్శపురుషులుగా, చిరంజీవులుగా ఎందరో చరిత్రలో స్థిరంగా నిలిచిపోయారు.

ధనం చెడ్డదని, ధనాన్ని పరిత్యజించమని వయసు, అనుభవం రెండూలేని పిల్లలు చెబుతారు. ఆర్థికశాస్త్ర నిపుణులు అంగీకరించరు. ఇక సర్వశాస్త్ర పారంగతులైన శంకరుల విషయం వేరుగా చెప్పనవసరం లేదు. అందుచేతనే ధనమునుగాక ధనాశను వదలమని శ్రీ పూజ్యపాదులు చక్కగ ప్రవచించారు.

తృష్ణ చాలా భయంకరమైనది. "తృష్ణైవ జీర్ణా వయమేవ జీర్ణాః" వయసు గతించినా ఆశ నశించదు. శుక్లపక్షచంద్రునిలా వృద్ధి చెందుతూనే వుంటుంది. తృష్ణని సంతృప్తి పరచడమనేది అగ్నిలో నేయిపోసి ఆర్పడానికిచేసే ప్రయత్నము వంటిది. మన హృదయాలలో శాంతి మాయమగుటకు తృష్ణే కారణము. ప్రాపంచిక భోగాలపై మనకున్న ఆశయే మనలను భగవంతునికి దూరం చేస్తున్నది. పరమాత్మ పూజ్యపాదాలయందు మనసును క్షణకాలము నిలువనివ్వక బాధపెడుతున్నది.



మనం చేస్తున్న మోసం వెనుక, ప్రతి అమానుష కార్యం వెనుక నిశ్శబ్దంగా నిలబడి మనచే ఘోరకృత్యాలు చేయిస్తున్నది ఈ తృష్ణయే. మనం జీవించినంత కాలము నీడలా వెంటాడుతూనే యున్నది. అన్ని చోట్లకు మనతో కలసి ప్రయాణము సాగిస్తూనే యున్నది. రాజకీయాలలో మనం ప్రవేశిస్తే మనవెంట విశ్వాసంగా నడచి, ప్రభుత్వ ధనాగారాన్ని ధ్వంసం చేయించి, ప్రజల సౌఖ్యాన్ని కాలరాయించి, దేశ భవిష్యత్తును మంట గలిపేందుకు అడుగడుగునా సహకరిస్తున్న దుష్ట శక్తి తృష్ణయే. జీవనభృతికి వ్యాపారంలో కాలిడగానే ఛాయలా మనల ననుసరించి తన దుష్ట ప్రేరణతో నల్లబజారు వ్యాపారానికి పురికొల్పి ధర్మచ్యుతుల్ని చేస్తున్న మాయలమారి ఈ తృష్ణయే. అహంకార నర్తకి నేరాలనే పదసొంపులకు, ఘోరకృత్యాలనే హావభావ విన్యాసాలకు, లంచాలనే నాట్యముద్రికలకు, దారుణ హత్యలనే భంగిమలకు వెనుక శ్మశాన సంగీతాన్ని ఆలపిస్తూ నడచి, నడిపించే వికృతి ఎవరో కాదు అదే తృష్ణ. మానవ జీవితాకాశంలో కాళరాత్రి.

ఆశకు దాసుడైన మానవుడు దయ్యం పట్టిన ఉన్మాదిలా పరిభ్రమిస్తున్నాడు. అందుచేతనే విజ్ఞానశాస్త్రంలో పరాకాష్ట నందుకున్న నేటి మానవుడు బాహ్య ప్రపంచాన్ని ఎంతగా జయించగలిగాడో అంతశ్శత్రువులచే అంతగా అణగ ద్రొక్కబడ్డాడు.

Man can live high in the Air
And dive deep into the waters
But he is unable to live on earth

"నేటి మానవుడు విశాలాకాశంలో పక్షిలా విహరించ గలుగుతున్నాడు. అగాధమైన సముద్రాన్ని చేపలా ఈదుతున్నాడు. కానీ ఎందులకో భూమిమీద నిలువలేక పోతున్నాడు" అంటారు జార్జి బెర్నాడ్‌షా.

సర్వసంసార దుఃఖానాం తృష్ణైకా దీర్ఘ దుఃఖదా,
అన్తఃపురస్థ మపియా, యోజయత్యతి సంకటే.

ప్రపంచంలోని సమస్త దుఃఖాలలో తృష్ణ దుర్భరమైనది. అంతఃపురము నుండి కాలుబయట పెట్టక జీవించే వ్యక్తిని కూడా ఆశ తన ప్రభావంతో బయటకులాగి అనంత దుఃఖములో పడద్రోయగలదని శ్రీమద్రామాయణంలో శ్రీరామచంద్రమూర్తి తెలుపుతారు.

అదృష్టముచే కొందరు ఐశ్వర్యవంతులుగా జన్మించిననూ ఆశాపిశాచము వారిద్వారా ఏ మంచికార్యము జరుగనివ్వక లుబ్ధులుగా, వ్యర్థజీవులుగ మారుస్తున్నది. నిగ్రహించను వీలుగాని రీతుల్లో హృదయంలో ఆశ ఉన్నట్లయితే దానిని ప్రాపంచిక భోగముల కొరకు గాక భగవంతుని సాన్నిధ్యాన్ని చేరుటకు ఉపయోగించండి. పరితపించండి. బంధహేతువైన ఆశ మనిషికి లేని అంధత్వాన్ని ఆపాదించి అజ్ఞానానికి ఆహుతి చేస్తుంది.

మనసులో చెలరేగే ఆశల్ని అదుపులో ఉంచాలి. తృష్ణను తొలగించాలి. అందుచేతనే శ్రీశంకరులు "మనసి వి తృష్ణా" మనసులోని వికారాలను, తృష్ణను విడిచి పెట్టమన్నారు. ఆశలు అణగిన మనసు, తృష్ణతొలగిన అంతఃకరణ ప్రశాంతతకు నిలయము. పై విధంగా ఖాళీ అయిన మనసును అలాగే ఉంచితే ప్రమాద మెంతయినా కలదు. దీపం లేని ఇంటిలో దొంగలు సులువుగా ప్రవేశిస్తారు. మనసులో జ్ఞానజ్యోతిని వెలిగించాలి. నిరంతరము బ్రహ్మభావనతో మదిని నింపుకోవాలి. అట్టి హృదయములో ఆశారాక్షసి ప్రవేశించలేదు. తృష్ణవీడి ఖాళీయైన నిర్మల మనస్సును ఖాళీగా ఉంచక "కురుసద్బుద్ధిం" సత్యమును గూర్చిన భావములతో నింపమని శంకరులు ప్రబోధిస్తున్నారు.

ధనాశను వదలి జీవించమనగానే "మరి జీవించడమెలా?" అనే ప్రశ్న చాలామందిలో ఉదయిస్తుంది. అందుకు సమాధానంగా శ్రీ ఆచార్యులవారు "నీ కర్మానుసారంగా భగవంతుడు నీకు ప్రసాదించిన దానితో తృప్తిని పొంది మనసును ఆనందముగా ఉంచుకో"మని తెలియచేస్తున్నారు.

ప్రతికార్యానికి కారణం ఉండాలి. గతంలో మనమెన్నోకర్మలు ఆచరించాము. వాటి ఫలితాలే ఈనాడు చవిచూస్తున్నాము. కర్మజడము గనుక తనకు తానుగా ఫలితాన్నివ్వలేదు. [illegible]



తెలిసినవాడు అన్ని చోట్లవుండేవాడు ఇవ్వగలడు. తానెవరు? భగవంతుడే. అతడికే ఆపని సాధ్యం. అతడే మనకు కర్మఫలితాలిస్తున్నాడు. అర్హత కనుకూలంగా ఆనందం కలుగుతూవుంది. అతని చట్టాలే ఈ ప్రపంచాన్ని పాలిస్తున్నాయి. చేసుకున్నవారికి చేసుకున్నంత. ఆవకాయ దానానికి ఆత్మానందం వస్తుందా?

ఉన్నదానితో సంతృప్తి పొందడమే విజ్ఞుల లక్షణము. ప్రాప్తించినదానితో తృప్తిని పొంది జీవించాలి. అట్టి మనస్సులో సదా శాంతి విరాజిల్లుతుంది. అదే నిజమైన భాగ్యము. "సంతోషం పరమం ధనం" సంతోషమే నిజమైన ధనమని శాస్త్రం చెబుతుంది.

మానవుని ఆధ్యాత్మిక ప్రగతిని నిరోధించే ధనాశను గూర్చి వివరించిన శ్రీ ఆచార్యులు రాబోవు శ్లోకములో కామాన్ని గూర్చి హెచ్చరిస్తున్నారు.

నారీస్తనభర నాభీదేశం
దృష్ట్వా మాగా మోహావేశమ్
ఏతన్మాంస వసాది వికారమ్
మనసి విచిన్తయ వారం వారం 3

నారీ = యువతుల, స్తనభర = కుచభారములో, నాభీదేశమ్ = నాభి ప్రదేశమును, దృష్ట్వా = చూచి, మోహావేశం = మోహావేశమునకు, మాగా = చెందకుము, ఏతత్ = అది, మాంస = మాంసము, వస = క్రొవ్వు, అది = మొదలైనవాటి, వికారమ్ = మార్పుమాత్రమే, మనసి = మనస్సులో, వారం వారం = పదేపదే, విచిన్తయ = చిన్తనచేయు చుండుము.

భావము:- యువతుల స్థనములను, నాభీస్థలమునుచూచి మోహమును చెందకుము. నిన్ను భ్రమింపచేయు స్త్రీల సౌందర్యమంతయు మాంసము, వస మొదలగువాని

వికారములేగాని మరేమీకాదు. ఈ సత్యమును సదా
మనసులో విచారణ చేయుచుండుము.

## వ్యాఖ్య

ప్రాపంచిక విషయములపై మానవునికున్న వ్యామోహమే తనను మోక్ష సామ్రాజ్యంలో ప్రవేశించనీయక జనన మరణ సంసారములోపడి ఊగిసలాడునట్లు చేయుచున్నది. కామినీ కాంచనములను జయించినపుడే మానవుడు పరమ శాంతిని పొందగలడని శాస్త్రములు, మహాత్ములు తెలియచేయుచున్నారు. గడచిన శ్లోకములో కాంచన ప్రభావమును; దానిని జయించు తరుణోపాయమును తెలియపరచి, కామినీ ప్రభావమును గూర్చి ప్రస్తుత శ్లోకములో ఆచార్యులవారు విచారణ చేయుచున్నారు.

ప్రతి మానవునిలో లైంగిక ప్రధానమైన ఆవేశము స్వాభావికముగానే ఆవరించి వుంటుంది. వ్యక్తిలో అంతరంగికంగా బయలుదేరే ఈ ఆవేశాలు సంతృప్తి నొందుటకు బాహ్య ప్రపంచములో అన్వేషణ జరపడము కలదు. ఆవేశానికి ఆకృతి నివ్వడంలోనే వుంది జగత్తుయొక్క విశేషం. ఆవేశాలంతరించిన వ్యక్తికి ఈ ప్రపంచమొక నిరర్ధక శ్మశానం.

మానవ హృదయం నుండి బయలుదేరిన ఈ ఆవేశ ప్రవాహం జవరాండ్ర దేహసౌందర్యమనే సుడిగుండములో తగులుకొని మోహవలయంలో పరిభ్రమించే మిథ్యాజీవనానికి స్వస్తి చెప్పమని శ్రీశంకరులు ప్రబోధిస్తున్నారు. సత్యమును గ్రహించలేక తుచ్ఛమైన శారీరక వాంఛా ప్రేరిత పశుప్రవృత్తితో ప్రశస్తమైన మానవజన్మను వృథాచేసుకోవడం భావ్యంకాదని గుర్తుచేస్తున్నారు. కామోద్రేకాలతో కలుషితమై వ్యర్థమవుతున్న తేజోబలాన్ని క్రమపరచి, దారిమరల్చి, ఈశ్వర సాన్నిధ్యాన్ని చేరడానికి ప్రయత్నించాలి.

మానవుని భ్రమింపచేసే స్త్రీ దేహసౌందర్యం ఒక విచిత్ర మాయావరణ. వివిధ కళాభంగిమలతో విరాజిల్లి, చూచువారి నేత్రాలకు భ్రాంతి పొరలుకప్పి,



వారి మనసులను మోహింపచేసి మతిభ్రష్టులను చేస్తున్న స్త్రీ శరీరం ఒక అస్థిపంజరం. నవరంధ్రముల ఓటికుండ. రక్తమాంసాలతో కప్పబడి చర్మముతో నగిషీ చేయబడిన దేహమనే ఈ ఎముకలగూడు బాహ్యానికి సౌందర్యమందిరం కాదని, దుర్గంధపూరిత మలినకూపమని తేలుచున్నది. స్త్రీ శరీరంలోని ఏ కుచకుంభములను చూసి మానవుడు మోహ ప్రేరితుడగుచున్నాడో, ఏ నాభిప్రదేశమును గాంచి వివశుడై పిచ్చివాడిలా కేరింతలు పెడుతున్నాడో అవన్నియు మాంసపు ముద్దలని, రక్తమాంసజనిత వికారములని గ్రహించలేక పోతున్నాడు.

మసక చీకటిలో రాతిస్తంభాన్ని చూచి దొంగయని భయపడటం, చిందులువేయటం మనకు తెలిసినదే. స్తంభము తెలియక పోవడమువలననే భయభ్రాంతులు కలిగాయి. స్తంభమును చూడనంతవరకు దాని స్థానే మనిషి కనుపించడము, అతని వలన కలుగు అపాయములను మనసు ఊహించి కలత చెందడము జరిగినది. స్తంభమును చూడగానే అందు కనుపించిన మనిషితో సహా అతడు కలిగించు భయముకూడా మాయమగునట్లు సత్యమును దర్శించగానే అంతవరకు శోకమోహములకు గురిచేసిన అసద్వస్తువు అదృశ్యమగుచున్నది.

దేహ సౌందర్యమునందలి మన భ్రాంతి కూడా అలాంటిదే. దేహానికి మనమిచ్చే అసత్యపు విలువే దానికిలేని శోభను చేకూర్చింది. విచారణ చేయగా అందులోని సౌందర్యము నేతి బీరకాయలోని నేయివంటిదని తేలిపోతుంది. మలినపూరితమై క్రుళ్ళిపోయే ఒళ్ళు, రక్తధారలతో కంపుకొట్టే కళ్ళు, చావు బ్రతుకులమధ్య ఊగిసలాడే మాంసమయ శరీరము అజ్ఞానులకు ఆనందాలయము కావలసిందేకాని విజ్ఞులకు విహార క్షేత్రము కాబోదు. బుద్బుదమైన శరీరముపై వ్యామోహమును వీడి బుద్ధమై శుద్ధమై వెలుగు నిత్య, నిరామయ, నిరావరణ, నిరుపాధిక, నిరతిశయమైన, నిరంజన స్వరూపముపై మనస్సును లగ్నంచేసి నిర్వికల్పానందమును పొంది తరించడమే మానవుని కర్తవ్యము.

ఈ శ్లోకములో స్త్రీ సౌందర్యముపై మోహమును వదలమని హెచ్చరించుట కేవలం స్త్రీలను న్యూనతపరచి పురుషుల నుద్దేశించి ఉపదేశించినట్లు

భావించకూడదు. స్త్రీ సౌందర్యము పురుషుని ఎంత బలహీనునిగా చేయుచున్నదో పురుషుని ప్రభావము స్త్రీలమీద కూడా అలాగే వుంటుంది. కామ జయమే ముఖ్యము. ఈ విషయములో స్త్రీ పురుష భేదాలు లేవు. కనుక పురుషులు స్త్రీల విషయంలోను అలాగే స్త్రీలు పురుషుల విషయంలోను వ్యామోహితులు కాకుండా జాగరూకులై యుండవలెనని భావము.

"మనసి విచిన్తయ వారం వారం" ఈ విషయమును మనసులో మళ్ళీ మళ్ళీ చింతిస్తూ వుండమని శంకరులు హెచ్చరిస్తున్నారు.

కామం విషయంలో పూర్తిగా జయము కలిగిందని భావించి యథావిధిగా సంచరించడం సబబుకాదు.

మన్మథుడనెడి కిరాతకుడు స్త్రీలనెడి వలవేసి పురుషులనెడి పక్షులను పట్టి బాధించుచున్నాడని శాస్త్రము చెబుతున్నది.

విశ్వామిత్రులవంటి మహర్షుల తపోభంగం వెనుక కనుపించే నగ్నసత్యం కూడా ఇదే. కనుక సాధకులు కామ విషయంలో కడు జాగరూకులై మెలగాలి.

పరస్త్రీ కనుపించగానే ఆమె జగజ్జనని స్వరూపమని భావించాలి. అందమైన ఆమె ముఖంగాక ఆరాధ్యమైన ఆమె పాదాల్ని మొదట దర్శించాలి. తరువాత ముఖం చూడాలి. అప్పటికి నిగ్రహం కలుగకపోతే మానసికంగా ఆమె పాదాలకు సాష్టాంగ నమస్కారం చేయాలి. ఆమె పవిత్రపాదాలు కడిగి పూజిస్తున్నట్లు భావన చేయాలి. ఈ విధంగా ఎప్పటికప్పుడు మన హృదయంలో తిష్టవేసే మోహసైతానును తరిమి భగవంతుని ప్రతిష్ఠించుకోవాలి.

నళినీ దళ గత జల మతితరళం
తద్వ జ్జీవిత మతిశయ చపలం
విద్ధి వ్యాధ్యభిమాన గ్రస్తం
లోకం శోకహతం చ సమస్తం 4



నళినీ దళగతం = తామరాకు నాశ్రయించిన, జలం = జల బిందువు, అతితరళం = మిక్కిలి చలించునది, తద్వత్ = అలాగే, జీవితమ్ = మానవ జీవితము, అతిశయ = మిక్కిలి, చపలమ్ = చంచలమైనది, లోకం సమస్తమ్ = సమస్త ప్రపంచము, శోకహతం = దుఃఖపూర్ణమై, వ్యాధి = రోగాలచేత, చ = మరియు, అభిమాన = అభిమానముచేత, గ్రస్తం = కూడుకొన్నదై యున్నది, విద్ధి = తెలుసుకో.

భావము:- తామరాకుమీద నీటిబొట్టువలె జీవితము చంచలమైనది. ప్రపంచమంతయు రోగములతో, అభిమానములతో, శోకములతో పరితప్తమై యున్నదని తెలుసుకో.

## వ్యాఖ్య

ఆధ్యాత్మిక మార్గమున మానవుని ప్రగతిని నిరోధించు కామినీ కాంచనములను పరిత్యజించవలయునని గడచిన రెండు శ్లోకములలో బోధించి ఇప్పుడు మానవ జీవితము యొక్క అస్థిరత్వమును, ప్రపంచము యొక్క దుఃఖ స్వరూపమును ఈ శ్లోకమునందు ఆచార్యులు వివరించు చున్నారు.

మానవ జీవితము నీటిబుడగలాంటిది. ఈ క్షణము కనిపించినప్పటికి మరుక్షణం అగుపిస్తుందన్న నమ్మకం లేదు. చపల స్వభావము కలదై అతి స్వల్ప మనుగడను సాగిస్తున్నది. అందుచేతనే మానవ జీవితమును తామరాకుపై నుండు నీటిబొట్టుతో పోల్చారు శ్రీ శంకరులు. తామరాకుపైనుండు నీటిబొట్టు వివిధ కళాకాంతులు విరజిమ్ముతూ ముత్యమువలె ప్రకాశిస్తుంది. ఇంద్ర ధనుస్సులో గోచరించే రంగులతో తీర్చిదిద్దినట్లు శోభాయమానంగా కనిపిస్తుంది. కానీ ఏం ప్రయోజనం? గాలికొద్దిగ వీచి ఆకు చలించగానే ఇంతవరకు నిత్యనూతన కాంతిపుంజము లీనునట్లు అగుపించే ఆ నీటిబొట్టు పట్టుతప్పి, జారి, నీటిలో పడిపోతుంది. మెరుపులాంటి మానవజీవితమూ అలాంటిదే. జీవితమెంత ప్రకాశవంతముగ శోభిల్లుచున్నను, అష్టైశ్వర్యముల మధ్య భాసించు చున్నను, భోగభాగ్యముల మధ్య తులతూగుచున్నను, పాండిత్య ప్రకర్షలతో

సన్మానింప బడుచున్నను శాశ్వతముగ నిలిచేది మాత్రము కాదు. మృత్యుముఖంలో ప్రవేశించి అదృశ్యమయ్యే జీవితము పొంగి సాధించేదేమిటి? నింగి నావరించి వెలిగేది క్రొవ్వొత్తయినా చాలు పనులు చక్కబరచుకోటానికి. శోధించేదేమిటి? చెదిరిపోయే మతాబుల కాంతిలో మనకు ఒరిగేదేమిటి? నిలిచి

మనము దీర్ఘ కాలము జీవించినను అనంతకాల చక్రంలో అదొక క్షణకాలమే. సాధారణంగా మనకు స్వప్నాలు కలుగుతుంటాయి. మానవుడు నిద్రలో గాంచే కల తొంభై సెకండ్లకన్నా ఎక్కువ కాలం వుండదని మనస్తత్వ శాస్త్రజ్ఞులు తెలియజేస్తున్నారు. అతి స్వల్పకాలంలో మనం ఎంతో జీవితాన్ని సాగించినట్లు స్వప్నానుభూతిని పొందుతున్నాము. కల జరుగుతున్నంతవరకు ఆ స్వప్నము, అది జరుగు దీర్ఘ కాలము యదార్థముగనే తెలియు చున్నది. మెలుకువరాగానే కల అబద్ధము కావడమేగాక, స్వప్నము నడచిన కాలమూ క్షణికమని తేలుచున్నది. జాగ్రదవస్థ కాలమానంతో కొలిచినపుడు స్వప్నకాలమెలా క్షణికమో అనంత కాలపరిధిలో నుండి దర్శించగానే ఈ జాగ్రదవస్థ కాలము కూడాను ఒక దీర్ఘ స్వప్నము వంటిదని తేలిపోవుచున్నది.

మన మీ క్షణిక జీవితముపై ఏర్పరచుకొన్న మమకారాలు ఏదో ఒక క్షణాన మృత్యు ఖడ్గముచే తెగి ముక్కలు కాక తప్పదు. వస్తువులతో మనం కల్పించుకున్న సంబంధాలు, వ్యక్తులతో ఏర్పరచుకున్న అనుబంధాలు, తద్వారా పొందిన అనుభూతులు కాలగర్భంలో కలసిపోక తప్పవు. అనిత్యమైన జీవితముపై నిర్మించుకున్న ఆశాసౌధాలు పేకమేడలై కూలిపోక మానవు. అశాశ్వతమైన జీవితమును శాశ్వతమని భావించి, దానిని సుఖవంతము చేసికొనుటకు అమానుషకృత్యములు సాగించక క్షణికమైన మానవజీవితము యొక్క నిజ స్వరూపమును గ్రహించి, భ్రాంతి రహితుడవై, జీవిత విలువలను గుర్తించి జీవించమని శంకరులు హెచ్చరిస్తున్నారు.

ఈ శ్లోకము మొదటి పాదములో అనిత్యమైన మానవ జీవితము యొక్క నిజస్థితిని వివరించి, రెండవ పాదములో తాను నివసించే ప్రపంచము యొక్క దుఃఖమయ స్థితిని తెలియజేయుచున్నారు. వ్యాధులతో, అభిమానాలతో నిండిన



ప్రతివ్యక్తిలో శరీరము, మనసను రెండు పరికరములు తీవ్రంగా పనిచేస్తున్నాయి. మనస్సుకు శరీరానికి ఎంతో దగ్గర సంబంధమున్నది. శరీరము అనారోగ్యానికి గురైనపుడు మనసు ప్రశాంతతను కోల్పోతుంది. అలాగే మనోక్లేశముల ప్రభావము శరీర రుగ్మతలకు కారణమగుచున్నది.

మానవ శరీరము రోగభూయిష్టము. స్థూల శరీరాశ్రయముతో జ్వరము, క్షయ, తలనొప్పి, రక్తపోటు, క్యాన్సరు ఇత్యాది వ్యాధులు సంక్రమించి మానవునికి అనంత దుఃఖమును తెచ్చి పెడుతున్నవి. పుట్టుకలో దుఃఖము, పెరుగుటలో కష్టము, ముసలితన మొక భయంకర క్లేశము; మృత్యువొక అనివార్య శోకము.

స్థూల శరీరము నంటుకున్న వ్యాధులే గాక సూక్ష్మ శరీరాంతర్గత అభిమానము కూడా మానవుని భయంకర వాతావరణములో పడద్రోయు చున్నది. అజ్ఞానజనిత అభిమానమువలన మానవుడు సత్యజీవితమును సాగించలేకున్నాడు. ప్రతి వ్యక్తిలో అనంతమైన కోరికలు, ఈప్సితములు, రాగద్వేషములు కలసి అభిమానమనే రాక్షసిని పెంచుతున్నాయి. దినదిన ప్రవర్ధమానమవుతున్న ఈ అభిమాన రాక్షసి మానవ జీవన ప్రగతినే చావుదెబ్బ కొట్టి శాంతిని భగ్నం చేయుచున్నది.

ఎలుక చాలా చిన్న జంతువు. దాని దంతములు సుకుమారములు. అయినను గాదెలలోనున్న ధాన్యమును పాడుచేయుటలో దాని శక్తి అపారము. అలాగే ఈ అభిమానము ఎలుకవలె చిన్నదిగ గోచరించినను మనలోని విజ్ఞాన భాండాగారమునంతను పాడుచేయుననుటలో సందేహము లేదు.

"లోకం శోకహతం చ సమస్తం" అని పూజ్యపాదులు ప్రవచించడములో విశేషార్థము గోచరించుచున్నది. స్థూల శరీర ప్రాప్తమైన వ్యాధివలన కలిగెడి శోకము సూక్ష్మ శరీర జన్యమైన అభిమానమువలన కలిగెడి దుఃఖములతో లోకము శోకమయమై ఉన్నది. అంతేగాక లోక మనగా అనుభవ క్షేత్రము. మానవలోక మొక్కటియే లోకము కాదు. ఇచ్చట త్రిలోకములు కూడా విసర్జనీయమేగాని, వాంఛనీయము కాదని భావము. ఎన్నో జన్మల పుణ్యఫలితముగా సంప్రాప్తించిన ఇంద్రాది పదవులు ఆక్రమించినను "క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి" ఆ

పుణ్యము కాస్త ముగియగానే ఆ లోకాల్ని విడచి మానవ లోకానికి తిరిగి ప్రవేశించవలసి యున్నది.

లోకములు అస్థిరమైనందున దుఃఖమయము. ఈ విశ్వంలో ప్రతి వస్తువు పరిణామము చెందుతున్నది. పరిణామమే అనివార్య జీవన సూత్రము. దేశకాల నిర్మితమైన దృశ్య ప్రపంచ చరిత్రలో స్థిరత్వమనేది కుందేటి కొమ్ములాంటిది. అస్థిరమైన ప్రపంచము శాశ్వతమైన సుఖాన్నివ్వలేదు. కాని పరిపూర్ణమైన ఆనందము కావలయునని ప్రతి వ్యక్తి పరితపిస్తున్నాడు. మనిషిలో నిండియున్న అసంతృప్తియే ఈ పరితాపమునకు కారణము. ప్రస్తుతము తాను జీవించే అపరిపూర్ణ జీవితము నందలి వెలితియే సుఖాన్వేషణకు ప్రేరణయై కర్మలు చేయించుచున్నది. పరిపూర్ణతను పొందుటకు ప్రయత్నించు చున్నది. అంతటా వుండేదే పూర్ణత్వము. ఒకచోట వుండి మరొకచోట లేనిచో అది నశించే స్వభావముకలదవుతుంది. పూర్ణత్వము నశించేది కాదు. కనుక అంతా నిండినదై యుండాలి. అంతా తానై యున్నపుడు కర్మచేయుట అసాధ్యము. పరిమిత కర్మలు అపరిమిత ఆనందాన్నివ్వ జాలవు. జ్ఞాన మొక్కటియే మార్గము. అందుచేతనే ఈ శ్లోకములో "విద్ధి" తెలుసుకోమని పూజ్యపాదులు తెలియజేస్తున్నారు. తెలుసుకొనుమనగా విచారణచే గ్రహించమని అర్థము.

విషాన్నము వడ్డించబడినదని తెలియగానే ప్రాణహరణమైన ఆ భోజనము ఎలా త్యజించు చున్నామో అలాగే నీటిబుడగ అస్థిత్వముగల జీవితము యొక్క చంచలత్వమును, వ్యాధులతో అభిమానాలతో శోకతప్తమైన లోకముయొక్క యదార్థస్వరూపమును తెలుసుకొని నిస్సంగుడవై జీవించమని శ్రీ శంకరులు హెచ్చరిక చేయుచున్నారు.

యావ ద్విత్తో పార్జన సక్త
స్తావ న్నిజపరివారో రక్తః
పశ్చా జ్జీవతి జర్జర దేహే
వార్తాం కోఽపి న పృచ్ఛతి గేహే 5



యావత్ = ఎంతవరకు, విత్తః = ధనమును, ఉపార్జన = సంపాదించుటకు, సక్తః = శక్తి కలిగియుండునో, తావత్ = అంతవరకు, నిజపరివారః = తన పరివారమంతయు, రక్తః = అనురక్తితో యుందురు, జర్జర = శిథిలమైన, దేహే = దేహముతో, జీవతి = జీవించునపుడు, పశ్చాత్ = తదుపరి, కోఽపి = ఎవరుకూడా, గేహే = గృహములోనివారు, వార్తాం = కుశలమును, న పృచ్ఛతి = అడుగరు.

భావముః— నీవు సంపాదనపరుడవై యున్నంత వరకు నీవారనబడే పరివారమంతయూ నిన్ను ఆశ్రయించి యుందురు. వృద్ధాప్యమున నీ దేహము శిథిలమై శక్తి హీనమైనపుడు నీ ఇంటిలోనివారు కూడా నిన్ను కుశల మడుగరు.

## వ్యాఖ్య

భగవంతుడు ప్రతిమనిషికి ఏదో ఒక నైపుణ్యాన్ని ప్రసాదిస్తాడు. ఆయా నైపుణ్యాలతో వ్యక్తులు సమాజంలో గౌరవించ బడుతుంటారు. ఏ నిపుణత్వము లేని సాధారణ వ్యక్తి ప్రపంచములో అనామకుడవుతాడు. వ్యక్తులు ఏ శక్తి సామర్థ్యములచే గౌరవించబడుతుంటారో అవి క్షీణించినపుడు అదే వ్యక్తులు ఆ సమాజంలోనే చులకనై పోతారు. మనిషికి గౌరవ ప్రతిష్ఠలు తెచ్చి పెట్టే శారీరక మానసిక శక్తులు శాశ్వత పరిపుష్టిని కలిగియుండవు.

ప్రపంచము నంతటిని తన శారీరక బల ప్రయోగముతో జయించిన ఎందరో మల్లయోధులు అంత్యకాలంలో తమచుట్టు ముసురుతున్న ఈగలను తోలుటకు అశక్తులయ్యారు. తమ కళానైపుణ్యంతో నటసార్వభౌములని సన్మానాలందుకున్న ఎందరో కళాకారులు తమ చివరి దశలో తినను తిండిలేక రహదారులపై పడి ప్రాణాలు వదిలారు. ఏక చ్ఛత్రాధిపత్యంతో రాజ్యపాలన చేసిన ఎందరో చక్రవర్తులు సర్వం పోగొట్టుకొని నిలువ నీడలేక నడివీధులలో జీవనయాత్ర సాగించారు. ఇవన్నీ చరిత్రలో వ్రాసినవే. మనం కళ్ళారా చూసినవే.

నీవు సంపాదనపరుడవై యున్నంతవరకే పరివారమంతయు నిన్నాశ్రయించి యుందురని శంకరులు తెలియచేయుటలోని అంతర్భావమిదియే. సంపాదన అనగా కేవలం ధనార్జనయని భావించరాదు. ఆర్థికంగా, వైజ్ఞానికంగా, రాజకీయంగా, నైతికంగా, కళాత్మకంగా, ఆధ్యాత్మికంగా ఏ సంపదగల్గి పదుగురిలో వ్యక్తి గుర్తించబడి గౌరవించబడుచున్నాడో దానినే సంపాదన అనుపదము ద్వారా అర్థం చేసుకొనవలసియున్నది. మరి ఈ శక్తులన్నియు ఒకేవ్యక్తిలో శాశ్వతంగా గోచరించవు. అన్ని దశలలో అగుపించవు. అలా అగుపించనపుడు క్రమేపీ ఆ వ్యక్తి ఔన్నత్యము సమాజంలో క్షీణించడము జరుగుతూ వుంటుంది.

రెమ్మకు వ్రేలాడే పుష్పాన్ని ఫోటో తీయవచ్చుగాని అది విరజిమ్మే సౌరభాన్ని ఫోటో తీయలేము. మనిషి చేష్టల్ని గుర్తించగలముగాని వాటి వెనుక తిష్టవేసియుండే మనోభావాల్ని గ్రహించలేము. మానవుడు స్వార్థపరుడు. ఎదుటి వ్యక్తి శక్తి సామర్థ్యాలను గుర్తించి; గౌరవించి వాటిని తన మనుగడకు స్వార్థంతో ఉపయోగించుకోడానికి ప్రయత్నిస్తాడు. ఫలితాన్ననుభవిస్తుంటాడు. శక్తిసామర్థ్యాలు ఆ వ్యక్తిలో నశించగానే తనకు నిరుపయోగం గనుక త్యజిస్తాడు.

ధనికుడి చెంత చెరువులో చేరిన కప్పల పగిది జనం మూగుతారు. ధనం ఖాళీకాగానే చెప్పకుండా నడకసాగిస్తారు. రాజకీయంగా వ్యక్తి పదవిలో ఉంటేచాలు నమస్కార శరములతో ప్రత్యక్షం. పదవి ఊడగానే పలుకుబడి శూన్యం. వ్యక్తిలో సంగీత సాహిత్య నృత్య కళాకాంతులు విరజిమ్మబడుతున్నంత కాలము కళోపాసనంటూ అందరూ చుట్టూ చేరుతారు. జవసత్వాలుడిగి తనలోని కళ వ్యక్తం కానపుడు అదే కళోపాసకులు ఆరాధన కాదుకదా సానుభూతి కూడా చూపరు. మనసుకు కూడా హద్దులున్నాయి. సంఘంలో మహామేధావిలా జీవించి పదుగురిని ఆకర్షించిన వ్యక్తి వయస్సు మళ్ళగానే మనోస్థాయిని కోల్పోయి పసిబాలునివలె ప్రవర్తిస్తూ పొగిడిన వ్యక్తులచేతనే అపహాస్యం చేయబడుతాడు.

పూలల్లో తేమ, తేనె ఉన్నంతవరకే తేనెటీగలు వాలుతాయి. పూలు వాడగనే, రేకులు ఊడగనే అవి చెంతకైనా రావు. మానవ జీవితమూ అంతే. అందుచేతనే శ్రీ శంకరులు వృద్ధాప్యమున నీ దేహము శిథిలమై శక్తిహీనమైనపుడు నీ ఇంటిలోని వారు

శరీరము అనుక్షణము మార్పు చెందుతున్నది. చావటానికే పుట్టింది శరీరము. నశించే ఈ శరీర రక్షణ కొరకు సంసారము, భార్య, పిల్లలు, సేవకులు, పశువులు, ఇల్లు, వాహనాలు, బంధువులు ఇంకా ఎన్నిటినో మానవుడు ఏర్పరచుకుంటున్నాడు. శరీరము శిథిలావస్థకు రాగానే మనలోని శక్తిసామర్థ్యములు నశించగానే మనం ఏర్పరచుకున్న బంధాలలో కనిపించే మమతలు ఎండమావులలో నీళ్ళవంటివే.

ఈ నిజాన్ని గ్రహించి మనిషి సత్యపంథాలో నడకసాగించాలి. మానవజన్మ చాలా విలువైనది. ప్రశస్తమైనది. దాని ఉపయోగాన్ని గుర్తించి మనిషి ప్రవర్తించాలి. ప్రాపంచిక భోగలాలసత్వములో ఓలలాడేందుకుగాని, తన దుష్కర్మలచేత పాపపంకిలాన్ని మూటగట్టుకునేందుకు గాని మానవజన్మ రాలేదు. మానవ శక్తి సామర్థ్యాలపై విశ్వాసమనే భ్రాంతిని వీడి సదా భగవదారాధన బుద్ధితో జీవితాన్ని గడపటం అలవరచుకోవాలి. మృత్యువు ఆసన్నం కాకమునుపే శరీరములో పటుత్వము తగ్గక మునుపే భగవంతునియందు చిత్తము లగ్నం కావాలి. మానవ జీవిత లక్ష్యాన్ని దృష్టియందుంచుకొని ప్రతిక్షణము ఆ దివ్యస్థితిని పొందుటకు తీవ్రంగా యత్నించాలి.

ఇంద్రియ విషయాలు మాధుర్యముగా గోచరించినంతవరకు, బంధుమిత్రాదులే రక్షకులని భావించినంత కాలము, లోకమిచ్చే గౌరవ మర్యాదలు శాశ్వతమని తలచినంతవరకు మనిషికి సత్యము బోధపడలేదని భావము. తన సంపాదన అంతయు ఇతరులకు వినియోగించినను తన హృదయములో శాంతిని పొంది జీవించే ప్రయత్నాన్ని విడవకూడదు. లోకబాంధవ్యాలు, నిర్మించుకున్న ఆశాపాశాలు, వృద్ధాప్యంలో కోడెత్రాచులై కాటువేసేలోగా ఆత్మానందమనే అమృతపానం చేసి అమరులై, శాంతితో పరిమళించే జీవితమును అనుభవించుటకు అనుగుణ్యముగా ప్రతి వ్యక్తి తన జీవనయాత్రను సాగించాలి.

యావత్పవనో నివసతి దేహే
తావత్పృచ్ఛతి కుశలం గేహే
గతవతి వాయౌ దేహాపాయే
భార్యా భిభ్యతి తస్మిన్కాయే 6

పవనః = ప్రాణము, యావత్ = ఎంతవరకు, దేహే = శరీరమునందు, నివసతి = వుండునో, తావత్ = అంతవరకు, గేహే = ఇంటియందు, కుశలం = కుశలమును, పృచ్ఛతి = అడుగుదురు, దేహాపాయే = శరీరము అపాయానికి గురి అయి, వాయౌ = ఊపిరి, గతవతి = పోయినపుడు, భార్యా = అర్థాంగి కూడా, తస్మిన్ = ఆ, కాయే = దేహమును గూర్చి, బిభ్యతి = భయపడుతుంది.

భావము:– శరీరములో ప్రాణమున్నంత వరకు ఇంటిలోని వారు నిన్ను కుశలమడుగుదురు. ప్రాణము పోయి దేహము నశించే అపాయ స్థితికి గురియైనపుడు ఆ శరీరమును చూచి భార్య కూడా భీతి చెందుతుంది.

## వ్యాఖ్య

దేహభ్రాంతి కలిగి యుండుట వలననే మానవుడు అనిత్యమైన ప్రాపంచిక విషయ వాసనల వెంబడి నీడలా వెంటాడుతూ నడక సాగిస్తున్నాడు. బాహ్య ప్రపంచ సంబంధముచే ప్రాప్తించిన ఫలితములను శరీరములో అనుభవిస్తున్నాడు. దేహభ్రాంతి వదలగానే ప్రపంచ వ్యామోహము నశిస్తుంది. వ్యామోహము నశించిన వ్యక్తి ఆప్తకాముడై జీవిస్తాడు. అపరిపక్వ అవగాహనతో దేహభ్రాంతి నిర్మూలన కాదు. సంపూర్ణ సత్యదర్శనము భ్రాంతిని నిర్మూలించ గలదు.శరీరముపై మనకున్న భ్రాంతిని నిర్మూలించగలదు. శరీరముపై మనకున్న భ్రాంతిని తొలగించుటకు దేహము యొక్క యదార్థస్థితిని శంకరులు ఈ శ్లోకము ద్వారా తెలియజేయు చున్నారు.

పాంచభౌతికమైన శరీరాన్ని ఎంత చక్కగ పోషించినను, దైవ భావంతో ఆరాధించినను అది శాశ్వతంగా నిలిచేది కాదు. శ్మశానంలో ఒకనాడు పేర్చబడే పది కట్టెలలో తానొక కట్టెగాచేరి, కాలి, మాడి, బూడిదై పోతుంది. ఉవ్వెత్తున లేచి మరు క్షణములో అదృశ్యమయ్యే సాగర తరంగము వలె, మేఘావృతమైన ఆకాశమున మెఱయు మెరుపు వలె శరీరము అస్థిరమై క్షణికమై యున్నది.

తాను నివసించే గృహములో బాంబు పెట్టబడియున్నదని, అది ఏ క్షణమైనను ప్రేలి తనను సర్వనాశనం చేయునని గ్రహించిన వ్యక్తి ఆ ఇంటిలో



ఎంతకాలం ఉండగలడు? ఎలాంటి సాంగత్య మేర్పరచుకోగలడు? అలాగే మానవ శరీరము ఏ క్షణమైనను మృత్యువాతపడేదేనని తెలిసికొన్న వ్యక్తికి ఆ దేహముపై సంగత్వ మేముంటుంది? అభిమానం ఏం మిగులుతుంది?

కాలంలో వికసించింది కాలంలోనే నశిస్తుంది. కాల గమనంలో వచ్చి కదలిన శరీరము కాలంలోనే గతించి అదృశ్యమౌతుంది. నశించే శరీరముపై వ్యామోహమును పెంచుకొని దానిని సింగారించడములోను, వృద్ధి చేసుకొనుటలోను మానవుడు తన శక్తినంతా వృధా చేసుకొనుచున్నాడు. ఒకనాటికి మట్టిలో కలిసిపోయే శరీరముపై అర్థరహితమైన వ్యామోహమును వీడలేకున్నాడు. శరీరమున్నంత వరకే ఇంటిలో అందరూ మన క్షేమాన్ని గూర్చి ప్రశ్నిస్తుంటారు. ప్రాణం పోగానే ఆ శరీరాన్ని అసహ్యించుకుంటారు అని పూజ్యపాదులు హెచ్చరిస్తున్నారు.

ఓటి కుండలో పోసిన నీరు ఎలా కారిపోవుచున్నదో నవరంధ్రముల శరీరమనే ఓటి కుండలో ఆయువు అలా కరిగిపోతున్నది.

పశుపక్ష్యాదులు చనిపోగానే వాటి శరీరాలు సైతము ఏదో విధముగా ఉపయోగపడుచున్నవి. జపధ్యానాదులకు ఉపయోగించే ఆసనాలుగా కొన్ని జంతువుల చర్మాలు, అందమైన వస్తువులు తయారు చేయుటకు కొన్ని జంతువుల దంతాలు, కొమ్ములూ, వస్త్రాలు తయారుచేయుటకు కొన్ని జంతువుల రోమములు ఉపయోగపడుచున్నవి. ఒక్క మానవుని శరీరమే ప్రాణంపోగానే నిరుపయోగముగా మారుతున్నది. అందుచేతనే ఏ విలువలేక భయకంపితముగా క్షీణించే మానవ శరీరాన్ని చూచి భార్య కూడా భీతిచెందుతున్నదని శ్రీ శంకరులు తెలియచేయుచున్నారు.

ప్రాణం ఎగిసిపోయి దేహం రాలిపోగానే ప్రాణసమానంగా భావించి ప్రేమించే అర్థాంగి కూడా ఆ శరీరాన్ని సమీపించడానికి భయపడుతుంది. ఇంతవరకు ఏ భర్త శరీరాన్ని భగవంతుని శరీరంలా భావించి పూజించిందో, ఏ భర్త శరీరారోగ్యమే తన జీవిత పరమావధిగా భావించి ఆరాధించిందో, ఏ భర్త శరీర సుఖము తాను వాంఛింపదగినదంటూ మురిసిపోయిందో, ఏ భర్త శరీరము అరక్షణము కనుపించక పోయేసరికి నీటినుండి వేరుచేసిన చేపలా

దర్శించడానికి కూడా అల్లాడిపోయిందో, అదే భర్త శరీరాన్ని ఇప్పుడు దర్శించడానికి కూడా భయకంపితురాలై యున్నది. ఎందుకని? ఇంతలో ఏ మార్పు జరిగింది? తన భర్త శరీరము అక్కడే ఉంది. మామూలుగా కాదు, పూలమాలలతో, అత్తరు సుగంధాలతో, అగరువత్తులతో, నూతన వస్త్రాలతో శోభాయమానంగా ఆ శరీరం అలంకరించబడి వుంది. ఎంత అలంకరించిననూ ఆ శరీర దర్శనము ఆమె జీవితముపై విషాదగాలుల్ని తోలుచున్నదేగాని ప్రశాంతతను ప్రసాదించలేక పోతున్నది. తన భర్త శరీరము అచ్చట యున్నదేగాని అది తన భర్తకాదు. పూలమాలలమధ్య పవళించి యున్నది తన భర్తే అయితే తన దీనాలాపము చూస్తూ ఓదార్చకుండా ఉంటాడా? తన భర్త వెళ్ళాడు. శరీరం మిగిలింది. దహింపబడే దేహము, కుళ్ళడానికి ప్రారంభమైన శరీరము, దుర్గంధాన్ని వెదజల్లడానికి సిద్ధమవుతున్న మాంసపిండము త్వరితముగ ఆ మృతకళేబరాన్ని వల్లకాటికి తరలించడానికి తనవాళ్ళనుకున్న వారంతా చేస్తున్న ప్రయత్నాలన్నీ కళ్ళారా చూస్తూ ఆ శరీరాన్ని తన భర్తగా ఎలా భావించగలదు? పూజించగలదు? ఆరాధించగలదు?

పక్షి వెళ్ళగా పంజరానికి ఏం విలువుంటుంది? దేవుడులేని గుడి ఎలా పవిత్రమవుతుంది? నివాసము లేక పాడుపడిన ఇల్లు దయ్యాల కొంప కాకపోతుందా? కంపుకొట్టే ఈ రొంపి జీవితం దేహాభిమానం వల్ల వచ్చింది కాదంటారా?

శరీరము జడమేకాని చైతన్యంకాదు. మనతోపాటు మనం ధరించిన కళ్ళజోడు పయనించులాగున ఈ శరీరము కదులుచున్నది. కళ్ళజోడు తనకు తానుగా దేనినీ చూడలేదు. ద్రష్టనైన నేను కళ్ళజోడు ద్వారా దృశ్యమును గాంచుచున్నాను. శరీరము కూడా దేనినీ గ్రహించలేదు. చైతన్యమే శరీరము ద్వారా సర్వము తెలుసుకొనుచున్నది. చైతన్యము శరీరము ద్వారా పనిచేయడము ఆగిపోగానే దేహము కదలిక లేనిదై నశించు స్వభావము కలదిగ మారుచున్నది. కానీ చైతన్యము పనిచేయుటకు శరీరము పరికరమై యున్నది.

శరీరముపై భ్రాంతిని వదలమంటే శరీర శుభ్రతయందు, పోషణ యందు అశ్రద్ధ వహించమని కాదు. అలాచేయడముచేత మరికొన్ని క్రొత్తసమస్యల్ని సృష్టించుకోవడము అవుతుంది. ఆత్మజ్ఞానమును పొందు నంత వరకు సాధన పరికరమైన శరీరమును ఆరోగ్యముగా ఉంచుకొనవలయును. మనం ప్రయాణం చేసే సైకిలును నిత్యము శుభ్రము చేయనిచో ఎలా త్రుప్పుపడుతుందో, మనం నివసించే గృహాన్ని పరిశుద్ధ మొనర్చనిచో ఎలా అపరిశుభ్రమవుతుందో అలాగే మన మనుగడకు ఆధారమైన శరీరాన్ని పరిశుభ్రంగా ఉంచనిచో దుర్గంధ భూయిష్టమై, రోగనిలయమై సాధననే వక్రింప చేస్తుంది. మనం నివసించే ఇల్లు ఉపయోగించే సైకిలు మనమెలా కాదో అలాగే శరీరము మనకన్నా భిన్నమని గ్రహించాలి.



బాలస్తావ త్క్రీడాసక్త
స్తరుణ స్తావ త్తరుణీ సక్తః
వృద్ధస్తావ చ్చిన్తాసక్తః
పరసే బ్రహ్మణి కోపి న సక్తః 7

బాల = బాలుడుగా, తావత్ = ఉన్నంతవరకు, క్రీడా = ఆటలయందు, సక్తః = ఆసక్తితో వుండును, తరుణః = యౌవనవంతుడుగా, తావత్ = ఉన్నంతవరకు, తరుణీ = స్త్రీయందు, సక్తః = ఆసక్తితో యుండును. వృద్ధః = వృద్ధుడుగా, తావత్ = ఉన్నంతవరకు, చిన్తా = చింతలలో, సక్తః = ఆసక్తుడై యుండును, పరసే = పరమమైన, బ్రహ్మణి = బ్రహ్మ పదార్థమునందు, కోఽపి = ఎవరుగాని, నసక్తః = ఆసక్తిని చూపరుకదా!

భావము:- బాల్యమంతయు ఆటలలో గడచిపోవును. యౌవనములో స్త్రీ సంబంధమైన విషయాసక్తిలో మునిగి యుండును. ముసలితనములో చింతలలో కుమిలి పోవుచుండును. పరబ్రహ్మముపై ఏ ఒక్కరు ఆసక్తిని చూపడం లేదుగదా?

## వ్యాఖ్య

లక్ష్యములేని జీవితము గమ్యము తెలియని ప్రయాణము వంటిది. జీవితములో ఒక లక్ష్యమనేది లేక ఆయా దశలలో కలిగే ప్రకృతి జన్యమైన బలహీనతలకు బానిసయై నిరర్థక జీవితమును గడుపు మానవుని అయోమయ బ్రతుకును పూజ్యపాదులు ఈ శ్లోకములో వివరించు చున్నారు.

"జంతునాం నరజన్మ దుర్లభం" మానవజన్మ లభించడం చాలా దుర్లభము. విజ్ఞాన వంతుడుగా జన్మించడమే ప్రాణికోటిలో మానవుని విశిష్టత. మంచి చెడులను విచక్షణచేయు మనసు కలిగి యుండటమే అతని ఆధిక్యతకు కారణము. మనసు కలిగిన మానవునికి ప్రతి విషయాన్ని గురించి ఆలోచించే శక్తి, తన కిష్టమైన విషయాన్ని ఎంపిక చేయు నైపుణ్యము వుంటుంది. రెండు రహదారులు కలిసేచోట నిలబడి ఎటు వెళ్ళాలో ఆలోచిస్తాడు. రెండు థియేటర్ల మధ్య నిలబడి ఏ సినిమా చూస్తే బాగుంటుందా? అనే సందిగ్ధములో పడతాడు. రెండు పుస్తకాలు చేతపట్టుకొని ప్రస్తుతం ఏ పుస్తకం చదివితే బాగుంటుందనే సంశయములో వుంటాడు. ఆవిడగారు పాకశాలలో కూర్చొండి ఏ పదార్థము వండితే బాగుంటుందా? అనే సందేహములో మునకలేస్తుంటారు. ఇలా అనుక్షణము మానవ మస్తిష్కములో ఎంపిక జరుగుతూనే ఉంటుంది.

మానవుడు మనసులో తీసుకొనే నిర్ణయాలు శరీరం ద్వారా కర్మలుగా వ్యక్తమవుతుంటాయి. మానవుడు చేయు కర్మలద్వారా వచ్చే ఫలితాలను దృష్టియందుంచుకొని వాటిని రెండు మార్గాలుగా మహర్షులు నిర్ణయించారు. వాటినే శ్రేయస్సు-ప్రేయస్సు అని కఠోపనిషత్తులో యమధర్మరాజు నచికేతునకు తెలియచేస్తాడు.

మానవునికి శ్రేయస్సు నిచ్చునది ప్రియముగ ఉండకపోవచ్చును. ప్రియమైనటు వంటిది శ్రేయోదాయకమని చెప్పలేము. ప్రేయోమార్గములో ఫలితాలు త్వరగా ప్రాప్తిస్తాయి గనుక సౌలభ్యము కన్పిస్తుంది. శ్రేయోమార్గములో ఫలితములు సుదూరములో [illegible]



శారీరక మనోబుద్ధులకు సంబంధించినది గనుక ప్రేయోమార్గము సుఖకరముగ కన్పిస్తూ శ్రేయస్సును పొందుటకు చేయు ప్రయత్నములను ఆటంకపరచి దారి మరల్చును. శ్రేయోమార్గము అతీంద్రియమైన ఆత్మానందము నొసంగునది కావున దేహధ్యాసకు వ్యతిరేకము. అందుచేత ప్రియముగా అనిపించదు.

విజ్ఞానియైన మానవుడు మోహదాయకమైన శ్రేయోమార్గము ననుసరించి ప్రేయస్సును త్యజిస్తాడు. బుద్ధిహీనుడై ఆత్మానాత్మవివేకజ్ఞానము తెలియని మూర్ఖుడు శ్రేయస్సును విడిచి పెట్టి ప్రేయో మార్గములో ప్రయాణము సాగిస్తాడు. ప్రేయస్సు ననుసరించిన వ్యక్తికి ఏ వ్యక్తులవల్ల తాత్కాలిక ఆనందము కలుగుచున్నదో ఆయావ్యక్తులు, వస్తువులు శాశ్వతముగా వుండేవికావు. కనుక వాటివలన వచ్చే ఆనందము కూడా శాశ్వతముగా వుండేదికాదు. శ్రేయస్సు పరమాత్మకు సంబంధించినది గనుక నశించే ప్రశ్నలేదు. శ్రేయస్సు వలన కలిగే బ్రహ్మానందము శాశ్వతమై, అక్షయమై వుంటుంది.

శ్రేయస్సు ప్రేయస్సులనునవి తూర్పు పడమరల వంటివి. రెండూ ఒకచోట వుండవు. శ్రేయస్సును కాంక్షించువాడు ప్రేయస్సును విసర్జించక తప్పదు. ప్రేయస్సును ఆపేక్షించువాడు శ్రేయస్సును త్యజించక తప్పదు. ముముక్షువు సదా శ్రేయస్సునే కాంక్షిస్తాడు. మందబుద్ధి ప్రేయస్సునే వాంఛిస్తాడు.

మానవుని జీవితము వివిధ కోణాలనుండి పరిశీలించి అన్ని దశలలో ప్రేయస్సునే అనుసరిస్తూ పతనమవుతున్న వ్యక్తి అశక్తతను గమనించి ఈ శ్లోకములో ఆచార్యులవారు ఆశ్చర్యమును వ్యక్తం చేయుచున్నారు.

మానవజీవన యాత్రలో మొదటి సోపానము బాల్యము. బాల్య దశయందు ప్రతివ్యక్తి ఆటపాటలయందే కాలము గడుపును. వికసించని మనస్సు, విరబూయని హృదయము జీవితవిలువల్ని గుర్తించి, మసలుకొనే స్థితిలో వుండవు. శక్తిహీనమైన శరీరముతో, పేలవమైన మనస్సుతో, క్రీడలయందు ఆసక్తి చూపును. ఈ క్రీడా విలాసములందే బాల్యదశ గడచిపోతుంది.

రెండవది యౌవనము. యౌవనములో శరీరము, మనస్సు పక్వదశకు వస్తాయి. మనస్సు పుష్టికలదై జోరుగా ఆలోచనలు సాగిస్తుంది. ఆలోచనాజన్యమైన

ఆవేశము జీవితమును శోధించుటకు ప్రయత్నిస్తుంది. ఈ పరిశోధనలు, ప్రయత్నములు మానవుని భవిష్యత్తును తీర్చిదిద్దే ఆశాకిరణాలు కాకపోగా, స్త్రీ వ్యామోహమనే చీకటి కోణాల్లో పయనించి నిరర్థకమగుచున్నవి. కామవాంఛలు దుఃఖహేతువులు. ఇంద్రియములు యమదూతలు. మనసే మనకు శత్రువు. అందుచేతనే కామమును నరక ద్వారముగా శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీతలో ప్రవచించారు. స్త్రీ అనెడి నది మానవుని గొనిపోయి సంసారమను సముద్రములో పడద్రోయును గాన అగాధమైన సంసార సముద్రములో మునిగి పోవుటకు ఇష్టపడని వారు స్త్రీ అనెడి నదికి దూరముగా ఉండవలయునని భర్తృహరి సుభాషితములో తెలియచేస్తారు.

మూడవది వృద్ధాప్యము. ఇదొక వ్యాధి గ్రస్తమైన భయంకర నరకము. జీవన యాత్రలో ఇది ఆఖరిమెట్టు. మానవజీవిత గ్రంథములో చివరి పుట. మానవుడు జీవితములో ఎన్నో అనుభవాలు గడిస్తుంటాడు. అనుభవాలే అనుభూతులై మనసులో నిండివుంటాయి. అనుభూతులే మనిషిని ప్రేరేపించి సంకల్పాలను కదిలిస్తుంటాయి. కర్మలు చేయిస్తుంటాయి. గత జీవిత కాలంలో చేసిన ఆలోచనలు, చూసిన అభిరుచులే ప్రస్తుతము తొంగిచూస్తుంటాయి. మానవుడు బాల్య యౌవన దశలలో శ్రేయోమార్గములో పయనించినపుడు వృద్ధాప్యంలో తత్సంబంధిత అనుభూతులే అందుబాటులో ఉంటాయి. యౌవనములో ఏ విధమైన వ్యామోహమునకు లోనై ప్రవర్తించాడో దానివలన ఏర్పడిన మమతలతో, అభిమానాలతో, బాంధవ్యాలతో వృద్ధాప్యంలో సతమతమవుతాడు. బాధలతో, భయాలతో చెదిరిపోతుంటాడు. భార్యాపుత్రులును గూర్చి ఆలోచిస్తూనో, బంధువులను గురించి చింతిస్తూనో మనుమడి ఉద్యోగానికి మురిసిపోతూనో, మనుమరాలి విద్యను ప్రశంసిస్తూనో కాలాన్ని గడుపుతుంటాడు. జీవిత సంధ్యాకాలంలో కూడా భగవంతునిపై మనసు మరలక అనిత్యమైన సంసారిక జీవితాన్నే మననం చేసుకుంటూ అప్రయోజకుడై హరించి పోతున్నాడు.

*Thou shouldst not have been old*
*before thou hadst been wise*

“వృద్ధుడవు గాకమునుపే జ్ఞానవృద్ధుడవు కమ్ము”ని షేక్స్పియర్ అభిప్రాయం.

బాల్యమున ఆటలలోను, యౌవనమున స్త్రీల ధ్యాసతోను, ముసలితనములో చింతలతోను మానవుడు జీవనయాత్ర చేయుచున్నాడు. సత్యమైన పరబ్రహ్మపై ఆసక్తి చూపేవారు ఒక్కరైనను లేరని శంకరులు విస్మయ మొందుచున్నారు.

మనసు బహిర్ముఖమవుతున్నంత వరకు జీవితము భగవంతుని వైపు మరలదు. సత్యమును గ్రహించి భగవంతునిపై మరలిన మనసు తిరిగి బాహ్య ప్రపంచములో తగులుకోదు. భగవంతుని తెలుసుకొనుటకు వచ్చిన మానవజన్మను దారి మరల్చి తుచ్ఛమైన మిథ్యాజీవనాన్ని కొనసాగించే మానవుని అసమర్థతను చూచి శంకరులు ఆశ్చర్యమును వ్యక్తం చేయుచున్నారు.

కా తే కాన్తా కస్తే పుత్రః
సంసారోఽయ మతీవ విచిత్రః
కస్య త్వం కః కుత ఆయాతః
తత్త్వం చిన్తయ తదిహ భ్రాతః 8

తే = నీయొక్క, కాన్తా = అర్ధాంగి, కా = ఎవరు?, తే = నీయొక్క, పుత్రః = పుత్రుడు, కః = ఎవరు?, అయం = ఈ, సంసారః = సంసారము, అతీవ = మిక్కిలి, విచిత్రః = విచిత్రమైనది, త్వం = నీవు, కస్య = ఎవరివాడివి, కః = ఎవరునీవు?, కుతః = ఎక్కడినుండి, ఆయాతః = వచ్చినావు?, భ్రాతః = సోదరుడా, తత్త్వం = ఈ తత్త్వమును, తదిహః = ఇక్కడే, చిన్తయ = చింతనచేయుము.

భావము:– నీభార్య ఎవరు? నీకుమారుడెవరు? చాలా విచిత్రమైనదీ సంసారము. నీవెవరివాడవు? ఎక్కడ నుండి వచ్చావు? సోదరా! తత్త్వచింతనచేయుము.

## వ్యాఖ్య

మానవుని భవబంధాలలో పడత్రోసే ఆకర్షణలు ఎక్కడనుండి వచ్చాయి? ఆత్మసామ్రాజ్యమును వదలి సంసార ఘోరారణ్యంలో పరిభ్రమించే అగచాట్లు

మానవునికి ఎందుకు కలిగాయి? మానవునికి యదార్థముగా బంధమున్నదా? అదొక విచిత్ర ఆరోపిత సమస్య. యదార్థానికి జీవుడు దేవుడేగాని అన్యము కాలేదు. తాను ఎవరో తనకు తెలియక పోవడమే బంధములనెడి అనర్థములకు కారణము. దానికి విచారణ కన్నా మరోమార్గం లేదు.

మనక చీకటిలో త్రాడునుచూచి పామని భ్రమచెందడము జరిగింది. ఇప్పుడు ఆరోపిత సర్పాన్ని వెళ్ళమని కేరింతలు పెట్టటం, గంతులువేయడం, చిందులు త్రొక్కడం, చప్పట్లు చరచడం, రాళ్ళతో, కట్టెలతో కొట్టడం వలన అక్కడ లేని సర్పాన్ని దూరం చేయలేము. సర్పము భ్రాంతి జన్యమైనది. అది మనసులో కల్పించబడిన సమస్యయై యున్నది. సమస్యను అర్థం చేసుకోవడం వల్లనే సమస్య పరిష్కారమవుతుంది. విచారణ ఒక్కటే దానికి మార్గము. మానవుని అజ్ఞాన జనిత సంసార బంధములను ఖండించుటకు విచారణే ఖడ్గము గనుక ఈ శ్లోకములో శ్రీ శంకరులు చక్కగా తత్త్వవిచారణ చేయుచున్నారు. సంసార చక్రానికి నిన్ను బంధించిన నీ భార్యాపుత్రాదులెవరు? వారికి నీకు వాస్తవిక సంబంధమేమిటి? విచారణ చేయమని పూజ్యపాదులు ప్రశ్నిస్తున్నారు.

పుట్టుకలో భార్యాబిడ్డలతో కలసి మనం జన్మించలేదు. నీవు ఒకచోట జన్మించావు. అలాగే నీ భార్య మరొకచోట జన్మించింది. పెళ్ళి చూపులంటూ ఏ పదిమందినో చూశాక పదకొండో ఆవిడను మెచ్చి పెండ్లాడావు. మెడలో ముడి, బ్రతుకులో చిడి ప్రారంభమైంది. అప్పటికి కుమారుడు లేడు. కొంతకాలానికి పుత్రుడు జన్మించాడు. సంసార వృక్షం అల్లుకు పోయింది. మమతలు పెనవేసుకున్నాయి. బంధాలు గట్టిపడ్డాయి. భార్యాబిడ్డల్ని చూడకుండా ఒక్కక్షణం మనలేని స్థితి మనసుకు ప్రాప్తించింది. ఎంతవరకీ బంధము? పెంచుకున్న ప్రేమాభిమానాలు, ఉంచుకున్న ఆప్యాయతానురాగాలు త్రెంచుకొని తాను ఒంటరిగా శ్మశానానికి కదలిపోవాలి. వైధవ్యాన్ని పొంది ఆవిడ విషాదంతో బ్రతకాలి. జన్మనిచ్చిన పుణ్యానికి తలకొరివి పెట్టటానికి తనయుడు ముందుకొస్తాడు. ఒకవేళ ముందుగా భార్యే నిష్క్రమిస్తే చేసేది ఏమీ లేదు గనుక చేసిన సంసారాన్నే నెమరువేసుకొంటూ బరువు బ్రతుకును ఈడ్చుకుంటూ వెళ్ళాలి.



కలిసినట్టే కలిసి విడిపోతున్నాము. చేరినట్లే చేరి చెదిరిపోతున్నాము. రాకపోకల రహదారిలో సంసార మొక మజలీ అయిపోయింది.

"ఇదంకాష్ఠ మిదం కాష్ఠం నద్యాం నగతి సంగతః
సంయోగాచ్చ వియోగాచ్చ కా తత్ర పరివేదన"

నదీ ప్రవాహములో రెండు కట్టెపుల్లలు కొట్టుకొని వస్తుంటాయి. ఆ రెండు కట్టెలు ఒకచోట కలుస్తాయి. కొంతదూరం ప్రయాణము చేస్తాయి. నదీ ప్రవాహంలో జనించిన కెరటమే ఆ రెండు కట్టెలను విడదీస్తుంది. ఇక మళ్ళీ ఆ కట్టెపుల్లలు కలుస్తాయని చెప్పలేము. జీవితమనే ప్రవాహములో కాలమనే కెరటం భార్యాభర్తల్ని కలిపి సంసార మనే ప్రయాణాన్ని కొనసాగిస్తుంది. కలిపిన నదీకెరటమే నిర్దాక్షిణ్యంగా విడదీస్తుంది. కాలంలో కలసి కాలంలోనే అంతరించిపోతున్న ఈ బంధాలు ఎంత విచిత్రమైనవి? అందుచేతనే "సంసారోయ మతీవ విచిత్రః" విచిత్రమైనదీ సంసార మంటూ శంకరులు తెలియజేయుచున్నారు.

సత్రములో ఒకరాత్రి కలిసి మజలీచేయు యాత్రికులవలె, రాత్రిపూట నానాదిక్కులనుండి వచ్చిన పక్షులు ఒకేచెట్టుపై విశ్రమించి సూర్యోదయంతో ఎవరిమార్గాన్ని అవి అనుసరించులాగున ఈ ప్రపంచములో మన రాకపోకలు సాగుతున్నాయి.

*The world is a stage*
*And all the men and women merely players*
*They have their exits and entrances.*

"ఈ ప్రపంచమొక రంగస్థలి. ఇందు ప్రవేశించు స్త్రీ పురుషులు నాటకంలోని నటులవలె వచ్చిపోతుంటారు". అని షేక్స్పియర్ అంటారు. ప్రపంచ రంగస్థలిపై సంసారమనే నాటకంలో భార్యాబిడ్డలనే నటీనటులు ప్రవేశించి వారి పాత్రలను వారు చక్కగా అభినయించి నిష్క్రమిస్తుంటారు.

నీ వెవరివాడవో ఎక్కడనుండి వచ్చావో విచారణ చేయమంటున్నారు శ్రీశంకరులు. నేను ఎవరివాడనుకాను. శరీరము ఇతరులతో సంబంధము

కలిగియున్నను, నేను ఎవరికి సంబంధించిన వాడనుకాను. ఎక్కడనుండో వచ్చినవాడనుకాను. నేను పుట్టుక లేనివాణ్ణి. పుట్టుక లేని వానికి మరణమెలా వుంటుంది?

నజాయతే మ్రియతే వా కదాచిత్
నాయం భూత్వా భవితా వా న భూయః
అజో నిత్య శ్శాశ్వతోఽయం పురాణో
న హన్యతే హన్యమానే శరీరే

"ఈ యాత్మ ఎప్పుడును పుట్టుట లేదు. చచ్చుట లేదు. గతంలో లేకుండా క్రొత్తగా ఏర్పడినది కాదు. భవిష్యత్తులో లేకపోయేది లేదు. ఆత్మశాశ్వతము, పురాతనము. శరీరము చంపబడినను ఆత్మ అమరము" అని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీత 2వ అధ్యాయం సాంఖ్యయోగములో తెలిపారు.

కుండ పుట్టిందేగాని కుండలోని ఆకాశం పుట్టలేదు. కుండ నశిస్తుంది కాని అందులోని ఆకాశము నశించదు. కుండ పుట్టడమువలన కుండలోని ఆకాశమని వ్యావహారికంగా పిలుస్తున్నాము. ఆకాశము కుండతో పుట్టలేదు. కుండతో నశించేదిలేదు. ఆకాశములోనే కుండ తయారైంది. ఆకాశము ఎక్కడుంది? ఎక్కడ నుండి వచ్చింది? అంతటా నిండియున్నది గనుక ఒకచోట నుండి వచ్చే ప్రసక్తే లేదు.

శరీరం కుండలాగే పుట్టింది. కుండలాగే నశిస్తుంది. చైతన్యము పుట్టుక లేనిది గనుక నశించదు. చైతన్యములోనే శరీరం తయారైంది. చైతన్యములోనే చరిస్తున్నది. చైతన్యములోనే లయిస్తుంది. నేను చైతన్యమే గనుక ఎవరివాడను కాను. ఎక్కడనుండో వచ్చినవాడను కాను.

"తత్త్వ విచారము పై విధముగా జరిపి సత్యమును గ్రహించు సోదరా?" అని శంకరులు మృదు మధురంగా తెలియచేస్తున్నారు.

మొదటి శ్లోకంలో "మూఢుడా" అని సంబోధించిన ఆచార్యులు ఈ శ్లోకములో "సోదరా" అని పలుకరిస్తున్నారు. అజ్ఞానముచే చీకటిలోపడి దారి



తెన్ను తెలియక వ్యవహరిస్తూ కాలాన్ని వృథా చేసుకొను వ్యక్తిని "మూఢుడా" అని మందలించారు. ఇంతవరకు పూజ్యపాదుల బోధతో ఉత్తేజితుడై ప్రభావితమైన అంతఃకరణము గల ముముక్షువును ఆధ్యాత్మికంగా ఇంకా పరిపుష్టిని కలిగించు స్థితికి గొనిపోవు నుద్దేశ్యముతో "సోదరా" అని ప్రేమపూరితంగా పిలుస్తున్నారు.

భార్యాబిడ్డలను గూర్చి విచారణ చేయుమనగానే సంసారాలను వదలి సన్న్యాసమును స్వీకరించమని భావము కాదు. సంసారాలను వదలి వెళ్ళినంత మాత్రాన సమస్యలు పరిష్కారం కావు. భగవద్గీతను బోధించిన శ్రీకృష్ణపరమాత్మ సంసారానికి దూరం కాలేదు. భగవద్గీతను వినిన అర్జునుడు సన్న్యాసం తీసుకోలేదు. భగవద్గీతను వ్రాసిన వ్యాస భగవానుడు భార్యాపుత్రులను విడిచి పెట్టలేదు. వదల వలసింది మనసులోని భ్రాంతినే గాని సంసారాన్ని కాదు.

మనసులోని మాలిన్యాన్ని తొలగించి, అంతఃకరణను శుద్ధిపరచుకొని దేహములో దేవుని, మృణ్మయమైన శరీరంలో చిన్మయుని అన్వేషించాలి. దర్శించాలి.

"అన్తశ్శరీరే జ్యోతిర్మయోహిశుభ్రో
యంపశ్యన్తి యతయః క్షీణదోషాః"

శరీరములోపల జ్యోతిస్వరూపమై వెలుగుచున్న ఆత్మను పాపరహితులగు మహాత్ములు దర్శించుచున్నారని ముండకోపనిషత్తు తెలియచేయుచున్నది.

సత్సంగత్వే నిస్సంగత్వం
నిస్సంగత్వే నిర్మోహత్వమ్
నిర్మోహత్వే నిశ్చల తత్త్వం
నిశ్చల తత్త్వే జీవన్ముక్తిః 9

సత్సంగత్వే = మంచి సాంగత్యమువలన, నిస్సంగత్వ = అసంగత్వము, నిస్సంగత్వే = అసంగత్వమువలన, నిర్మోహత్వమ్ = మోహము లేకుండుట, నిర్మోహత్వే = మోహము లేకపోవుటచే, నిశ్చల = దృఢమైన, తత్త్వం =

తాత్త్విక దృష్టి, నిశ్చలతత్త్వే =సత్యదృష్టివలన,జీవన్ముక్తి = జీవించి యుండగనే ముక్తి.

భావము:- సత్సంగత్వము వలన అసంగత్వ మేర్పడుతుంది. అసంగత్వమువలన మోహ భ్రాంతి తొలగుతుంది. మోహము నశించగానే మనసు నిర్మలమవుతుంది. నిర్మలమైన మనసే జీవన్ముక్తికి కారణమవుతుంది.

## వ్యాఖ్య

ప్రతిజీవికి మోక్షాపేక్ష వుంటుంది. ఆనందంగా సదా ఉండాలని యత్నిస్తుంటాడు. శోకానికి దూరంకావాలని ప్రయత్నిస్తుంటాడు. జీవిత దుఃఖాలనుండి విడిపడాలని, శాశ్వతానందంలో ఓలలాడాలని పరితపిస్తుంటాడు. భగవంతుని పొందుటయే అందులకు శరణ్యమని తెలుసుకుంటాడు. ప్రవచనాలు వింటాడు. గ్రంథాలు చదువుతాడు. కానీ మోహభ్రాంతిలో, ఇంద్రియాల పెనుగులాటలో అశక్తుడై అన్యాయమైపోతాడు. సూర్యుని గ్రహణం పట్టినట్లు మనసును భ్రాంతి ఆవరించి మరుగున పడద్రోస్తుంది. మానవజీవితము అల వృథాగాకుండా సదా భగవంతుని దృష్టి యందుంచుకొను విధానమును, జీవన్ముక్తుడై వసించు మార్గమును ఈ శ్లోకములో గురుదేవులు తెలియచేయు చున్నారు.

భగవంతునిపై మనసు మరలక పోవుటకు సంసారిక వ్యామోహమే కారణము. ప్రాపంచిక విషయ వాసనల నుండి విడివడి నిస్సంగుల మైనపుడే భగవంతునివైపు మరలగలము. నిస్సంగుడవై జీవించాలంటే మార్గము సత్సం మొక్కటే. సత్సంగత్వము వలన నిస్సంగత్వము ప్రాప్తిస్తుందంటున్నారు శ్రీ శంకరులు.

సత్సంగత్వమును పదమును విశాల భావంతో అర్థం చేసుకోవాలి. 1 "సత్" అనగా నిత్య శుద్ధ బుద్ధ ముక్తమైన చైతన్యము. అట్టి ఆత్మతో నిరంతరము సంగత్వము కలియుండుటే



సత్పురుషులు. మహానుభావులైన సత్పురుషులతో సంగత్వ మేర్పరచుకొనుట సత్సంగత్వము. 3. సద్గ్రంథములను పఠించుట కూడా సత్సంగత్వమే.

ధూళి గాలితో కలిస్తే ఆకాశానికి ఎగురుతుంది. నీటిలో తడిస్తే పాతాళానికి జారుతుంది. ఇనుము నిప్పుతో కలిసి మృదువుగా మారుతుంది. మట్టితో కలిస్తే త్రుప్పు పట్టిపోతుంది. సంగత్వము యొక్క మహిమ అలాంటిది.

సజ్జన సాంగత్య మహిమ వర్ణనాతీతము. పూలతో సంగత్వ మేర్పరచుకొన్న పురుగులు సైతము చక్రవర్తి కిరీటాన్ని అలంకరిస్తున్నాయి. మహాత్ములు ప్రతిష్ఠించగానే రాయి విగ్రహమై పూజలందుకొంటున్నది. అంధునకు కళ్ళున్నవాని సహాయ మెలా అవసరమో అజ్ఞానాంధకారంలో అలమటిస్తున్న మానవాళికి సత్పురుషుల దయ అంత అవసరము.

"గురుకే బచన అతల్‌కరి మనహై
సాధు సమాగమకి జై"

"సద్గురు బోధ అక్షరమని గ్రహించి సత్పురుషుల సాంగత్యమును ప్రయత్నించి పొందు" మని సూరదాసు గానం చేశారు.

"తీర్థీకుర్వన్తి తీర్థాని" సామాన్యమైన నదీజలాన్ని తీర్థక్షేత్రాలుగా మార్చేవారు మహాత్ములు. బుద్ధుడు తపస్సు చేయడం వలన బుద్ధగయ పావనక్షేత్రమైంది. వివేకానందుడు ఆసీనుడగుటచే కన్యాకుమారిలో స్మృతిమందిరము వెలసి ఈనాడు యాత్రా స్థలమైంది. కపిలమహర్షి తపస్సు చేయుటచేత కపిలతీర్థము, జపాలముని ధ్యానమొనర్చుటచే జపాలతీర్థము, తుంబురమహర్షి సంచారము చేయుటచే తుంబురతీర్థము, తిరుమల గిరిపై పవిత్రంగా ఏర్పడి యున్నవి. మహాత్ముల దర్శనమే పావనము. పుణ్యము. ఒక చిన్న నిప్పురవ్వ అరణ్యాన్ని దహించి వేయునట్లు సత్పురుషుల సాంగత్యము మన అజ్ఞానపు మూలలను దహించి వేస్తుంది.

పవిత్ర గంగామాతను భూలోకానికి తెచ్చు నుద్దేశ్యముతో భగీరథుడు తీవ్ర

భూతలానికి రావడానికి ఇచ్ఛగించని గంగాదేవి "భగీరథా! నేను భూలోకమునకు రాను. రాలేను. పాపాత్ములు, పతితులు అచ్చట ఎందరో గలరు. వారు నాయందు మునకలేసి, వారి పాపములతో నన్ను నింపుతారు. కనుక నేను రాను" అని చెబుతుంది. అందులకు భగీరథుడు "మాతా! ఆ విషయమై నీవు భయపడనక్కరలేదు. నీలో పాపాత్ములే కాదు పుణ్యాత్ములు కూడా స్నానమాచరిస్తారు. మహాత్ములు స్నానం చేయుటవలన దురాత్ముల వలన సంక్రమించిన పాపము ప్రక్షాళన మవుతుంది. వారి దివ్యస్పర్శచే యథావిధిగా నిన్ను పునీతం చేస్తారు." అని చెప్పగా వినిన గంగాదేవి సజ్జన సాంగత్య మహిమకు అచ్చెరువంది భాగీరథియై భూలోకానికి అవతరించినట్లు భాగవతములో గంగావతరణ ఘట్టము ద్వారా తెలియు చున్నది.

నారద మహర్షి సాంగత్యముతో ధృవుడు అద్భుతస్థితి నలంకరించాడు. రామకృష్ణుని సహచర్యంతో వేదాంత కేసరియై వివేకానందుడు ప్రపంచాన్నే సమ్మోహింప చేశాడు. చైతన్య మహాప్రభువు సన్నిధిలో జాగాయి, మాదాయి అనేచోరులు తమ క్రూర స్వభావములను పోగొట్టుకొని పవిత్రులయ్యారు. "లభ్యతేపి తత్కృపయైవ" మహాత్ముల సాంగత్యము లభించుట కూడా భగవదనుగ్రహమేనని నారదునిభక్తి సూత్ర ప్రబోధము.

ఒక్క విషయమును ఇక్కడ జాగ్రత్తగా పరిశీలించాలి. అర్థం చేసుకోవాలి. మనోహర ప్రకృతి దృశ్యముల మధ్య ఉన్నను అంధుడు ఏమీ చూడలేడు. తెలుసుకోలేడు. అలాగే సత్పురుషుల మధ్య ఉన్నంత మాత్రాన సత్సంగ మనిపించుకోదు. దేవాలయపు గోడలకు దేవుడు తెలియదు. సభావేదికకు సందేశం అర్థంకాదు. జపమాలకు జపం తెలియదు. ఆశ్రమములోని గోవుకు వేదాంతం అర్థం కాదు. ఏ సాధనలు చేయనవసరంలేదని సత్పురుషుల మధ్య ఉండటమే ముక్తి అని చాలామంది అపోహలో ఉంటారు. అది సరియైన అవగాహన కాదు. గురుసాన్నిధ్యంలో జీవించడమంటే గురుబోధను గ్రహించి అర్థం చేసుకోవడము, తదనుగుణంగా ఆచరించడమని భావము. గురుబోధను ఆలకించి ఆచరించక, గురుసాన్నిధ్యమే పావనమని భావించు గుణహీనుడు తన బ్రతుకును వమ్ముచేసుకోవడమే గాక గురువుగారి భావానికి కూడా కళంకము



మూడవది సద్గ్రంథ పఠనము. సత్పదార్థమును దర్శింపచేయు సత్పురుషులు మనకు ప్రాప్తించనపుడు సద్గ్రంథములతో సాంగత్యము పెట్టుకోవాలి. అదికూడా సత్సంగమే అవుతుంది. భజగోవిందం చదివి అర్థం చేసుకోవడమంటే శంకరులతో సత్సంగము జరిపినట్లే. రామాయణ అధ్యయనము ద్వారా వాల్మీకితో, భాగవత పఠనముద్వారా వ్యాసభగవానునితో, భక్త విజయపారాయణ ద్వారా తుకారామ్, నామదేవ్, గోరా కుంభారాది భక్తులతో సాంగత్యము కలిగినట్లే. సత్పురుషుల సాంగత్యము లభ్యం కానపుడు కాలమును వృథా చేసుకొనకుండా సద్గ్రంథపఠనము చేయడము సత్సంగత్వమవుతుంది. గ్రంథములో తెలియజేయబడిన సద్విషయములను ఆచరించడము సాధన అవుతుంది.

సత్సంగత్వము వలన నిస్సంగత్వ మేర్పడుతుంది. మనసెపుడు ఇంద్రియ విషయాలవైపే మరలి ఉంటుంది. మహాత్ముల సాంగత్యము వలన ఆత్మానాత్మ వివేకజ్ఞానము కలుగుతుంది. విషయ ప్రపంచం నిస్సారమనెడి సత్యం ఎరుక పడుతుంది. ప్రపంచము వెనుక ఇంతవరకు పరుగెత్తిన మనస్సు దారి మరలి అంతర్ముఖ మవుతుంది.

నిస్సంగత్వము వలన మోహము నశిస్తుంది. మోహమనగా సత్యమును అసత్యముగా, అసత్యమును సత్యముగా భావించెడి అయోమయధోరణి. సత్యమెప్పుడు బోధపడిందో ఇక అసత్యానికి ఆస్కారం లేదు. అట్టి మనసులో మోహము నశిస్తుంది. నిర్మోహత్వం జనిస్తుంది.

నిర్మోహత్వం వలన నిశ్చలమైన నిర్మల మనసు ఏర్పడుతుంది. నిశ్చలతత్త్వం గల మనిషికి ఇంద్రియాలు బహిర్ముఖమైనను బంధహేతువులు కావు. తాను చూచే వ్యక్తులు, వస్తువులు తనకన్నా వేరని భావించడు. ప్రపంచాన్నంతా తనలోనే తనలాగే దర్శించే దృష్టి ఏర్పడుతుంది. ప్రపంచముపై ప్రత్యేక ఆకర్షణ వుండదు.

నిశ్చలతత్త్వమే జీవన్ముక్తికి సోపానము. మనస్సు ఎప్పుడైతే ప్రశాంతతను పొందినదో, అంతఃకరణ ఎప్పుడయితే శుద్ధిపడిందో నిర్మలమైన సరస్సులో ప్రతిబింబం గోచరించులాగున మనసులో ఆత్మ చైతన్యం భాసిస్తుంది.

జీవించి యుండగనే ముక్తిని సాధించి జీవన్ముక్తుడు కావాలంటే నిశ్చలతత్త్వం రావాలి. నిశ్చలతత్త్వం ఏర్పడాలంటే నిర్మోహత్వం ఏర్పడాలి. నిర్మోహత్వం రావాలంటే నిస్సంగత్వం కలగాలి. నిస్సంగత్వము సత్సంగమువలన కలుగుతుంది.

వయసి గతే కః కామ వికారః
శుష్కే నీరే కః కాసారః
క్షీణే విత్తే కః పరివారో
జ్ఞాతే తత్త్వే కః సంసారః 10

వయసి = వయస్సు, గతే = గతించిన పిదప, కామ వికారః = కామ వికారము, కః = ఎక్కడుండును?, నీరే = జలము, శుష్కే = ఇంకిపోగా, కాసారః = సరోవరము, కః = ఎక్కడ?, విత్తే = ధనము, క్షీణే = పోయిన పిదప, పరివారః = పరివారము, కః = ఎవరు?, జ్ఞాతే తత్త్వే = సత్యము ఎరుక పడిన పిదప, సంసారః = సంసారము, కః = ఎక్కడుండును?

భావము:- వయసు మళ్ళిన తరువాత మోహం ఎక్కడుంటుంది? నీరు ఇంకిపోగానే సరస్సు ఎక్కడుంది? సిరిసంపదలు పోగానే బంధుజన పరివారము లెందుకుంటారు? జ్ఞానం కలిగిన తరువాత సంసారమెందుకుంటుంది?

## వ్యాఖ్య

ఒక వస్తువుయొక్క సంపూర్ణస్థితి మనకు అవగాహన కానపుడు దానిస్థానే భ్రాంతిజన్యమైన మరియొక వస్తువు గోచరించే ప్రమాదము కలదు. సత్యవస్తువును దర్శించగానే కల్పిత వస్తువు పలాయన మగుచున్నది. కల్పిత వస్తువు ఎక్కడ నుండి అదృశ్యమగుచున్నది? వస్తువునుండి మాత్రముకాదు. ఎందుకనగా కల్పిత వస్తువు వస్తువునందు ఎప్పుడూ లేదు. దానిని దర్శించిన వ్యక్తి మనసులోనే యున్నది. కనుక అది మనసులోనే



జ్ఞానము కలగగానే సర్పమెలాగైతే లేదో సత్యము ఎరుకపడగానే అసద్వస్తువు అదృశ్యమగు చున్నది.

త్రాడును చూడలేక పోవుటచేత త్రాడు మరుగున పడిపోయింది. త్రాడును ఎప్పుడైతే చూడలేకపోయామో దానిస్థానే పామును చూడడము జరిగింది. పామును చూడగానే భయభ్రాంతులు మనసును ఆవరించాయి. త్రాడును పాముగా చూచెడి మిథ్యాజ్ఞానము వలననే మనకు బాధలు సంప్రాప్తించాయి. పాము భ్రాంతి మనసులో దూరంకాగానే దుఃఖము సమసిపోతుంది. శోకానికి దూరం కావాలంటే, మిథ్యాజ్ఞానం పోవాలంటే సత్యదర్శనం జరగాలి.

"చైతన్యంవినా కించిన్నాస్తి" చైతన్యము తప్ప రెండవ వస్తువు లేదని శృతి వాక్యము. ఉన్న చైతన్యాన్ని దర్శించక పోవుటచేత దానిస్థానే మాయాజనిత ప్రపంచము, అది కల్పించు అనంత దుఃఖము అనుభవమునకు అందుతున్నది. మానవునకు దుఃఖం పోవాలంటే మాయాజనిత దృశ్యమాన ప్రపంచ దర్శనం మానాలి. చైతన్యమును దర్శించడమే అందులకు మార్గం. చైతన్యమును సర్వత్ర సదా దర్శించువాడే తత్త్వజ్ఞుడు. "తత్త్వమును తెలిసిన వాడికి సంస్కారమెక్కడని" శంకరులు ఈ శ్లోకములో ప్రశ్నిస్తున్నారు.

యౌవనవంతుని మనసులో కామవికారములు నాట్యం చేస్తుంటాయి. అందము కంటికి కనుపించగనే అయోమయమై పోతుంటాడు. కామాదివాంఛలే సుఖప్రదమని, అవి కలిగించు ఆనందమే శాశ్వతమని భావిస్తుంటాడు. నిరంతరము కామోద్రేకములతో మనసును కలుషితం చేసుకుంటూ క్షుద్రమనస్కుడై వుంటాడు. ఆ దశలో కామ వికారమే వాంఛనీయమై వుంటుంది. కామవికార సుడిగుండములో తగులుకొని కొందరు జీవితాల్నే త్యాగం చేయడానికి సంసిద్ధులవుతుంటారు. కొందరు జన్మనిచ్చిన తల్లిదండ్రులను దూరం చేసుకుంటారు. కొందరు ఉజ్జ్వలమైన భవిష్యత్తును మట్టిపాలు చేసుకుంటారు. కొందరు ప్రాణత్యాగానికి కూడా వెనుదీయరు.

వయసు గతిస్తుంది. యౌవనము వార్ధక్యం ఒడిలో తలదాచుకుంటుంది. శరీరము అశక్తతకు ఆలయంగా మారుతుంది. జవసత్త్వాలు ఉడిగిపోతాయి.

కంటిలో వాడి క్షీణిస్తుంది. యౌవనములో తనను ఒంటిలో వేడి తగ్గుతుంది. కంటిలో వాడి క్షీణిస్తుంది. యౌవనములో తనను పిచ్చివాణ్ణి చేసిన కామ వికారములు ఈ దశలో మచ్చుకైనా కనుపించవు. యౌవనములో దూరంనుండే వ్యక్తిని ఆకర్షించిన అందము వృద్ధాప్యంలో దగ్గరుండిననూ మోహింప చేయలేదు. కామము క్షీణించగనే కాంతలు నిష్ప్రయోజనము. వయసు మళ్ళగానే వనితలు నిరుపయోగము.

నీరు పుష్కలంగా ఉంటే సరస్సు శోభాయమానంగా వుంటుంది. జలచరాలకు ఆశ్రయమిస్తుంది. జంతువుల బాటసారులకు దాహం తీర్చుతుంది. కానీ సరస్సులో నీరు సదా పుష్కలంగా ఉంటుందని చెప్పలేము. వేసవికాలము రానేవస్తుంది. సూర్యుని తాపము తీవ్రమవుతుంది. సరస్సులో నీరు ఇంకిపోతుంది. దానినిపుడు సరస్సని పిలిచే వారుండరు. నీరున్నంతవరకే సరస్సని పిలువబడుతుంది. నీరు ఇంకిపోగానే సరస్సు అదృశ్యమవుతుంది.

ధనికుడి చెంత జనం మూగుతారు. వారు చూసేది మనిషి ప్రభావం కాదు. ధన ప్రాబల్యము. మనిషిని గౌరవించే వ్యక్తి ఎప్పుడూ గౌరవించగలుగుతాడు. వ్యక్తిత్వముతో గౌరవింపబడేవాడు దరిద్రుడైనను లోక పూజితుడవుతాడు. కొందరు ఏ గొప్పతనము లేక పోయిననూ ధనార్జనతో వ్యక్తుల నాకర్షిస్తారు. స్వార్థపరులైన కొందరు ఆశాపరులు ధనం కొరకు వారిచుట్టూ మూగుతారు. ప్రార్థనలు చేస్తారు. కీర్తనలు పాడుతారు. కథలు వల్లిస్తారు. మాటలు అల్లేస్తారు. ధనం ఉన్నంతవరకు అంతా సవ్యంగా సాగిపోతుంది. కాలచక్ర పరిభ్రమణంలో చంచలమైన ధనం మకాం మార్చేస్తుంది. ధనికుడు దరిద్రుడౌతాడు. స్తుతించిన వందిమాగదులు ఈనాడు వెతికినా దొరకరు. పరివార మంతా పరారు. బంధువులంతా బలాదూరని నడక సాగించేస్తారు. పిలిచినా వారు తిరిగి చూడరు. ఆహా! ధనగౌరవమా? సిరిసంపదలు కరిగిపోగానే పరివార మెందుకుంటారు?

జ్ఞానం కలిగిన తరువాత సంసార మెందుకుంటుంది? సారముకలది సంసారమని, భార్యే భాగ్యరేఖయని, పిల్లలే ప్రశాంతతకు పట్టుగొమ్మలని, కుటుంబమే కైవల్యమని ప్రతివ్యక్తి భావిస్తుంటాడు. సంసార వ్యామోహంలో పడి



జీవితాదర్శాన్నే మరచిపోతాడు. అశాశ్వతమైన సంసారంలో మునిగిపోతాడు. దాని రక్షణకై చేయరాని పనులు చేస్తాడు. అందుకు వ్యతిరిక్తమైన వ్యక్తులపై ఈర్ష్యా ద్వేషాలు వెదజల్లుతాడు. సంసారమనే గొడుగుపట్టి ప్రపంచాన్నంతా స్వార్థంతో ఆ గొడుగు క్రిందే సర్దేయాలని చూస్తాడు. పాలుపోసి పామును పెంచినట్లు మమతలతో సంసారవృక్షాన్ని పోషించి పెద్ద చేస్తాడు. తనకు చల్లని నీడ నిస్తున్నందుకు సంతోషపడతాడు. కాల ప్రభంజనం వీస్తుంది. చెట్టుకొమ్మలు విరిగిపోతాయి. తారతమ్యం తెలియక పెంచిన వ్యక్తి పైబడి భుజాలు విరుస్తాయి. భుజాలు విరిగి నేలపడ్డాడనే జాలికూడాలేక తలపై మరికొన్ని కొమ్మలు పడతాయి. జీవితం అంతమైపోతుంది.

ఈ సత్యాన్ని గ్రహించిన వ్యక్తి ముందే జాగరూకుడై వుంటాడు. ఆత్మానాత్మ వస్తువివేకం చేస్తాడు. సత్యాన్ని సమీపిస్తాడు. అసత్యాన్ని త్యజిస్తాడు. వాంఛనీయమైనది భగవంతుడే గాని సంసారము కాదని తెలుసుకుంటాడు. తాను సంసారములో ఉంటాడు. సంసారము తనలో లేకుండా చేసుకుంటాడు. మంచి చెడులు రెండూ సమానంగా భావిస్తాడు. మనసును నిర్మలంగా ఉంచుకుంటాడు. సత్యము తెలియడమే ఈ మార్పుకు కారణము. అందుచేతనే "జ్ఞాతే తత్త్వే కః సంసారః?" జ్ఞానం కలిగిన తర్వాత సంసార మెక్కడుందని ఆచార్యులవారు ఈ శ్లోకంలో ప్రశ్నిస్తున్నారు.

మా కురు ధన జన యౌవన గర్వం
హరతి నిమేషా త్కాలః సర్వమ్
మాయా మయ మిద మఖిలం హిత్వా
బ్రహ్మ పదం త్వం ప్రవిశ విదిత్వా 11

ధన = డబ్బు, జన = పరివారము, యౌవన = యౌవనము, గర్వం = గర్వమును, మాకురు = పొందవద్దు, నిమేషాత్ = ఒక నిముషకాలములో, కాలః = కాలము, సర్వము = సమస్తమును, హరతి = హరించగలదు, ఇదం =ఈ, అఖిలం = సర్వము, మాయామయం = మాయాస్వరూపము, హిత్వా = తెలిసి, బ్రహ్మపదమ్ = బ్రహ్మస్థితిని, విదిత్వా = గురించి, ప్రవిశ = ప్రవేశించుము.

భావము:- నీకు ధనమున్నదని, జనులున్నారని, యవ్వనమున్నదని గర్వపడకుము. కాలము నిముషములో సర్వాన్ని హరించి వేస్తుంది. మాయా రూపమగు సమస్తమును వీడి బ్రహ్మ పదమును పొంది తరించుము.

## వ్యాఖ్య

చైతన్యవంతమైన ప్రాణి మనుగడకు చైతన్యమే ఆధారము. చైతన్యమే భగవంతుడు. భగవంతుడు నీలోనే ఉన్నాడు. అతనికి నీకు యదార్థానికి తేడాలేదు. అతడు నీనుండి వీక్షణమూ దూరం కాలేదు. అతడికి దూరమై నీవెప్పుడూ ఒంటరివి కాలేదు. ఇంటిలో ఉన్నా, ఇబ్బందులలో ఉన్నా, మేల్కొనివున్నా, మేను నిద్రించినా రాత్రింబవళ్ళు భగవంతుడు నీలోనే ఉన్నాడు. సర్వ సుఖానుభూతులకు పునాదియైయున్నాడు. ఆనందానుభవాలకు మార్గగామియైయున్నాడు. శుభప్రదమై, అదృష్టమై వాంఛనీయమైన భగవానుని సన్నిధిలో సర్వమూ సిద్ధిస్తుంది. శాంతి తీరాలలో మానవ జీవితము స్థిరపడుతుంది. స్వతస్సిద్ధముగా తనలో భాసించే భగవంతునిపై మానవుడు విశ్వాసమ్నుంచలేక పోతున్నాడు. అస్థిరమైన ప్రాపంచిక విషయలంపటత్వము శాశ్వతమని భావిస్తున్నాడు. ప్రపంచములో గాని, వస్తు సంతతిలోగాని, వ్యక్తి గౌరవాలలోగాని, బంధుజన ప్రీతిలోగాని, శరీర మనోబుద్ధులలోగాని ఆనందమనేది లేదు.

నీటినుండి నేయి లభ్యం కాదు. ఇసుకనుండి తైలము ఉత్పన్నముకాదు. అగ్నిలో శీతలము దయించదు. ప్రపంచములో సుఖం లభించదు.

మానవుడు మోహజీవితానికి అలవాటు పడ్డాడు. ఇంద్రియ సుఖాలే శాశ్వతమనే భ్రాంతిలో ఉన్నాడు. తనకు సుఖాన్నిస్తున్నట్లు గోచరించే వ్యక్తులకొరకు వస్తువులకొరకు, ప్రయత్నిస్తూ, పరితపిస్తూ జీవితాన్ని నిస్సారంగా మార్చుకుంటున్నాడు. ఆవేదనతో అనంతరమూ అలమటిస్తున్నాడు.



ధనమున్నదని, పరివారమున్నారని, యౌవనమున్నదని గర్వపడవద్దని ఈ శ్లోకములో శ్రీ శంకరులు తెలియజేస్తున్నారు. నీకున్న సమస్త సంపదలను కాలము క్షణంలో మ్రింగేస్తుందని హెచ్చరిస్తున్నారు.

ధనం చంచలమైనది. ఒక చోట నిలవదు. ఒకరిదంటూ వుండదు. ఎవరిదగ్గరుంటేవారు తమదని భావిస్తుంటారు. నమ్మిన ప్రతి వ్యక్తిని మోసగించి, వికటాట్టహాసం చేస్తూ ధనం పచార్లు చేస్తుంటుంది. ఆనందమనేది ధనంలో లేదు. ధనం సుఖాన్నిచ్చేటట్లయితే డబ్బున్నవాళ్ళంతా సుఖంగా వుండాలి. ఆ విధంగా వారు లేరని మన అనుభవమే ఋజువుచేస్తుంది. ఆనందం ధనానికే పరిమితమయితే ధనంలేని పేదవారంతా దుఃఖభాగులై యుండాలి. పేదరికంలో అలమటిస్తున్ననూ, తినను తిండి లేక, కట్టను చాలినంత బట్టలేక గుడిసెంలో ఎంతో ఆనందంగా జీవిస్తూ ఆడుతూపాడుతూ కాలంగడిపే పేదలను ఎందరినో మనం చూస్తున్నాము. సుఖం అనేది ధనంలో లేదు. దానికి మనమిచ్చే అసత్యపు విలువే లేని సుఖాన్ని అందులో ఆపాదించింది. చంచలమైన ధనాన్ని నమ్మినవాడు చపలచిత్తుడవుతాడు. ధన సంపాదనకై తన శక్తినంతా ధారబోసి, విశ్రమించే వ్యవధికూడా లేకుండా శ్రమించి, ధనాన్ని ప్రోగుచేసి, దానిని రక్షించుటకు సదా ఆందోళన చెందుతూ, అది పోతుందనే భయ భ్రాంతులతో దుఃఖమయ జీవితాన్ని సాగిస్తుంటాడు.

ధనము ననుసరించే జనం చేరుతారు. ధనం వదలిపోగానే దాని ఫలితంగా ఏర్పడిన జనమూ దూరమవుతారు. ధనము, జనము ఎలా శాశ్వతముకాదో అలాగే ప్రాయము కూడా అనిత్యము. మానవ జీవితములో యౌవనము బహుస్వల్పము. ధన, జన, యౌవనమును చూచుకొని గర్వపడవద్దని, ఒక నిముషములో కాలము వీటన్నిటిని హరించునని భగవత్పాదులు ప్రబోధము చేయుచున్నారు. పుట్టగానే మనిషి కళ్ళు తెరుస్తాడు. చనిపోగానే కళ్ళు మూస్తాడు. జీవితం రెప్పపాటనే సత్యం ఈ జనన మరణ సాదృశ్యంతో ఋజువు చేయబడినది.

సర్వమూ కాలంలో హరించిపోతాయి. బ్రహ్మ పదార్థము మాత్రము అచలమై [illegible] మనసే చైతన్యము

వలన ప్రకాశిస్తున్నప్పుడు మనసు ద్వారా జనించిన కాలము చైతన్యమును స్పృశించలేదు. ఆత్మయనెడి వారధిని రాత్రింబవళ్ళు జరామరణాదులు దాటలేక పోతున్నాయని ఛాందోగ్యోపనిషత్తులో తెలియ చేయబడింది.

మాయారూపమైన జగత్తుపై భ్రాంతిని వీడి బ్రహ్మపదమును పొందమని ఈ శ్లోకంలో శంకరులు తెలియచేస్తున్నారు.

మాయకు ప్రత్యేకమైన అస్తిత్వము లేదు. మాయ భగవదాధీనమైయున్నది. మాయ తన మనుగడకు భగవంతునిపై ఆధారపడియున్నది. మాయను దర్శిస్తూ, దాని ప్రభావమును చవి చూస్తున్నంత వరకు బ్రహ్మము అనుభవమునకు రావడములేదు. బ్రహ్మమును దర్శించగానే మాయలేదు. వాస్తవానికి మాయ ఉన్నదా లేదా? మాయ ప్రభావము వ్యక్తపై నున్నందున మాయ ఉన్నది. నిత్యశుద్ధ బుద్ధ ముక్త స్వరూపమైన బ్రహ్మమునందు మాయ అదృశ్యము గనుక లేనిదే అగుచున్నది.

మాయనుగూర్చి ఆలోచించే కొలది మాయ అనూహ్యమగుచున్నది. ఆలోచించే మనసు మాయనుండి ఆవిర్భవించింది. గనుక దానికి కారణమైన మాయను గ్రహించలేదు. మాయ భ్రాంతి మయము. నిర్వచించుటకు వీలుపడదు.

ఉన్న వస్తువు నశించదు. లేని వస్తువుకు మనుగడ ప్రాప్తించదు. ఇంద్రియ జ్ఞానము శాశ్వతమని భావించడానికి వీలులేదు. ఎండమావులలో నీళ్ళులేవు. నీళ్ళను చూచింది మనసు. అలాగే భగవానునియందు మాయలేదు. ముత్యపుచిప్పలో వెండి కన్పించింది. యదార్థానికి అందులో వెండిలేదు. లేని రజితాన్ని పొందే ప్రసక్తి అసలే లేదు. ముత్యపు చిప్పలో ఆదియందు వెండిలేదు. విషయము గ్రహించగానే అంత్యమందునూ వెండిలేదు. సత్యము దర్శించలేక భ్రాంతికి లోనయిన మధ్యకాలంలో రజితము కన్పించింది. ఆదియందు అంత్యమందు ఏదయితే లేదో అది మధ్యకాలంలో ఉన్నట్లు కనపడిననూ అది లేనిదనే గ్రహించాలి. ఆదిలో బ్రహ్మమే ఉండినది. జ్ఞానము కలిగిన తరువాత కూడా బ్రహ్మమే యున్నది. మధ్యకాలంలో మాయ కనుపించినను వాస్తవానికి లేనిదే యగుచున్నది. కనుక మాయను విస్మరించి శాశ్వతమైన బ్రహ్మపదమును పొందమని శంకరులు తెలియచేస్తున్నారు.



మట్టికుండలో ఉన్నదంతా మన్నే. బంగారునగలో ఉన్నదంతా బంగారే. మంచుగడ్డలో ఉన్నదంతయూ నీరే. ఈ జగత్తునకు ఉపాదాన మంతయూ భగవంతుడే. భగవంతుడు ప్రపంచానికి పరిమితుడు కాడు. అతని మనుగడ జగత్తును అధిగమించి యున్నది. "అత్యతిష్ఠద్దశాఙ్గులమ్" విశ్వమంతయు వ్యాపించిన భగవానుడు సర్వలోకముల నధిగమించి పది అంగుళములున్నాడని వేదములో పురుషసూక్తము తెలియచేయుచున్నది.

మట్టి లేనిచో కుండ ఉండదు. బంగారు లేనిచో నగలేదు. నీరు లేనిచో మంచుగడ్డ లేదు. భగవానుడు లేనిచో జగత్తులేదు.

కుండ లేకపోయినా మట్టి ఉంటుంది. నగ లేకపోయినా బంగారం వుంటుంది. మంచుగడ్డ లేకపోయినా నీరు ఉంటుంది. జగత్తు లయించినా భగవాను డుంటాడు.

భగవానుని యదార్థ స్వరూపమును ఈ విధముగా విచారణ చేసి సర్వత్ర భగవంతుని దర్శించి ఎవరైతే ఉపాసిస్తారో వారు బ్రహ్మములో ప్రవేశిస్తారు. "బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి" బ్రహ్మమును తెలియ గోరువాడు బ్రహ్మమే కాగలడని శ్రుతి ప్రబోధము.

దిన యామిన్యౌ సాయం ప్రాతః
శిశిర వసన్తౌ పునరాయాతః
కాలః క్రీడతి గచ్ఛత్యాయు
స్తదపి న ముఞ్చ త్యాశావాయుః 12

దినయామిన్యౌ = దివారాత్రములు, సాయం ప్రాతః = ఉదయ సాయంత్రాలు, శిశిర = శిశిరఋతువు, వసన్తౌ = వసంత ఋతువుకూడా, పునః = మఱల, మఱల, ఆయాతః = వచ్చుచుండును, కాలః = కాలము, క్రీడతి = క్రీడించుచున్నది, ఆయుః = ఆయువు, గచ్ఛతి = వెళ్ళిపోవుచున్నది., తదపి = అయినను, ఆశావాయుః = ఆశా ఊపిరి, న ముఞ్చతి = వదలుట లేదు.

భావము:- దివారాత్రాలు, ఉదయసాయంత్రాలు, శిశిరవసంతాలు, మళ్ళీ మళ్ళీ వస్తుంటాయి. పోతుంటాయి. కాలము క్రీడిస్తున్నది. జీవితము క్షీణించిపోతున్నది. అయిననూ మనిషి ఆశను వదలలేకున్నాడు.

## వ్యాఖ్య

అనంతంలో మనమంతా యాత్రికులం. గతంలో కదిలాము. వర్తమానంలో జీవిస్తున్నాము. భవిష్యత్తులో కలసిపోతాము. ఎక్కడ నుండి వచ్చామో. ఎంతవరకు ఉంటామో తెలియదు. కాలచక్ర పరిభ్రమణంలో ఒక దశలో కనుపించి అదృశ్యమయ్యే స్థితి మనది. అనంత కాల ప్రవాహమనే నాటకంలో కొన్ని క్షణాలు ప్రపంచ రంగస్థలిపై ప్రవేశించి, అభినయించి, నిష్క్రమించే నటులవంటివారము.

గతంలో మనం గడించిన అనుభవాలే మన జీవితాన్ని నిర్ణయిస్తున్నాయి. గడచిన క్షణం వరకు మనం సాగించిన ఆలోచనలే అనుభవాలను అందించాయి. కాలగమనంలో కదలిన మనం ఎన్నో వైఖరులను వైవిధ్యాలను సృష్టించుకొని వర్తమానంలో కాలుపెట్టాము. మన సంకల్పాలు, సందేహాలు గత జీవిత ప్రభావ ఫలితములు.

రేపటిని గురించి మనం ఆలోచిస్తాము. మనం ఆలోచించిన "రేపు" అనేది అనుభవానికి రాగానే అది నేడుగా మారుతుంది. అనుభవానికి అందిన నేడే నిజమైన జీవితము. గతాన్నిగూర్చి ఆలోచనలు కదుల్తాయి. భవిష్యత్తును గురించి ఊహలు జనిస్తాయి. మనం సదా గతాన్ని గూర్చిగాని, భవిష్యత్తును గూర్చిగాని ఆలోచిస్తుంటాము. ఇలా చేయడములో వర్తమానము వృథాఅగుచున్నది. భవిష్యత్తునుగురించి మనం చేయు ఊహలకు గతానుభవాలే పునాది. మనం చేసే ఆలోచనలు గతానుభవాన్ని ఆధారం చేసుకొని వర్తమానంలో కదిలి భవిష్యత్తులో రూపం దిద్దుకొంటాయి.



కాలంలో మనం నడక సాగిస్తున్నాం. మనచుట్టూ పరిభ్రమించే కాలరూప సుడిగుండంలో దివారాత్రాలు ఒకదాని వెంబడి మరొకటి కదిలిపోతున్నాయి. ఉదయం కదలి పోగానే సాయంత్రం, సాయంత్రము వదలిపోగానే ఉదయము మళ్ళీ మళ్ళీ కనిపిస్తున్నాయి. శిశిర వసంతాలు వస్తూ పోతూ వున్నాయి. కాలము నాట్యం చేస్తున్నది. కాల నర్తకి నాట్యవిన్యాసాలు చూస్తూ మనం కాలగర్భంలో కలిసిపోతున్నాము. కాలక్రీడలో జీవితము గతించుచున్నది. ఆయువు హరించి పోతున్నది. వల్లకాటికి ప్రయాణము సిద్ధము చేయబడుచున్నది. జీవిత నాటకం సమాప్తి కానున్నది. సంసారబంధాలు నిర్దాక్షిణ్యంగా ఖండించబడుతున్నాయి. ఏర్పరచుకున్న మమతలు కాల రాయబడు తున్నాయి.నిర్మించుకున్న అనురాగభవంతులు పేకమేడలై కూలిపోయే సమయ మాసన్న మవుతున్నది. అంధకార బంధురమైన కాలగర్భంలో ఏకాంతంగా నడక సాగించవలసి యున్నది. మననుండి కదిలే ప్రతిశ్వాస మనలను వల్లకాటికి చేర్చే ప్రయత్నమై యున్నది. స్పందించే హృదయాలు చిందించే కన్నీళ్ళు కలసి కాపాడలేని దుర్దశ ఎదురుగా నడచి వస్తున్నది. తన కదలిక వల్ల కలిగే పరిణామాన్ని గుణపాఠం చెబుతూ కాలం నడకసాగిస్తున్ననూ అయ్యో! ఇప్పుడుకూడా మానవుడు ఆశను వీడలేకున్నాడు; అమరత్వ సిద్ధికి ప్రయత్నించలేక పోతున్నాడని ఆచార్యులు ఆశ్చర్యాన్ని వ్యక్తం చేస్తున్నారు.

ఆశాపాశమునకు అంతము లేదు. తృష్ణ ఒక భయంకరమైన వ్యాధి. ఆశకు దాసుడైన మానవుడు ఎంత గొప్పవాడైనను పతనం కాక తప్పదు.

భీషయత్యపిధీరం మామంధ యత్యపి సేక్షణమ్
ఖేదయత్యపిసానందం తృష్ణా కృష్ణేవ శర్వరీ !

"తృష్ణ తన ప్రభావముచేత భయంకరమైన అమావాస్యచీకటివలె, ధీరుని హృదయములోకూడా భీతిని కలిగించుచున్న" దని శ్రీరామచంద్రమూర్తి రామాయణంలో తెలుపుతారు.

ఆశయసిద్ధికి ఆశ ప్రతిబంధకము. ఆశ మానవాభ్యున్నతిని ఆటంకపరుస్తుంది. ఆశావలయంలోనికి [illegible] పోగొట్టుకొనుట శోచనీయము.

అహంకారము వలననే మనిషిలో ఆశ మొలకెత్తుచున్నది. మానవుని మాధవునికి దూరం చేయుటలో ఆశ ఇనుప గోడవంటిది. అంతరేక్షణ జరిపి అహంకారాన్ని పార్రదోలే ప్రయత్నం చేయాలి.

"ద్విపదే బంధమోక్షస్య నమమేతి మమేతిచ
మమేతి బధ్యతే జంతు ర్నమమేతి విముచ్యతే".

"నాది", "నాది కాదు" అను రెండు పదములే బంధమోక్షములకు హేతువులు. "నాది" అను భావముచేత మనిషి బద్ధుడవుతున్నాడు. "నాది కాదు" అను భావముచేత ముక్తుడగుచున్నా"డని మహాభారతము చెబుతున్నది.

ఆశ దూరం కాగానే మనసు అంతర్ముఖ మవుతుంది. మనసు అంతర్ముఖం కాగానే మహాత్ము డుదయిస్తాడు. కాలగమనాన్ని దృష్టి యందుంచుకొని, ఆశారాక్షసిని అదుపులో వుంచుకొని, మృత్యువు ఆసన్నం కాకమునుపే జీవన్ముక్తుడై మెలగాలి.

కాతే కాన్తా ధనగత చిన్తా
వాతుల కిం తవ నాస్తి నియన్తా
త్రిజగతి సజ్జన సంగతి రేకా
భవతి భవార్ణవ తరణే నౌకా 13

వాతుల = వెఱ్ఱివాడా!, తవ = నీ యొక్క, నియన్త = పాలించువాడు, నాస్తికిం = లేదందువా?, తే కాన్తా = నీ భార్య, ధనగత చిన్తా = డబ్బును గూర్చిన చింత, కా = ఎందులకు?, త్రిజగతి = మూడు లోకముల యందు, సజ్జన సంగతి = సత్పురుషుల సాంగత్యము, ఏకా = ఒక్కటియే, భవార్ణవ = భవసాగరమును, తరణే = దాటుటకు, నౌకా = నౌక, భవతి = అగుచున్నది.

భావముః— ఓ వెఱ్ఱివాడా! నీ భార్యనుగూర్చి ధనమును గూర్చి ఎందుల కంతగా చింతిస్తావు? ధర్మ పరిపాలనచేసే



నియంత లేడను కున్నావా? త్రిలోకములయందు భవసాగరము దాటింపగల నౌక "సజ్జన సంగతి" యే నని తెలుసుకో.

## వ్యాఖ్య

జీవభ్రాంతి యనెడి కారాగృహంలో మనోబుద్ధులనే ఇనుప కమ్ముల వెనుక అజ్ఞాన కుడ్యాలమధ్య బంధింపబడిన ఖైదీయే మానవుడు. చైతన్యవంతమైన మానవునికి బంధమెలా వచ్చింది? సూర్యుని వలన ఏర్పడిన మేఘము సూర్యునే ఆవరించినట్లు చైతన్యమునుండి జనించిన మరపు చైతన్యమునే మరుగు పరచుచున్నది. సూర్యరశ్మికి సముద్ర జలాలు మరిగి ఆవిరియై ఆకాశమున మేఘములుగా ఏర్పడుచున్నవి. మేఘావృతమైన ఆకాశమున సూర్యుడు కనుపించడు. చూచువారికి సూర్యునికి మధ్య మేఘము నిలవడమే కారణము. మేఘము అలాగే శాశ్వతంగా ఆకాశంలో ఉండదు. చల్లగాలి వీచగానే కదిలి, కరిగి వర్షిస్తుంది. ఆకాశము నిర్మల మవుతుంది. సూర్యకిరణాలు యథావిధిగా ప్రసరిస్తాయి.

అలాగే మనకు భగవంతునికి మధ్య అజ్ఞానపు అడ్డుతెర మేఘంలా ఆవరించింది. వివేకమనే చల్లటి గాలితో అజ్ఞానపు మేఘాన్ని కదిలించి వేయాలి. అజ్ఞానం తొలగగానే ఆత్మానుభవం కలుగుతుంది.

వివేకవంతుడు విచక్షణ కలిగి వుంటాడు. విచక్షణ కలవాడు విచారణ చేయగలుగుతాడు. మనోశక్తులన్నీ వృథా కాకుండా శ్రేయో మార్గములో నడుపువాడే వివేకము కలవాడు. భగవంతుని తెలుసుకొనుటకు ఉపయోగించవలసిన బుద్ధిని అనిత్యమైన విషయ చింతనతో కలుషితం చేసుకోవడం అనుచితం. భార్య, ధనాదుల గురించిన చింతనతో పవిత్రమైన జీవితమును వృథాచేసుకోవడం భావ్యం కాదని తన అమూల్య సందేశాన్ని ద్వాదశ మంజరీక స్తోత్రములోని ఈ చరమ శ్లోకముద్వారా వివరించుచున్నారు.

ధనదారాదుల గురించి చింత అనవసరము. గృహస్థునకు సహధర్మచారిణిగా భార్య, సంసారమును పోషించుకొనుటకు ధనము అవసరమై యుండగా, ఆ రెండింటిని గూర్చి చింతించవలదని శంకరులు ప్రవచించుట ప్రతి ఒక్కరికి ఆశ్చర్యముగా వుంటుంది.

గృహస్థాశ్రమ రథానికి భార్యాభర్తలు రెండు చక్రాలవంటివారు. గృహమనేది భగవంతుని దర్శించుటకు సాధనక్షేత్రమై యున్నది. భార్యను గృహలక్ష్మిగా హిందూధర్మము చిత్రించినది. దంపతులిరువురు గృహస్థాశ్రమము ద్వారా సన్యాసాశ్రమమునకు అర్హతను సంపాదించి బ్రహ్మవిదు లగుటకు గృహస్థాశ్రమము సోపానమై యున్నది. యతిజీవన పుష్పమునకు గృహస్థ జీవనము మొగ్గవంటిది. సేవానిరతి ద్వారా, ఆధ్యాత్మిక చింతన ద్వారా తరించుటకు గృహస్థాశ్రమములో అవకాశమున్నది.

పవిత్రమైన దాంపత్య జీవిత ప్రాశస్త్యము తెలియని పాశవిక మానవుడు వ్యామోహముతో గృహస్థ జీవనాన్ని రొంపి సంసారంగా తయారు చేసుకుంటున్నాడు. భార్యను భోగవస్తువుగా భావిస్తున్నాడు. మోహ జీవితముతో నడకసాగిస్తున్నాడు. భోగమయ జీవితాన్ని గడుపుటకు కావలసిన ధనాన్ని గూర్చిచింతిస్తూ కాలయాపన చేస్తున్నాడు. ధనదారాదులు శాశ్వతమనే భ్రాంతిలో ఉన్నాడు.

అసత్యమైన అవగాహన అనర్థాన్ని తెచ్చి పెడుతుంది. భవబంధాలనుండి బయటపడేందుకు మార్గాన్ని అన్వేషించాలి. భగవంతుని చేరేందుకు ప్రయత్నించాలి.

నిన్ను గూర్చి ఆలోచించవలసిన అవసరం నీకులేదు. నారుపోసిన వాడు నీరుపోయలేడా? బిడ్డ ఆకలి తల్లికి తెలుసు. పిల్లికూన నెలా కాపాడుకోవాలో పిల్లికి తెలుసు. తేనె తుట్టెనెలా నిర్మించాలో తేనెటీగకు తెలుసు. విద్యార్థికి ఏమి బోధించాలో ఆచార్యునికి తెలుసు. సర్వశక్తి మంతుడైన భగవానునికి నీకేమివ్వాలో బాగాతెలుసు. ఎలా ఇవ్వాలో తెలుసు. ఎప్పుడివ్వాలో తెలుసు. ఎందుకివ్వాలో తెలుసు.

అరణ్యములో పచార్లు చేసే జంతువుకు, ఆకాశాన చరించే పక్షికి, నీటిలో సంచరించే చేపకు, [illegible]



ఇన్ని చేయగలిగినవాడు నిన్ను పోషించలేడా? నీ జీవితాన్ని కడతేర్చలేడా? భార్యను గురించి, ధనాన్ని గురించి నీవాలోచించాలా? అజ్ఞానంతో అన్నీ పట్టుకుంటున్నావు. గోపికల్లాగా చేతులు పైకెత్తేయ్. ద్రౌపదిలా సంపూర్ణ శరణాగతుడివికా. గజేంద్రునిలా మనసు లగ్నంచేయి. భగవంతుడే నిన్ను నడిపిస్తాడు. ఆ మార్గంలో నీవు నడవ గలిగితే పదుగురిని నడిపించిన వాడవవుతావు. అప్పుడే నీవు భవజలధిని దాటగలవు. భవసాగరమును దాటుటకు "సజ్జన సంగతి" అనెడి నౌకయే శరణ్యమని ఆచార్యులు తెలియ చేయుచున్నారు.

సాంగత్యముయొక్క ప్రభావము అనిర్వచనీయము. మల్లెతోట మీదుగా వీచినగాలి సువాసన నందిస్తుంది. మురికి గుంటల నుండి పయనించి దుర్గంధాన్ని వెదజల్లుతుంది.

సజ్జన సాంగత్యముతో భవసాగరాన్ని దాటగలుగుతాము. దుర్జన సహవాసముతో భవజలధిలో మునిగిపోతాము. అందుచేతనే "దుస్సంగ స్సర్వథైవ త్యాజ్యః" చెడు స్నేహము అన్ని విధాలా విడిచి పెట్టదగినదని నారదమహర్షి భక్తి సూత్రాలలో ప్రబోధించారు.

సజ్జన సాంగత్యము వలన మనం పునీతులమవుతాము. మహాపురుషుల ఆశ్రయము లభించినచో దానిని దైవానుగ్రహముగా భావించమని శంకరాచార్యులవారు వివేకచూడామణి గ్రంథములో వ్రాశారు.

"బినుసత సంగత హరికథా తేహిబిను మోహనభాగ" మహాత్ములతో సాంగత్యము, వారితో భాషణముతప్ప మోహము నుండి బయట పడుటకు వేరే మార్గంలేదని తులసీదాసు చెబుతారు.

"మహత్సంగస్తు దుర్లభోఽగమ్యోఽమోఘశ్చ"

"మహాత్ముల సాంగత్యము లభించుట దుర్లభము. లభించినచో వారిని సంపూర్ణముగా తెలిసికొనుట బహుకష్టము. గ్రహించగలిగినచో అమోఘము" అని నారద భక్తి సూత్రాలలో తెలియచేయబడింది.

సజ్జన సంగతి అనే నావనెక్కి సంసార సాగరాన్ని దాటి శాంతి తీరాన్ని చేరమని [illegible] ఉంటుంది. మనం

నావలో ప్రయాణం చేస్తుంటాము. నీరు ఎంత లోతైనను మనకు బాధలేదు. నావ మనలను రక్షిస్తుంది. నావ నీటిలో ఉంటుందేగాని నీరు నావలోనికి రావటానికి వీలులేదు. అలాగే మనం సంసార సాగరంలో ప్రయాణీకులమై యున్ననూ సజ్జన సంగతి అను పడవలో ఉండుటవలన భయపడనవసరము లేదు.మనము సంసారములో నున్నను సంసారము మనలో ప్రవేశించకుండా సజ్జన సహవాసము కాపాడుతుంది.

శ్రీ శంకరులు ప్రవచించిన ద్వాదశ మంజరీక స్తోత్రమును పండ్రెండు శ్లోకములు ఇంతటితో సమాప్తమైనవి. ఆచార్యులవారి పదునలుగురు శిష్యులు చెప్పిన చతుర్దశ మంజరీక స్తోత్రము ఇక్కడ నుండి ప్రారంభమగుచున్నది.

జటిలో ముణ్డీ లుఞ్ఛిత కేశః
కాషాయాంబర బహుకృత వేషః
పశ్యన్నపిచ న పశ్యతి మూఢో
హ్యుదర నిమిత్తం బహుకృత వేషః 14

జటిలం = జడధారియను, ముణ్డీ = ముండనము చేసుకొన్నవాడు, లుఞ్ఛిత కేశః = చెదిరిన కేశములుగలవాడు, కాషాయాంబర = కాషాయవస్త్రధారి, బహుకృత వేషః = అనేక వేషములను వేయువాడు, పశ్యన్నపిచ = చూస్తూకూడా, న పశ్యతి = చూడడు, మూఢః = మూర్ఖుడు, బహుకృత వేషః = బహువేషధారణ, ఉదరనిమిత్తమ్ = పొట్టనింపుకొనుటకే.

భావముః– ఒకడు జడలు ధరించి, మరొకడు ముండనము చేయించుకొని, ఇంకొకడు వెంట్రుకలు వ్రేలాడదీసుకొని, మరొకడు కాషాయవస్త్రములను ధరించి ఉంటారు. చూస్తూ కూడా వాస్తవాన్ని చూడలేని ఈ మూర్ఖులు పొటనింపుకొనుటకు వేషాలు వేసుకుంటారు.



ఈ శ్లోకము శంకరుల ప్రధాన శిష్యులైన "పద్మపాదాచార్యులు" రచించినట్లు తెలియుచున్నది.

## వ్యాఖ్య

మెరిసేదంతా బంగారంకాదు. తెల్లనిదంతా వెండికాదు. అక్షర జ్ఞానం కలిగినంతనే విద్యావంతుడు కాడు. కాషాయం ధరించినవాడు సన్యాసి కాడు.

సన్యాసమనేది మోక్షసాధన కొరకేగాని జీవనభృతికి కాదు. బాహ్యాభ్యంతరాలలో స్వేచ్ఛను పొందటమే మోక్షము. కొందరు బాహ్యంలో స్వేచ్ఛాజీవులుగా కనబడతారు. బాహ్యానికి సర్వాన్ని త్యజిస్తారు. కానీ అంతర్యంలో వస్తు ప్రపంచాన్ని పట్టుకొని వ్రేలాడుతూనే వుంటారు. భారత దేశానికి బాహ్యస్వాతంత్ర్యం లభించింది. అంతః కలహాలతో, దారిద్ర్యంతో, నిరుద్యోగంతో, అలమటిస్తూ ఆంతరంగిక స్వాతంత్ర్యాన్ని కోల్పోయింది. వ్యక్తి ఔన్నత్యం బాహ్యంలో కాదు. వాస్తవానికి అంతర్యంలోనే వుంది. లోపల సౌందర్యం లేకపోగా, బాహ్యానికి అందాన్ని ప్రదర్శించే వాడి జీవనం శవ సౌందర్యంలాంటిది. కుళ్ళుతున్న శవాన్ని అత్తరు సుగంధాలతో, పుష్పాలతో కప్పడానికి చేసే ప్రయత్నం వంటిది.

సన్యాసమనేది ప్రపంచాన్ని వదలడము కాదు. బంధువులను త్యజించడము కాదు. వస్తువులను విడిచిపెట్టడము కాదు. వాటిపై తనకున్న మమకారాల్ని, పెనవేసుకున్న బంధాలను మనసునుండి తొలగించడమే.

మనసులో మమతలు నింపుకొని, బాహ్యానికి విసర్జించడమనేది సన్యాసానికి సంకేతము కాదు. తనలోని ద్వంద్వ మనస్తత్వానికి ప్రతిబింబము. ఆకలి కలిగి ఆహారాన్ని విడిచిపెట్టడం, దాహముండి నీటిని వదలడ మెలాంటిదో సంసారాన్ని మనసులో ఉంచుకొని సన్యాసం స్వీకరించడం అలాంటిది.

బాహ్య స్వాతంత్ర్యము కలిగి ఆంతరంగిక స్వేచ్ఛలేనివాడు ప్రతి చిన్న విషయానికి [illegible] చెదిరిపోతుంటాడు

కష్టించి జీవించలేని సోమరులు తేలికమార్గాలలో జీవించడానికి అలవాటు పడతారు. ఆలోచనాపరులైతే ఏదో ఓ రంగములో ప్రవేశించి, త్యాగమయ జీవితాన్ని ప్రదర్శిస్తూ ప్రజలను దోచుకుంటారు. ఆ నైపుణ్యం కూడా లేనివారు అక్షయపాత్ర చేతపట్టుకొని భిక్షమెత్తుకొనుచు వీధులవెంట బడతారు.

పనిచేయకనే ఫలితాన్నాశించే ఈ మూర్ఖులు సంఘంలో చీడ పురుగుల వంటివారు. తాను సమాజానికి ఏమి సమర్పించకనే సంఘం నుండి సంభావనలు పొందే జడులు సమాజ వస్త్రానికి పట్టిన చెదలు వంటివారు. ఏ దేశ చరిత్రలోనైనా సరే, ఏఏ కాలాలలో ఈ అవకాశవాదులు ఎక్కువగా కనుపిస్తారో ఆయా కాలాలలో ఆ దేశ సంపద దిగజారిపోయేవుంది. సంస్కృతి ఛిన్నాభిన్నంగానే కన్పించింది. దౌర్జన్యం విలయతాండవం చేసింది. ఇది చరిత్ర నిరూపించిన నగ్న సత్యం. "No Civilization can survive unless it believes in God"భగవంతునిపై విశ్వాసం లేక ఏ నాగరికత కూడా సజీవంగా మనలేదని ప్లాటో అభిప్రాయపడ్డారు. పవిత్రమైన ఆధ్యాత్మిక రంగంలోనే కాలుష్యం ప్రారంభమైతే ఇక ఆ దేశానికి భవిష్యత్తు ఏముంటుంది?

ఈ విధమైన ద్వంద్వ వైఖరిగల అభివృద్ధి నిరోధకులు తమ జీవన జ్యోతిని పోగొట్టుకోవడమే గాక చుట్టునున్న వారి జీవితాలపై కూడా అంధకారాన్ని విరజిమ్ముతారు. రాజకీయ, నైతిక, సాంఘిక రంగాలలో వీరెలా కనుపిస్తారో అలాగే ఆధ్యాత్మిక రంగంలో కూడా ఈ మిథ్యాచారులు, కపట సన్యాసులు (Psuedo Gurus) ప్రవేశిస్తారు. అట్టి వ్యక్తుల విషయంలో సంఘంలోని వ్యక్తులు జాగరూకులై ఉండాలని భావము.

ఉద్యోగంలో ప్రవేశించేటప్పుడు ఉద్యోగనిర్వహణే మనిషికి లక్ష్యంగా వుంటుందిగాని లంచాలు పుచ్చుకోవడం స్ఫురించదు. కాలం గడిచేకొద్ది వ్యక్తిలో వృత్తి ధర్మం నశించి కుక్షింభరిత్వమే ముఖ్యమనిపిస్తుంది.

రాజకీయాలలో ప్రవేశించే సమయంలో ప్రతివ్యక్తి దేశసేవనే దృష్టిలో ఉంచుకొని దిగుతాడు. పదవులు చేజిక్కగానే వ్యక్తిగత అభివృద్ధికి ఆరాటమే గాని ప్రజాసేవ[illegible]



సన్యాసాశ్రమం కూడా అంత సులభం కాదు. సన్యాసం స్వీకరించే సమయంలో ప్రతివ్యక్తి త్యాగపురుషుడుగానే వుంటాడు. కాలం కదుల్తుంది. ప్రపంచంలో గుర్తింపు వస్తుంది. ప్రజలు పూజిస్తారు. మేధావులంతా సన్మానాలతో తెగపొగిడేస్తారు. అహం పెరిగిపోతుంది. వైరాగ్యం క్షీణిస్తుంది. సాధన లోపిస్తుంది. బ్రతుకు చీకటి మయమవుతుంది.

జీవితంలో మనం తీసుకునే నిర్ణయాలు జీవితాంతం అమలు జరుపగలిగినపుడే ధన్యజీవులమవుతాం. త్రికరణ శుద్ధిగా జీవించినపుడే మార్గదర్శకులుగా మిగులుతాం. అలాకానిచో మనకు, మనచుట్టు వున్న వాళ్ళకు సమస్యగా మిగిలిపోతాము.

అఙ్గం గళితం పలితం ముణ్డం
దశన విహీనం జాతం తుణ్డం
వృద్ధోయాతి గృహీత్వా దణ్డం
తదపి న ముఞ్చ త్యాశాపిణ్డం 15

అఙ్గం = శరీరము, గళితం = సడలిపోయినది, ముండమ్ = తల, పలితం = నెరసిపోయింది, తుండం = నోరు, దశన విహీనం = పళ్ళు రాలిపోయినవి, జాతం = అయినది, వృద్ధః = ముసలివాడై, దండం = కర్రను, గృహీత్వా = పట్టుకొనును, తదపి = అయినను, ఆశాపిండం = ఆశలమూటను, న ముఞ్చ = విడువడు.

భావము:– శరీరం సడలిపోయింది. తల నెరసి పోయింది. దంతాలు ఊడిపోయాయి. ముసలివాడై కర్రమీద ఆధారపడి కదులుతున్నాడు. అప్పుడుకూడా అతడు కోరికల మూటను వదలి పెట్టడు.

## వ్యాఖ్య

శంకరాచార్యులవారి ప్రియ శిష్యుడైన తోటకాచార్యులవారు ఈ శ్లోకం రచించినట్లు తెలియుచున్నది.

విత్తనము ఎలాంటిది వేస్తామో వృక్షము అలాంటిదే వస్తుంది. మనిషి చేయు ఆలోచనలే జీవిత గమ్యాన్ని నిర్ణయిస్తాయి. మనలో అభిరుచుల్ని ఏర్పరుస్తాయి. అభిరుచులు అలవాట్లుగా మారుతాయి. అలవాట్లు అనుభవాల్ని తయారుచేస్తాయి. అనుభవాలు శీలాన్ని తీర్చిదిద్దుతాయి. అనుభవాలే మనిషిలో ఆశాకిరణాల్ని ప్రసరింప చేస్తాయి. బాల్యమునుండి మనం ఎలాంటి అనుభవాలు ఊహలు కలిగి ఉంటామో వృద్ధాప్యంలో అవే స్ఫురిస్తుంటాయి. ఆచరించగలిగే వయసున్నంతవరకు ఆశలు రుచిగానే ఉంటాయి. మనసులో కలిగే ఆశా స్వరానికి వయస్సు లయ కల్పిస్తుంది. వయస్సు ఎప్పుడూ ఒకేలా వుండదు. వయసు మళ్ళుతుంది, శరీరం సడలిపోతుంది. ముసలితనం ప్రాప్తిస్తుంది. గతించే శరీరంలో స్మరించే మనసు భయంకరంగా తయారవుతుంది. తన గతానుభవాల్ని దృష్టిలో ఉంచుకొని ఆనందాన్ని పొందాలని మనసు సదా యత్నిస్తూ వుంటుంది. పతనమైన శరీరము అందుకు అనుగుణ్యంగా వుండదు. కదలలేని కళేబరము మనోనిర్ణయాల్ని అమలు పెట్టలేదు.

వింత వింత దృశ్యాలను చూడాలని మనసు ఆవేదనపడుతుంది. వృద్ధాప్యంలో దృష్టి లోపిస్తుంది. నేత్రాలు చూడలేక పోతాయి. రుచికరమైన పదార్థాలు తినాలని మనసు ఉబలాటపడుతుంటే దంతాలులేని అశక్తత నిరాశను కల్గిస్తుంది. శ్రావ్యమైన సంగీతాన్ని ఆస్వాదించడానికి మనసు తహతహ లాడుతుంటే, శక్తిని కోల్పోయి కుడ్య రంధ్రాలవలె నిలచిన వీనులు అసంతృప్తిని అందిస్తాయి. వివిధ ప్రదేశాలకు వెళ్ళాలనే ఆశ ఉంటుందేగాని, కదలను శక్తిలేక భారమైన శరీరము నిరసన తెలుపుతుంది. మనసులో చెలరేగే ఆశలకు శరీరంలో రూపురేఖలు దిద్దలేక మనిషి చెదిరిపోతుంటాడు. మళ్ళిన వయస్సులో చెదరిన మనసుగల మానవుని దీనావస్థను రచయిత ఈ శ్లోకముద్వారా తెలియచేస్తున్నారు.

శరీరం సడలిపోయి, వెంట్రుకలు తెల్లబడి, దంతాలు ఊడిపోయి, ముసలివాడై, నడవను శక్తిలేక కర్రను ఊతగా తీసుకొని కదులుతున్నను అతడిలో ఆశలు అణగారిపోలేదని



ఇంద్ర ధనుస్సులో గుడికట్టే ప్రయత్నం నిరర్థకం కాదా? ఆకాశంలో మేడలు నిర్మించి నివసించాలనుకోవడం అవివేకమనిపించుకోదా? ఎండమావులు గతంలో ఎవరి దాహం తీర్చాయి? ఫలించని ఆశలు మనిషికి ఏమి సంతృప్తిని కలిగిస్తాయి?

ఆచరించడానికి శరీరం అందుబాటులో లేకున్నను మనసులో ఆశలు అంతరించడం లేదు. ఆశలకు ఆచరణకు మధ్య పెద్ద అగాధం ఏర్పడింది. గతంలో ఏర్పరచుకున్న అనుభూతులు తనను నిమ్మళంగా బ్రతకనివ్వడం లేదు. అరణ్యాలను సైతం దహింపచేసే దావానలంలా ఆశాబడబాగ్ని చెలరేగుచున్నది. మనసు కొన్ని యోజనాలు పరుగెడుతుంటే అడుగు ముందుకు వేయలేని నిస్సహాయ స్థితిలో దేహం అల్లాడుతుంది.

ఆసుపత్రిలో రోగి చేరుతాడు. రోగం నయమయ్యేవరకు ఆసుపత్రినే ఆనందాలయముగా భావించాలి. షడ్రసోపేతమైన భోజనం కావాలని రోగి వాంఛిస్తున్నా, కనీసం సామాన్యమైన ఆహారాన్నివ్వడానికి కూడా వైద్యుడు అంగీకరించడు. చికిత్సపూర్తిఅయి, రోగి ఆరోగ్యవంతుడయ్యే వరకు పరిస్థితి ఇంతే. రోగి శరీరం ఆసుపత్రిలో పవ్వళించి ఉంటుంది. రోగి మనస్సు పాకశాలలో పచార్లు చేస్తుంటుంది. మనసులో కలిగే ఊహలకు, శరీర రుగ్మతకు మధ్య సంఘర్షణ ఏర్పడి వ్యాధి తీవ్రరూపం దాల్చడమే అవుతుంది.

ముసలితనంలో వ్యక్తి పరిస్థితి ఇంతకన్నా భయంకరంగా ఉంటుంది. రోగం నయమై ఆసుపత్రినుండి బయటపడిన తరువాత అయినా రోగి ఆరోగ్యవంతు డవుతాడు, అనుభవాలు గడించుటకు సిద్ధమవుతాడు కాని వృద్ధాప్యం వేరు. ముసలితనం ప్రాప్తించిన పిదప ఇక ఆరోగ్యం తిరిగివచ్చే మాటేలేదు. సడలిన ఒడలు మృత్యుకడలిలో కలసి పోవలసిందేగాని ఆరోగ్య ప్రదమైన ఆనంద మందిరం కాలేదు. నెరసిన కేశములు రాలిపోవలసిందేగాని సర్వాంగ సుందరముగ తిరిగి కనుపించవు. బోసినవ్వుల తాతగారు కూడబెట్టిన ఆస్తినంతా వెచ్చించినా రాలిన దంతాలు తిరిగి మొలకెత్తవు. నిలబడను శక్తిలేక ఎక్కు పెట్టిన ధనుస్సులా వంగిపోయిన వెన్నెముక తిరిగి నిటారుగా నిలబడేదిలేదు. వంగిన కట్టెకు వంగని కర్రను ఊతగొని మోయలేని శరీరభారాన్ని మోస్తూ నడక సాగించే వృద్ధాప్యము ఎంతభయంకరమైనది?

హృదయ విదారకమైన యిట్టి విపత్కర పరిస్థితిలో కూడా మానవుడు తాను కూడగట్టుకొన్న కోరికల మూటలను వదలలేకున్నాడు. ఆశాపాశాన్ని త్రెంచలేకపోతున్నాడు. వివేకము లేక, విచారణసాగక ఇంద్రియ విషయాలు మధురభూమికలని భ్రమించి, అనిత్యమైన విషయ సుఖముల వెంట నడక సాగించి, వృద్ధాప్యంలో దుఃఖాన్ని అనుభవిస్తూ దుర్మరణం పొందుతున్నాడు.

అనివార్యమైన ముసలితనము అందించే దారుణ పరిస్థితులకు చెదరకుండా ప్రతి వ్యక్తి ప్రశాంత జీవనం గడపగలగాలి. ముసలితనంలో అంత స్థిమితంగా జీవించాలంటే బాల్యము నుండే చక్కటి అవగాహనను ఏర్పరచుకోవాలి. శీలాన్ని నిర్మించుకోవాలి. ఉన్నదానితో సంతృప్తి చెందడం అలవరచుకోవాలి. పరిమితమైన శారీరక మనోబుద్ధుల అయోమయ స్థితిని ఆకళింపు చేసుకోవాలి. దేహముపై వ్యామోహమును వీడి నివసించాలి.

"జన్మమృత్యు జరావ్యాధి దుఃఖ దోషాను దర్శనమ్"

జన్మలోని బాధను, మృత్యువులోని శోకాన్ని, ముసలితనంలో క్లేశాన్ని, వ్యాధులలోని దుఃఖాన్ని సాధకుడు సదా దృష్టిలో వుంచుకోవాలని భగవద్గీత 13వ అధ్యాయంలో శ్రీకృష్ణపరమాత్మ ప్రబోధించారు.

మనసు సదా ఆలోచిస్తూనే వుంటుంది. విషయ చింతనయందు మనసును లగ్నం చేసినచో అది విషయానుభూతుల్ని సమీకరించి వృద్ధాప్యాన్ని ఘోరంగా తయారుచేస్తుంది. సదా భగవంతునికి సంబంధించిన సద్భావాలతో సదాచరణతో జీవితాన్ని నడపగలిగినచో వృద్ధాప్యంలో దుఃఖానికి దూరం కావడమేగాక అనిర్వచనీయ ఆనంద సాగరంలో యాత్ర చేయడమవుతుంది.

అగ్రే వహ్నిః పృష్టే భానూ
రాత్రౌ చుబుక సమర్పిత జానుః
కరతల భిక్ష స్తరుతల వాస
స్తదపి నముఞ్చ త్యాశాపాశః 16



అగ్రే = ఎదురుగా, వహ్నిః = అగ్నిని, పృష్టే = వెనుక, భానూ = సూర్యుడును, రాత్రౌ = రాత్రులందు, చుబుక = గడ్డమునకు, సమర్పిత = సమర్పింపబడిన, జానుః = మోకాళ్ళనూ, కరతల = చేతి దోసిలితో, భిక్షః = తిండి ఆరగించువాడునూ, తరుతల = వృక్షఛాయలందు, వాసః = వసించువాడును, తదపి = అయినను, ఆశాపాశః=ఆశాపాశమును, న ముఞ్చతి = వదలడు.

భావము:- ముందు చలిమంట, వెనుక సూర్యునివేడి, రాత్రులందు మోకాటిని గడ్డానికి తగిలేటట్లుగా పెట్టుకొని కూర్చుంటాడు. ఆహారం దోసిట్లో పెట్టించుకొని తింటాడు. చెట్టునీడలో జీవిస్తాడు. ఇట్టి దీనావస్థలో కూడా కోరికలు దూరం కావటంలేదు.

## వ్యాఖ్య

శంకరాచార్యులవారి ముఖ్యశిష్యులలో ఒకరైన హస్తామలకుడు ఈ శ్లోకము రచించినట్లు తెలియుచున్నది.

ప్రతివ్యక్తి ఆనందంగా వుండాలని ఉబలాటపడుతుంటాడు. కానీ ఆనందమేమిటో, అది ఎలా వస్తుందో అర్థం చేసుకోవాలని ప్రయత్నించడు. నిత్యమైన వస్తువులోనే ఆనందము ఉంది. సత్యమైన వస్తువులోనే సుఖం నిండివుంది. అనిత్యమై, అశాశ్వతమైన వస్తువులలో సుఖం లేశమైనా గోచరించదు. ఆత్మ ఆనందస్వరూపము. ప్రపంచం దుఃఖమయము. సుఖస్థానమైన ఆత్మను వీడి శోకతప్తమైన ప్రపంచముపై మానవుడు ఆధారపడి కోరికలను పెంచుకొంటున్నాడు.

విజాయితీపరుడైన ఉద్యోగి ఎన్ని అడ్డంకులు వచ్చినను లెక్క చేయకుండా, క్రమం తప్పకుండా వృత్తిధర్మం నిర్వహిస్తుంటాడు. అతడికే తీవ్రంగా [illegible] ముఖ్యమైన ఆరోగ్యాన్ని

కాపాడుకోటానికి యత్నిస్తాడు. సినిమా వ్యామోహంగల విద్యార్థి పరీక్షలు దగ్గరయ్యేసరికి సినిమాలు చూడటం మానేసి తన జీవితాశయమైన చదువుపై దృష్టి మరలిస్తాడు. అవసరాన్ని గుర్తించడమే అందులకు కారణము.

మనము అనవసరమైన ఎన్నో విషయాలను గూర్చి అలసిపోయేటంతగా ఆలోచిస్తాము. అతి ముఖ్యమైన జీవితాన్ని గూర్చి క్షణమైనా ఆలోచించము. ఇంద్రియాలు మనల్నెంతగానో మోహింప చేస్తున్నాయి. మోసం చేస్తున్నాయి. అర్వై సంవత్సరాలు చర్విత చర్వణముగా అనుభవించిననూ అవి స్మృతి ఫలకంపై తిష్టవేస్తున్నాయేగాని మనలను ప్రశాంతంగా విడిచి దూరం కావడంలేదు. అనుభవిస్తున్న కొద్దీ అగ్నికి ఆజ్యం తోడైనట్లు మనసులో వికారములు వృద్ధి చెందుతున్నవేగాని క్షాళనం కావడం లేదు. వాటిపై మనకున్న కోరికలే మనలను మతిభ్రష్టులుగా చేయుచున్నవి. కోరికలే దుఃఖానికి కారణమై యున్నవి. కోరికలే మనకు నిజమైన శత్రువులు.

జీవితములో ప్రతిక్షణము మనము ఆరోపణ చేసుకొనే అసంతృప్తియే కోరికలు ఏర్పడటానికి కారణము. మనము జీవిస్తున్న ప్రస్తుత పరిస్థితులలో సుఖంగా లేము. మనకులేని కొన్ని వస్తువులు లభించడమువలన తృప్తిగా ఉండగలమని భావించి ఆ వస్తువులకై అర్రులు చాచి నిలబడతాము. అవే కోరికలు. స్కూటరు వుంటే హాయి కలుగుతుందనే భావ మెప్పుడయితే మనస్సులో స్ఫురిస్తుందో, దానికి సంబంధించిన సంకల్పాలు విజృంభించి మనలను అశాంతికి గురి చేస్తాయి. స్కూటరు కొనగానే కోరిక తీరింది గనుక అది కల్పించిన మానసిక అలజడులు కూడా ఆగిపోతాయి. అప్పుడు మనిషికి ఆనందం కలుగుతుంది. ఈ ఆనందము ఎంతో కాలం నిలువదు. ఇది క్షణికమే. మరొక కోరిక మనోఫలకముపై కదలగానే మళ్ళీ ఆవేదన ప్రారంభమవుతుంది. కనుక ఆనందమనేది ఒక సంకల్పము అణగి మరొక సంకల్పము తలయెత్తే లోగా మధ్యలో భాసించే నిశ్శబ్దమే. కనుక కోరికలను తీర్చుకోవడంగాక కోరికలను లేకుండా చేసుకోవడం వలన మనిషి సుఖపడతాడు.

కోరికలకు అలవాటు పడ్డవాడు తూర్పును చూస్తూ పడమరగా భావించే చాదస్తుని వంటివాడు. కోరికల హోరుగాలిలో



పోగొట్టుకుంటాడు. జీవితంలో ఇలా కలసి నడచిన కోరికలు వృద్ధాప్యంలో వెళ్ళమంటే వెళ్ళవు. కోరలుచాచి కాటువేస్తూనే వుంటాయి. కోరికలచేత స్వారీ చేయబడే మానవుడు నిజమైన బానిస బ్రతుకును సాగిస్తున్నాడు.

కోరికలు ఎంతటి వాడినయినా బలహీనుణ్ణి చేస్తాయి. స్త్రీపురుషులనే తేడా వాటికి లేదు. పండిత పామరులనే తారతమ్యం తెలియదు. రాజు పేదలనే భేదం ఉండదు. కోరికలు అందరిని తమ శక్తిచేత కీలుబొమ్మలుగా చేసి ఆడిస్తాయి.

సామాన్యుల విషయంలోనేగాక దీనావస్థలో కాలం గడిపే ఒక ప్రత్యేక దురదృష్టవంతుడిపై కూడా కోరికలు తమ ప్రభావాన్ని ఎలా చూపుతున్నాయో ఈ శ్లోకంలో రచయిత తెలియజేస్తున్నారు.

ముందు చలిమంట, వెనుక సూర్యుని వేడి, రాత్రులందు మోకాటిని గడ్డానికి తగిలేటట్లు పెట్టుకొని ఆవ్యక్తి కూర్చుని యున్నాడు.

శరీరములో పటుత్వము తగ్గి, రక్తము క్షీణించి, ప్రకృతి అందించే చలిని భరించలేని ముదుసలి సూర్యరశ్మిలో శరీరాన్ని వేడి చేసుకుంటున్నాడు. సూర్యునివేడి లభించని కాలంలో చలిమంట వేసుకొని చలి కాచుకుంటాడు. సూర్యునివేడి, చలిమంట రెండూ లేని రాత్రి పూట తనమోకాళ్ళను ముడిచి గడ్డానికి తగిలించి వణుకుతూ వుంటాడు.

ఆకలయినపుడు ఎవరినైనా యాచిస్తాడు. ఆహారం పెడితే తన దోసిట్లోనే పెట్టించుకొని తింటాడు. కనీసం అక్షయపాత్రను కూడా ఉంచుకోడు. విశ్రమించాలంటే చెట్టునీడలో పడుకుంటాడు. కటిక నేలయే పట్టుపరుపుగా, ఆకాశమే దోమతెరగా భావించి జీవిస్తాడు. తనదంటూ ఏదీలేక తనవారంటూ ఎవరూ మిగలక ఒంటరి జీవితాన్ని సాగిస్తుంటాడు. అట్టి దీనావస్థలో నున్న వ్యక్తినికూడా కోరికలు వదలి పెట్టడం లేదని రచయిత తెలియచేస్తున్నారు.

గత శ్లోకములో గృహస్థుని వృద్ధాప్యస్థితిని చూచి తోటకాచార్యుల వారు జాలిపడ్డారు. ఈ శ్లోకములో విరాగియైన మానవుడు సర్వము త్యజించి, ఏ

కోరికలు వదలిపెట్టడం లేదని హస్తామలకుని సందేశము.

సుఖం వస్తువులలో లేదు. మనలోనే యున్నది. వస్తువులలో సుఖం వున్నట్లయితే ఆ వస్తువు అందరికీ సుఖాన్నిచ్చేదై యుండాలి. ఒకరికి ఆనందాన్నిచ్చిన వస్తువులు మరొకరికి దుఃఖాన్ని కలిగిస్తాయి. త్రాగుబోతువానికి బ్రాంది దర్శనము హాయి నిస్తుంది. అది గిట్టనివానికి దాని దర్శనమే వ్యథను కల్గిస్తుంది. కనుక వ్యక్తులపై, వస్తువులపై జనించే కోరికలను అరికట్టి, ఆనందస్వరూపమైన ఆత్మయందే జీవించాలి. కోరికలను యథావిధిగా విడిచి పెట్టినట్లయితే అవి మనిషి జీవితముపై స్వారిచేసి అనంత దుఃఖమనే సుడిగుండములో పడదోస్తాయి.

కురుతే గంగా సాగర గమనం
వ్రత పరిపాలన మధవాదానం
జ్ఞానవిహీనః సర్వ మతేన
ముక్తిం నభజతి జన్మశతేన 17

గంగాసాగర = గంగా సంగమమునకు, గమనం = యాత్ర, కురుతే = చేయవచ్చును, వ్రతపరిపాలనమ్ = వ్రతము లాచరించుట, అథవా = లేనిచో, దానమ్ = దానధర్మములు, సర్వమతేన = సమస్త మతానుసారము, జ్ఞానవిహీనః =జ్ఞానహీనుడు, జన్మశతేన = శతజన్మలెత్తినను, ముక్తిం = మోక్షమును, నభజతి=పొందలేదు.

భావము :– మానవుడు గంగాసాగర్‌కు వెళ్ళి స్నానమాచరించినను, వ్రతములు జరిపినను, దానములు చేసినను జ్ఞానము పొందునంతవరకు నూరు జన్మలెత్తినను ముక్తి లభించదని అన్ని మతాలు అభిప్రాయ పడుచున్నవి.

## వ్యాఖ్య

సంసార దుఃఖాగ్నిలో కుమిలిపోతున్న మానవుడు శోక వలయమునుండి బయటపడి పరమశాంతిని పొందుటయే మానవ జీవితలక్ష్యమై యున్నది.

ఆత్మజ్ఞానములోనే పరమశాంతి కలదు. సూర్యునివలె ఆత్మ స్వయం ప్రకాశమై యున్నది. మేఘము సూర్యప్రకాశమును ఆటంకపరచులాగున అజ్ఞానము ఆత్మ ప్రకాశమునకు అడ్డుపడుచున్నది. గాలి తన ప్రభావముచే మేఘములను దూరం చేసి సూర్యకాంతిని మనము దర్శించునట్లు చేయులాగున సకల సాధనలు అజ్ఞాన మేఘములను దూరము చేయు ప్రయత్నములై యున్నవి. మేఘము దూరం కాగానే సూర్యుడు తనకు తానుగా భాసించునట్లు అజ్ఞానము నశించగానే ఆత్మ స్వయముగా భాసించుచున్నది.

కర్మద్వారా కర్మ నశించదు. అపరిపక్వమైన కర్మ పరిపూర్ణ శాంతిని ప్రసాదించలేదు. కోరికలు అజ్ఞాన జనితములు. కర్మలు వాంఛాప్రేరితములు. అజ్ఞాన జనితమైన కర్మ జ్ఞాన సంబంధమైన ముక్తిని యివ్వలేదు.

"అవిరోధితయాకర్మ నా విద్యాం వినివర్తయేత్
విద్యా విద్యాం నిహంత్యేవ తేజస్తిమిర సంఘవత్"

"కర్మకు అవిద్యకు తేడాలేదు గనుక అజ్ఞానము కర్మచే పరిసమాప్తి నొందదు. వెలుతురు చీకటిని పారద్రోలునట్లు విద్యయే అవిద్యను పోగొట్టగల"దని శంకరులు ఆత్మబోధలో తెలియజేశారు.

"నహిజ్ఞానేన సదృశం పవిత్రమిహవిద్యతే"

జ్ఞానముతో సమానమైనది ఈ ప్రపంచమున ఏదియు లేద"ని భగవద్గీత 4వ అధ్యాయములో శ్రీకృష్ణ పరమాత్మ తెలియజేశారు.

చక్కెర బొమ్మయందు లోపల బయట యను తేడాలేక అంతయూ పంచదార మయమగునట్లే, జ్ఞానము కలుగగానే "ఇది–అది" అనే భేదభావం నశించి "అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణస్థితః" లోపల బయట సమస్తము

జ్ఞాన సముపార్జనకు సముద్రస్నానాలు, వ్రతాలు, దానధర్మాలు సాధనములుగా మహాత్ములు సూచించారు. జీవభ్రాంతిని తొలగించుటకు మనసును పరిపక్వదశకు గొనిపోవుటకు ఇవి ఉపయోగపడగలవని తెలియజేసారు.

ప్రాథమిక దశలో విద్యాభ్యాస సందర్భమున ఉపాధ్యాయుడు అక్షరములు తెలియచేయు పటమును చూపిస్తూ విద్యార్థిచేత అక్షరములు వల్లెవేయిస్తాడు. విద్యార్జనకై అక్షరములు వల్లెవేయిస్తారేగాని అక్షరములు వల్లించడమే విద్యకాదు. సంపూర్ణ విద్యాసాధనకు అక్షరములు వల్లెవేయుట మార్గమై యున్నది. ప్రాథమిక దశలో అక్షరములు వల్లించిన విద్యార్థి విశ్వవిద్యాలయ స్థాయికి వచ్చినను అదేపద్ధతిని కొనసాగించినచో అతడు విద్యార్జనకు అనర్హుడని వేరుగ చెప్పనక్కర లేదు. గమ్యమును చేరుటకు మార్గమవసరమే కాని మార్గమే గమ్యమనే భ్రాంతి అనర్థకము.

సముద్రస్నానాలు, వ్రతము లాచరించుట, దానధర్మములు చేయుట మొదలగువాని ప్రభావము సాధకునిమీద ఎంతయినా కలదు. చక్కటి అవగాహనతో, చిత్తశుద్ధితో పైకార్యములు ఆచరించుటవలన మనసు నిర్మలమగును. నిర్మలమైన మనసు సూక్ష్మమైన ఆత్మతత్త్వమును గ్రహించుటకు అనుగుణ్యముగా తయారగును. అలాగాక మూఢ విశ్వాసములకు వారసుడై స్వార్థపూరితముగ కామ్యకర్మ లాచరించువారికి ఏవిధమైన ఆధ్యాత్మికానుభవము కలుగకపోగా, అవన్నియు దేహ సంబంధిత వ్యాయామములుగా, అహంకార దర్పాదులను ప్రదర్శించు అజ్ఞాన ప్రయోగాలుగ మిగులుతాయి.

పవిత్ర నదీజలాలలో స్నానమాచరించినపుడు శరీర శుభ్రతతో పాటు మనోమాలిన్యములను కూడా తొలగించుకొను విధముగా భావశుద్ధి కలిగి మనలోని చెడులను పరిత్యజించి ప్రశాంత చిత్తమును పొందవలయును. గంగాసాగర్ నందు స్నానమాచరించుట యనగా గంగానది సముద్రములో కలియుచోటని అర్థము. పవిత్రమైన గంగాసాగర్‌నందు భక్తులు స్నానమాచరించి పునీతులవుతుంటారు. మరొక అర్థమునుకూడా ఇచ్చట గ్రహించాలి. గంగాసాగర్ అంటే గంగానది మరియు సాగర్ అంటే రామేశ్వరములో సేతువువద్ద

స్నానమాచరించుట అని భావము. కాశీ రామేశ్వరములకు చేయు యాత్ర అనికూడా భావించవచ్చు.

వ్రతముల నాచరించుటలో కూడా భావశుద్ధి అవసరమై యుండాలి. ఆధ్యాత్మిక అవగాహనలో ఆత్మైక్య సంధానమే ముఖ్యముగా భావించి వ్రత విధానమునందలి అంతర్గత భావసౌందర్యమును గాంచుతూ ఆచరించాలి. నిధి నిక్షేపాలు భూమిలో ఫలానాచోట ఉన్నవని తెలియనివాడు ఎన్నిసార్లు ఆ ప్రదేశముపై నడచినను దానిని గ్రహించలేని విధముగా ఆధ్యాత్మిక అవగాహన లేకుండా సాధనలు చేయువాడు ఎంత శ్రమించినను అనుభవమును పొందలేడు.

భగవంతుడు మనకు ప్రసాదించిన దానిని చైతన్యస్వరూపులైన ఇతర ప్రాణులతో పంచుకొనుటకు చేయు ప్రయత్నమే దానము. దాన ధర్మము లాచరించుటయందు భేదభావమును చూడక ఈశ్వర ప్రీత్యర్థంగా చేయాలి. అప్పుడే దానధర్మములు సరియైన ఫలితాలివ్వగలవు. రజోగుణప్రేరిత దానాలు, అహంకారపూరిత ధర్మాలు మనలోని అజ్ఞానానికి పునాదిరాళ్ళు అవుతాయేగాని మనల్ని పునీతుల్ని చేయవు.

దానం చేయుటకు మనమెవరము? ఈ సృష్టిలో ప్రతి వస్తువు భగవంతునిచేత వ్యాపకమై యున్నది. భగవంతునికి సంబంధించిన వస్తువులను మనం దానం చేస్తున్నామని భావించటం అవివేకం. భగవంతుడు మనకు ప్రసాదించిన వస్తువులను అర్హత కలిగిన వ్యక్తులకు ఇచ్చునపుడు దానిని దానమని తలంచక ఇతరులకు సేవచేయు భాగ్యం ఈ రూపేణా పరమాత్మ మనకు కల్పించాడని భావించి, దానిని నారాయణ సేవగా చేయడం వలన ఆత్మోద్ధరణ జరుగుతుంది.

అసంపూర్ణ జ్ఞానముతో చక్రవ్యూహంలో ప్రవేశించి ఆహుతియైన అభిమన్యునివలె సంపూర్ణ జ్ఞానము లేనివారు ఆధ్యాత్మిక రంగములో విజయమును సాధించలేరు. మహాత్ముల సహచర్యం వలన మనకు అట్టి జ్ఞానము కలుగుతుంది. తాము సముపార్జించిన జ్ఞానమును మహాత్ములు గ్రంథాలలో భద్రపరచారు. అవే మత గ్రంథాలై ఆత్మ మార్గమున ప్రయాణం సాగించే ఆధ్యాత్మిక బాటసారులకు

మార్గాములై నిలిచాయి. జ్ఞానము వినా ముక్తికి మరోమార్గంలేదని అన్నిమతాలు ఏకకంఠంతో పలుకుతున్నాయని రచయిత ఈ శ్లోకంలో తెలియచేయుచున్నారు. ప్రపంచ మతాలన్నియు కూడా జ్ఞానావశ్యకతను ఎలుగెత్తి చాటుతున్నాయి.

విజ్ఞానము వివరించ శక్యముగాదు. అది అనుభవగ్రాహ్యం, చైతన్యమును మరొక వస్తువుతో పోల్చవలసి వచ్చినపుడు చైతన్యము తప్ప మరొకటి లేని విధముగా చైతన్య స్వరూపమైన జ్ఞానమును జ్ఞానముతో పోల్చవలయునేగాని మరొక వస్తువుతో పోల్చుటకు వీలులేదని జ్ఞానేశ్వర మహరాజ్ తన గీతా భాష్యము జ్ఞానేశ్వరిలో తెలియచేస్తారు.

దేని ప్రభావముచేత కోరికల సంతగోల సమూలంగా మాయమగునో, ఏ పవిత్ర సన్నిధానములో మనోతర్కములు, బుద్ధికుశలతలు పట్టుతప్పి మూగబోవునో, దేనిని పొందడము వలన ఇంద్రియాలు విషయానురక్తిని విడచునో, ఏ ప్రశాంత చైతన్యములో మనోనాశం జరిగి "ఏకమేవా అద్వితీయం బ్రహ్మ" అనెడి అనిర్వచనీయ ఆనందం అనుభూతిగా మిగులునో అదియే జ్ఞానము. తదనుభవమే వాంఛనీయము.

సురమన్దిర తరుమూల నివాసః
శయ్యా భూతల మజినం వాసః
సర్వ పరిగ్రహ భోగత్యాగః
కస్య సుఖం న కరోతి విరాగః 18

సురమందిర = మందిరములయందు, తరుమూల = చెట్లమొదలులో, నివాసః = జీవించువానికి, శయ్యా = పడక, భూతలము=నేల, అజినం = చర్మమును, వాసః = ధరించినవానికి, సర్వపరిగ్రహ= సర్వమును గ్రహించు, భోగ=అనుభవించు అభిలాష, త్యాగః = వదిలినవాడు, విరాగః = వైరాగ్యముల, కస్య = ఎవనికి?, సుఖం = సుఖము, నకరోతి=కలిగించదు?

భావము :- దేవాలయాల్లోను, చెట్టునీడలోను తలదాచుకుంటూ, కటికనేలపై పవళిస్తూ, [illegible] వస్త్రముగా

ధరిస్తూ, సర్వమును పరిత్యజించి, అనుభవించే కోరికను కూడా విడనాడిన వైరాగ్యము ఎవరికి సుఖాన్నివ్వదు?

ఈ శ్లోకమును వార్తికాకారులైన సురేశ్వరాచార్యులు రచించినట్లు తెలియుచున్నది.

## వ్యాఖ్య

నిజమైన విరాగి తనలోతాను తృప్తిపడి యుంటాడు. సార్వభౌమాధిపత్యము లభించినను దానిని గడ్డిపోచలా భావిస్తాడు.

వస్తువులతో, వ్యక్తులతో, మనం ఏర్పరచుకొను సంగత్వము బాహ్యప్రపంచములో బంధమై యున్నది. ఏ వస్తువులతో మనం మమకారాన్ని పెంచుకున్నామో, ఏ వ్యక్తులతో తీరని సంబంధాన్ని, బాంధవ్యాన్ని ఏర్పరచుకున్నామో ఆయావస్తువులు, వ్యక్తులు దూరమైనా, స్థితిగతులలో మార్పువచ్చినా, మనకు అనంత దుఃఖం కలుగుతున్నది. వస్తువులుగాని, వ్యక్తులుగాని తమకు తాముగా మనకు సుఖాన్నిగాని, దుఃఖాన్నిగాని పంచలేరు. ఆయా వస్తువులతో, వ్యక్తులతో మనం ఏర్పరచుకొనే సంబంధాన్ని బట్టి సుఖదుఃఖాలు కలుగుతుంటాయి. వస్తువులలో సుఖమున్నట్లయితే అవి అందరికి సుఖప్రదమై యుండాలి. వస్తువులలో దుఃఖమున్నట్లయితే అవి అందరికి సుఖప్రదమై యుండాలి. వస్తువులలో దుఃఖమున్నట్లయితే వాటి సాన్నిధ్యం అందరికీ దుఃఖాన్ని అందించేలా వుండాలి. మన అనుభవం అందుకు భిన్నంగా ఉంది. ఒకరికి ఆనందాన్నిచ్చిన వస్తువులు మరొకరికి దుఃఖాన్ని కల్గిస్తున్నాయి. ఒకరికి మిత్రుడు మరొకరికి శత్రువుగా జీవిస్తున్నాడు. కనుక వస్తువులలో సుఖమూ లేదు. దుఃఖమూ లేదు. అది గ్రహించిన వ్యక్తి బాహ్య వస్తువులయందు ఎలాంటి మమకారము లేక విరక్తిభావం కలిగియుంటాడు. వస్తుప్రపంచము యొక్క యదార్థస్థితిని గ్రహించి తటస్థంగా జీవిస్తాడు. ఇది బాహ్య వైరాగ్య మనబడుతుంది.

బాహ్య ప్రపంచము నిస్సారమైనదని, సుఖదుఃఖముల నందించుటకు శక్తి హీనమైనదని తెలిసింది. మరి మానవునికి ఈ బంధమెలా ఏర్పడింది? వస్తువులపై వ్యక్తులపై తాను ఏర్పరచుకొన్న అక్రమ సంబంధమే సర్వబంధాలకు మూలము. నాకు ఆ వస్తువు కావాలి. ఆ వ్యక్తులుకావాలి అనే కోరికలు అంతర్యంలో ఆవిర్భవించినపుడు ఆయా వస్తువులు, వ్యక్తులు మనల్లోని కోరికలకుండే శక్తిని గ్రహించి తద్వారా మనలను తమకు బానిసలుగ చేసుకొని దుఃఖవలయంలో పడదోస్తారు. “నేను” “నాది” అనే అహంకార మమకారాదులను వదలినపుడు బాహ్య ప్రపంచము సమూలంగా నిస్సారమై నిలబడుతుంది. మనసులో జనించే కోరికలను, ఈప్సితములను అదుపులో ఉంచుకొని బాహ్య ప్రపంచము వెంట పరుగెత్తెడి అయోమయ జీవితమునకు స్వస్తి చెప్పుట ఆంతరంగిక వైరాగ్య మనబడుతుంది. బాహ్యాభ్యంతరాలలో విరక్తిభావం కలిగి వైరాగ్య సంపన్నుడైన వ్యక్తికి సుఖం ఎందుకు లభించదని రచయిత ఈ శ్లోకంలో తెలియచేయుచున్నారు.

పరమ విరాగియైనవాడు వస్తువులలో మెరిసే ప్రకాశం శాశ్వతమైనది కాదని గ్రహించినవాడై వస్తు సముదాయంపై మమకారమును వీడి జీవనయాత్ర సాగిస్తాడు. తన మనుగడకు సౌందర్య మందిరాలు నిర్మించుకోక దేవాలయాలలోను, చెట్టు నీడలోను జీవిస్తుంటాడు. ఆలయమున కరుదెంచు భక్తులకు దేవాలయ యాజమాన్యానికి తన ఉనికి అభ్యంతరమని తెలియగానే ఆ చోటునుకూడా పరిత్యజించి, రహదారుల చెంత ఏ దిక్కులేక నిలబడియున్న వృక్షఛాయలో తానూ దిక్కులేని ఏకాకినేనని వృక్షజీవితములో తన బ్రతుకును సమన్వయ పరచుకొని జీవిస్తాడు. తరుచ్ఛాయే తనకు హంసతూలిక తల్పంగా భావిస్తాడు. కటిక నేలపై పడుకుంటాడు, హృదయములో పరుపుపై పరుండినను క్షణకాలమైనా నిద్రించలేడు. మనసులోని కల్లోల వాంఛలు మనసులో హోరునవీచే కామరూప సుడిగాలులు గలవ్యక్తి మెత్తటి కోరికలను తుడిచిపెట్టి విరక్తి భావము కలిగి యుండుటచే కటిక నేలకు పట్టుపరుపులకు తారతమ్యం తెలియక విరాగి సుఖంగా నిద్రసాగిస్తాడు.

మృగచర్మమును వస్త్రముగా ధరిస్తాడు. సమాజ సభ్యతకు భంగం వాటిల్లకుండా శరీరమును [illegible] అలంకరణతో



శోభిల్లాలని, అందమైన వస్త్రమును సింగారించుకోవాలని, చూచువారి నేత్రాలకు సౌందర్య పురుషునిలా దర్శన మివ్వాలనే పేలవమైన మనోభావాలు అతనిలో స్ఫురించవు.

దేవాలయాల్లోను, చెట్టు నీడలోను నివసిస్తూ, కటిక నేలపై పవళిస్తూ, మృగచర్మమును ధరిస్తూ, వస్తుప్రపంచ ఆకర్షణలకు లోను గాకుండా జీవించి బాహ్యవైరాగ్యమునందు స్థిరపడి యుంటాడు. సర్వమును పరిత్యజించి, కోరికలను విడనాడి ఆంతరంగిక వైరాగ్యముతో స్థిమితముగా జీవిస్తాడు. అట్టివ్యక్తి ఆనందాన్ని ఎవ్వరూ దూరం చేయలేరని రచయిత అభిప్రాయము.

బాహ్యంలోను, అంతర్యంలోను అనురక్తి అణగి, కోరికలు కరిగి సంపూర్ణ వైరాగ్యముతో కొనసాగే విరాగి జీవితము ఎందులకు? చలించని స్థాణువులా, చలించినను సంచరించని వృక్షములా, సంచరించినను వివేకమును సముపార్జించలేని జంతువులా బ్రతుక వలసిందేనా? విజ్ఞాన నిలయమైన విశ్వంలో అజ్ఞానిలా జీవించడమే వివేకమా? నిరాశావాదంతో, అసంతృప్తితో మృత్యువు కొరకు వేచియుండుటయే వైరాగ్యమా? అనే సందేహాలు చాలామందికి కలుగుతుంటాయి. అలా ఎప్పుడూ భావించడానికి వీలులేదు. వైరాగ్యమనే పదమునకు రెండు అర్థాలున్నాయి.1. “విగతః రాగః విరాగః విరాగస్యభావః వైరాగ్యం” వస్తుప్రపంచమునుండి విడివడి విరక్తి భావమును కలిగియుండుట వైరాగ్యమనబడుతుంది. 2. “విశేషణ రాగః విరాగః విరాగస్యభావః వైరాగ్యం”. మోక్షప్రాప్తికై ప్రత్యేక అనురాగము కలిగియుండుట కూడా వైరాగ్యమనబడుతుంది.

విరాగి బాహ్య ప్రపంచమును, దానిపై తనకున్న వ్యామోహమును విరక్తి భావముతో పరిత్యజించువాడేగాక పరమ ఆశావాదియై నిర్వికల్పానందమును పొంది తరించుటకు తీవ్ర ప్రయత్నము చేయు వాడని కూడా గ్రహించవలయును.

బాహ్య ప్రపంచ అలజడిలోగాని, ఆంతరంగిక పెనుగులాటలో గాని దిగక శక్తి సామర్థ్యములను దారిమరల్చి భగవంతుని దివ్యానుభూతిని పొందుటకు నిరంతరము ప్రయత్నించువాడే విరాగి. అట్టి వ్యక్తి జీవితమే ధన్యము. శోభాయమానము [illegible] ఆదర్శ ప్రాయులకు మకుటము.

నిరంతరము బ్రహ్మచింతనతో, అంతర్యంలో ఆనందానుభూతిని పొంది, తానుతరిస్తూ, ఇతరులు తరించుటకు అనుకరింపదగినశీలవంతుడుగా, పరమత్యాగిగా, అలరారుతూ అమరుడై, ఆచంద్రార్కం ఆధ్యాత్మిక చింతనగల వ్యక్తుల హృదయాలలో ఆరని జ్యోతియై ప్రకాశిస్తుంటాడు.

యోగరతో వా భోగరతో వా
సఙ్గరతో వా సఙ్గ విహీనః
యస్య బ్రహ్మణి రమతే చిత్తం
నన్దతి నన్దతి నన్దత్యేవ 19

యోగరతః = యోగమునందు రమించువాడు, వా = అగుగాక, భోగరతః = భోగమునందు రమించువాడు, వా = కావచ్చు, సఙ్గరతః = ప్రపంచ సంగత్యముకలవాడు, వా = అగుగాక, సఙ్గవిహీనః = నిస్సంగుడుకావచ్చు, యస్య = ఎవనియొక్క, చిత్తం = చిత్తము, బ్రహ్మణి = బ్రహ్మమునందు, రమతే = రమించునో, ఏవ = అతడే, నన్దతి = ఆనందించుచున్నాడు, నన్దతి = ఆనందించుచున్నాడు, నన్దతి = ఆనందించుచున్నాడు.

భావము:– యోగము ననుష్ఠించినా, భోగము ననుభవించినా, సమూహంలో నివసించినా, ఏకాంతంలో కాలం గడిపినా, ఎవని మనసైతే బ్రహ్మపదార్థమందు రమిస్తూ వుంటుందో అతడు ఆనందమును పొందును. సుఖము ననుభవించును. అతడే ఆనందమయుడై యుండును.

శ్రీనిత్యానందులవారు ఈ శ్లోకము రచించినట్లు తెలియుచున్నది.

పరమోత్కృష్ట బ్రహ్మానుభూతిని పొంది జీవించు జ్ఞాని స్థాయిని ఈ శ్లోకంలో రచయిత తెలియజేయుచున్నారు.



## వ్యాఖ్య

ఉన్నదంతయూ చైతన్యమే. చైతన్యముతప్ప రెండో వస్తువు లేదు. పైన క్రింద, లోపల–బయట, ముందు–వెనుక, తూర్పు–పడమర అనునవి శరీరమును దృష్టిలో ఉంచుకొని ఆలోచించినపుడు మాత్రమే తెలియుచున్నది. చైతన్యస్థాయిలో అలా గ్రహించుటకు వీలులేదు. చైతన్యము ఒక వస్తువు కాదు గనుక రూపం లేదు. సూక్ష్మతరము గనుక గ్రహించుటకు వీలులేనిది, తెలియబడే శరీరములో తెలుసుకొనే చైతన్యమున్నట్లు భావిస్తాము. శరీరములో చైతన్యమున్నదని చెబుతుంటాము. అది సరియైన అవగాహనకాదు. కుండలోవున్న ఆకాశమని అంటాము. ఆకాశాన్ని కుండలో బంధించగలమా? కుండస్థాయి నుండి చూచినపుడు కుండలో ఆకాశమున్నదని చెబుతున్నాము. దృష్టిని ఒక్కసారి కుండ స్థాయినుండి ఆకాశంవైపుకు మరలిస్తేచాలు. అసలు కుండే ఆకాశంలో వున్నది. ఆకాశంలోనే కుండ తయారైంది. ఆకాశంలోనే మనుగడను సాగిస్తున్నది. అలాగే శరీరములో చైతన్యమున్నదని పలుకుతుంటాము. యదార్థానికి సర్వమూ చైతన్యములోనే యున్నది. శరీరము కూడా చైతన్యములోనే యున్నది. కుండస్థాయినుండి దృష్టిని ఆకాశం వైపునకు మరల్చగానే ఆకాశంలోనే కుండ వున్నట్లు తెలియులాగున దేహస్థాయినుండి చైతన్యస్థాయికి దృష్టి మరల్చగానే చైతన్యములోనే శరీరము, నదులు, పర్వతాలు సర్వమూ ఉన్నట్లు తెలుస్తుంది.

మనతోపాటు మనచుట్టూవున్న ప్రపంచాన్నంతా మనం తెలుసుకుంటున్నాం. సమస్తమును ఇలా తెలుసుకొనుచున్న దెవరు? మనమే కనుక మనం చైతన్యమేనని తెలుస్తున్నది. చైతన్యమైన నేను వస్తువులను ఆకళింపు చేసుకోగానే వాటిని తెలుసుకొనే వాడినవుతున్నాను. వస్తువులనుండి వేరుపడగానే చైతన్యంగా ఉండిపోతున్నాను. వస్తువులను చూస్తున్నంతసేపు చూచువానిగా, శబ్దములను వింటున్నంతసేపు వినేవానిగా ఇలా సంబంధ వ్యాపారములు సాగించుచున్నాను. వీటి నుండి దూరం కాగానే కేవలం చైతన్యముగా ఉంటున్నా. వస్తువులు దేశకాలబాధితమై వున్నవేకని నేను దేశకాలాదులకు అతీతుడను. దేశకాలాదులు మనసుద్వారా తెలియబడుచున్నవి. మనసు చైతన్యమువలన ప్రకాశించుచున్నది.

కనుక మనసు చైతన్యమును గ్రహించే స్థితిలోలేదు.

"తమేవభాన్త మనుభాతి సర్వం
తస్యభాసా సర్వమిదం విభాతి"

"స్వప్రకాశమైన చైతన్యము వలన సర్వమూ ప్రకాశిస్తున్నది. ఈ జగత్తంతయు ఆ దివ్యజ్యోతివలన వెలుగొందుచున్నదని" ముండకోపనిషత్ తెలియచేయుచున్నది.

దేహస్థాయి నధిగమించి, మనోస్థాయిని దాటి, కేవలం చైతన్యముతో లయించి భాసించే జ్ఞాని యోగములో ఉన్నను, భోగములో ఉన్నను ధన్యుడే. జనసమూహములో ఉన్నను, ఏకాంతములో ఉన్ననూ స్థితప్రజ్ఞుడే. దేహ మనోబుద్ధుల కతీతుడు కావడం చేతనే తనకీ అఖండ పరిపూర్ణ స్థితి ప్రాప్తించింది.

ఆత్మానందము ననుభవించు ఆప్తకాముడు తనకు అవసరంలేక పోయిననూ ఇతరులకు ఆదర్శముగా అతడు యోగములో కాలము గడుపవచ్చును. అంతమాత్రాన అతడు అపరిపూర్ణుడని భావించరాదు.

చైతన్య స్వరూపమై వెలుగొందే అట్టి స్థిత ప్రజ్ఞుడు ఎలా జీవించినను దోషములేదు. అతనిలో మంచిచెడులు చూచుటకు వీలుపడదు. మంచి చెడులు నిర్ణయించేది మనసు. ధర్మాధర్మములు సంబంధిత సత్యములు. చైతన్యస్థాయిలో ద్వంద్వాలులేవు. ద్వంద్వాలు గ్రహించి నిర్ణయించే మనసు అక్కడలేదు.

కొన్ని సమయాలలో దేహాభిమానులమైన మనకు జ్ఞాని భోగము ననుభవించునట్లు భ్రాంతి కలుగును. జ్ఞాని భోగవస్తువులమధ్య ఉన్నను అతనిని భోగిగా గుర్తించకూడదు. భోగాసక్తి జ్ఞానికి ఉంటుందా? సర్వత్ర నిండియున్న జ్ఞానిలో కొరత యేముంటుంది? పదహారువేల ఎనిమిదిమంది గోపభామలమధ్య ఉన్నను శ్రీకృష్ణపరమాత్మ బ్రహ్మచారి కాకపోతాడా? ఎక్కడున్నాడనేది సమస్య కాకూడదు: ఎలావున్నాడనేది గ్రహించాలి. ఏమిచేశాడనేది గాక ఎలాచేశాడనేది తెలుసుకోవాలి.



లోక కళ్యాణార్థము ఇతరులను తరింపచేయు నుద్దేశ్యముతో జ్ఞాని పదుగురికి బోధచేయవచ్చు. అలాగాక ఒక నిర్జన ప్రదేశములో ఏకాంత వాసము చేయవచ్చు. పదుగురికొరకై విశ్వమంతయు పర్యటించి ప్రబోధము గావించిన రామతీర్థ భగవానుడు, ఎక్కడా పర్యటించక, తాను కదలక, సర్వులను తన పాదాలచెంతకు కదలించి తరలించి, తరింపచేసిన రమణ భగవానుడు ఇరువురును జ్ఞానజ్యోతులై ప్రకాశించారు. ఎక్కడవున్నా, ఏమిచేసినా, ఎవని మనస్సైతే పరబ్రహ్మయందు సదా రమించునో అతడే జ్ఞాని.

జ్ఞాని ఎలా జీవించినను దోషం లేదనగానే జ్ఞాని దోషపూరిత జీవితమును గడుపవచ్చునని భావించరాదు. జ్ఞానిలో దోషా లుండవు. ద్వేషాలుండవు. జ్ఞానిలో మోసముదయించదు. మోహము కనుపించదు. తాను సత్యానికి ఎన్నడూ సన్నిహితంగానే ఉంటాడు. అసత్యజీవనము అతని సన్నిధిలో దగ్ధమైపోతుంది. పాపాలు అతనిని సమీపించలేక పారిపోతాయి.

అర్హతగలవానిని దేశానికి చక్రవర్తిగా ఎన్నుకొంటారు. అతనికి ప్రత్యేకమైన అధికారాలు ఇవ్వబడతాయి. న్యాయసమ్మతంగా ప్రవర్తించగల శక్తియుండుట వలననే అతనికి ఆ అధికారం ఇవ్వడం జరిగింది. అలాగే జ్ఞాని ఎలా ప్రవర్తించినా పరవాలేదు అనడంలో అది జ్ఞాని యొక్క అక్రమ ప్రవర్తనను సమర్థించే చట్టముగాక, జ్ఞాని యదార్థ స్వరూపమును తెలియచేయు ప్రశంసాపత్రముగా గ్రహించాలి.

జ్ఞాని అన్యాయాలకు, అక్రమాలకు, అధర్మాలకు, అపవాదులకు అతీతుడు. జ్ఞాని స్థితిని మనస్థాయినుండి చూచి నిర్ణయించి అపార్థంచేసుకోవడం భావ్యం కాదు. మనం నిలబడిన చోటునుండి చూడగా ఇంద్ర ధనుస్సులో చక్కగా ఏడురంగులు గోచరిస్తాయి. ఇంద్రధనుస్సు ఉన్నచోటికి వెళ్ళి చూడగా అక్కడ ఏమి గోచరించదు. ఇంద్రధనుస్సు మచ్చుకైనా కనుపించదు. అసంపూర్ణమై కలుషితమైన అంతఃకరణ జ్ఞానిలో కూడా దోషాన్ని చూడటానికి వెనుకాడదు. జ్ఞాని స్థితికి వెళ్ళి దర్శించగానే అంతా బ్రహ్మమయంగా, దోషరహితంగా అనుభవానికి అందుతుంది. కనుక ఎవని మనస్సైతే సదా బ్రహ్మభావంలో లయించి

భగవద్గీతా కిజ్చదధీతా
గంగాజల లవ కణికా పీతా
సకృదపి యేన మురారి సమర్చా
క్రియతే తస్య యమేన నచర్చా 20

ఏన = ఎవనిచేత, భగవద్గీతా = భగవద్గీత, కిజ్చత్ = కొంచమైనను, అధీతా = అధ్యయనము చేయబడినదో, గంగాజల లవకణికా = గంగాజలములో లేశమాత్రము, పీత్వా = త్రాగబడినదో, సకృదపి = కొంచెమైనను, మురారి = శ్రీకృష్ణుడు, సమర్చా = ఆరాధించబడెనో, తస్య = అతనికి, యమేనా = యమునితో, చర్చ = వివాదము, నక్రియతే = ఉండదు.

భావముః– ఎవ్వరైతే భగవద్గీతను కొంచెమైనను అధ్యయనం చేశారో, ఎవ్వరైతే గంగాజలమును కనీసం ఒక్క బొట్టునైనను పానం చేశారో, ఎవ్వరైతే భగవంతుడైన మురారిని కనీసం ఒక్క పర్యాయమైనను పూజించారో అట్టి వారికి యమునితో వివాదముండదు.

ఈ శ్లోకము ఆనందగిరి రచించిరి.

## వ్యాఖ్య

భగవద్గీత ఉపనిషత్తుల సారము. కురుక్షేత్ర సంగ్రామములో కర్తవ్యవిముఖుడైన అర్జునుని నిమిత్తముగా చేసికొని అతని ద్వారా భగవద్గీతను ప్రపంచానికి అందించారు శ్రీకృష్ణపరమాత్మ. భగవద్గీత విశ్వవ్యాపకమైన గ్రంథము. అర్జునుని శోకమోహాదులతో ప్రారంభమైన భగవద్గీత "నష్టోమోహః స్మృతిర్లబ్ధ్వా" జ్ఞాన స్మృతిలో సమాప్తమవుతుంది. తనను మరచి దేవుడు జీవుడయ్యాడు. తనను తెలిసి జీవుడు దేవుడవుతాడు.



ప్రేమతో భగవంతుడు చెప్పిన ప్రబోధమే శ్రీమద్భగవద్గీత. గీతను భగవానుడు ముఖ్యముగా రెండు కోణాల్లోంచి బోధించారు. మొదటిది ఆత్మ దృక్పథము నుండి రాగా రెండవది ప్రాపంచిక స్థాయి నుండి జరిగినది. ప్రతివ్యక్తిలో భాసించే అమరమైన ఆత్మను కర్మ, భక్తి, జ్ఞానాలద్వారా పొంది తరించు మార్గమును పారమార్థిక స్థాయి నుండి బోధించారు. శారీరక, మానసిక నైతిక కోణాల్లోనుంచి బ్రతుకును పరిశీలించి సుఖవంతమైన జీవితమును గడుపుటకు ఉపకరించు మార్గమును ప్రపంచస్థాయినుండి బోధించారు. నదిలో ప్రయాణము చేయువానికి ఈత ఎలా అవసరమో జీవితయాత్ర చేయువానికి గీత అంత అవసరము. గీత అర్జునుని సమస్యను పరిష్కరించింది. నీ, నా సమస్యల్ని పరిష్కరిస్తుంది. అన్నిదేశాలకు, అందరి వ్యక్తులకు, అన్ని కాలాలకు ఉపకరించు ఉత్కృష్టమైన గ్రంథము భగవద్గీత.

భగవద్గీ సంక్షిప్తము, సంపూర్ణము. ఉపనిషత్తుల సంపూర్ణ జ్ఞానమును ఏడువందల శ్లోకములలో ఇముడ్చుటచేత భగవద్గీత సంక్షిప్తము. ఏడువందల శ్లోకములలో సంక్షిప్తమైన గ్రంథము సంపూర్ణ వేదాంత సిద్ధాంతమును తెలియుచేయుటకు సాహసించి సాధించుటవలన భగవద్గీత సంపూర్ణమై యున్నది.

పరమ పవిత్రమైన భగవద్గీతను కొంచెమైనను చదివిన వానికి యమునితో వివాదముండదని ఈ శ్లోకంలో రచయిత తెలియ చేయుచున్నాడు. మృత్యుముఖంలో ప్రవేశించు సందర్భములో కూడా గీతా భక్తుడు చలించడని భావము. నశించేది శరీరమేగాని తానుకాదు. తాను దేహము కాదు. దేహధారి. గీతాజ్ఞానములో పరిశుద్ధాంతఃకరణ కలిగిన వ్యక్తి శారీరక మనోబుద్ధులలో వచ్చు మార్పులకు, క్షీణదశకు తడబడక నిరంజన స్వరూపమైన తాను మార్పులకు, నశింపునకు అతీతుడని జ్ఞానం కలిగియుంటాడు. జీవన్ముక్తుడై జీవించే ఉజ్జ్వల జీవితాన్ని భగవద్గీత ప్రసాదిస్తుంది.

గీతను పఠించడమంటే భావశూన్యంగా, అర్థరహితంగా చిలుకవలె పారాయణ చేయమనికాదు. గీతను అధ్యయనం చేయడమంటే అందులోని విశేషార్థాన్ని ... అర్థము. కేవలం

మౌఢ్యంగా వల్లించడములో ఫలం శూన్యం. ఔషధ నామాన్ని ఉచ్చరించినంత మాత్రాన రోగం నయమవుతుందా? భోజన పదార్థాలను పదేపదే తలచగానే ఆకలి తీరుతుందా? ఔషధం సేవిస్తేనే రోగం కుదుట పడుతుంది. ఆహారం తీసుకొంటేనే ఆకలి తీరుతుంది. గీతా జ్ఞానమును నిత్యజీవితములో ఆచరించినపుడే భవబంధాలనుండి బయటపడి జీవన్ముక్తుల మవుతాము.

గీతా జ్ఞానముతోపాటు పవిత్ర గంగాజలమును పానం చేసిన వారికికూడా యమునితో వివాదముండదని రచయిత తెలియచేస్తున్నారు.

భగవంతుడు సర్వాంతర్యామి. అతడు లేని చోటంటూలేదు. సమస్తములో అతడే నిండియున్నాడు. సకలవస్తు జాలములో అతడే వ్యాపించి యున్నాడు. విశ్వమంతయు పెనవేసుకొనియున్నాడు. సకల ప్రాణుల మనుగడకు జీవశక్తియై యున్నాడు. సృష్టి స్థితి లయముల వెనుక అధిష్ఠానమై యున్నాడు. సర్వత్ర వ్యాపించి, సర్వశక్తి మంతుడైన భగవానుని పరిమితమైన మనోబుద్ధులు గ్రహించలేవు. భగవంతుని అనంతత్త్వమును గ్రహించలేని మనోబుద్ధులు కొన్ని వస్తువులలో, ప్రదేశాలలో భగవంతుని చూడటానికి ప్రయత్నించాయి. ప్రతీకోపాసన ఈ విధంగా ఆవిష్కరించబడింది. నామరూపాలతో తాదాత్మ్యం చెందిన మనసును నామరూపాల నాశ్రయించే పద్ధతిలో శుద్ధి చేయడమనే పవిత్ర భావనతో ప్రతీకోపాసన వచ్చింది. చెట్టును, పుట్టను, రాతిని, నదిని పూజించే దివ్యసాధనను సనాతన ధర్మం ప్రతిపాదించింది. అన్నిచోట్ల, అన్ని వస్తువులలో భగవంతుని దివ్యచైతన్యమును దర్శించడమే ప్రతీకోపాసనలోని ముఖ్యోద్దేశము.

ఆధ్యాత్మిక అవగాహననిచ్చు పుణ్యతీర్థములలో పవిత్ర గంగానది అగ్రగామి. గంగానదిలో మునకవేసినచో సర్వపాపములు హరించిపోవునని హైందవుల దృఢవిశ్వాసము. పావన గంగామాత సనాతన ధర్మ స్రవంతికి చిహ్నము. సాక్షీభూతము. గంగా తీరములలో మహర్షులు నిరంతర తపోధ్యానములు చేసి, తాముతరించి ఇతరులు తరించుటకు ఉత్తమ గ్రంథములను రచించారు. గంగానది అనే తలంపు మన మనసులో మెదలగానే మహర్షుల పుణ్యజీవితములు, వారందించిన ఆధ్యాత్మిక విషయ సౌరభము స్మృతిపథంలో మెదుల్తాయి.



గంగాజలాన్ని పానం చేయడమంటే పై భావాలతో మనసులోని మాలిన్యాన్ని పరిశుద్ధ మొనర్చి ఆధ్యాత్మిక బీజములను హృదయ క్షేత్రములలో నాటవలయునని భావము.

భగీరథుని తీవ్ర తపోఫలితముగా పుణ్య గంగామాత దివినుండి భువికి దిగివచ్చింది. తాము తరించడమేగాక ఇతరులను కూడా పవిత్రులను చేయవలయుననెడి సత్సంకల్పముతో గంగామాతను భూలోకమునకు తెచ్చిన భగీరథుని విశ్వ ప్రేమయు, త్యాగమయ జీవితము మన మనోఫలకముపై ప్రత్యక్షమవుతుంది. ఆధ్యాత్మిక సాధకుడు భూతదయ లోకకల్యాణానికై జీవించు పవిత్రాశయాలతో మనుగడను సాగించాలని తెలియుచున్నది. కనుక అట్టి పరమ పవిత్రమైన గంగా జలం కొంచమైనను పానం చేసిన వ్యక్తి మరణమునకు భీతి చెందనవసరం లేదని రచయిత తెలియచేస్తున్నారు.

భగవద్గీతను చదివిన వానికి, గంగాజలమును పానం చేసిన వానికి మరణ భయములేనట్లే మురారియైన శ్రీకృష్ణభగవానుని కనీసం ఒక్కసారి పూజచేసిన వానికి కూడా మృత్యు భయముండదని రచయిత నిర్ణయం చేయుచున్నారు.

భగవానుడైన శ్రీకృష్ణుడు పుణ్యపురుషుడు. పరంధాముడు. అనుష్ఠాన వేదాంతులకు ఆదర్శమైనవాడు. ధర్మపరిరక్షణకై వాసుదేవుడుగా అవతరించిన నిర్గుణ పరబ్రహ్మము. అతడి జీవితమే ఒక ఆదర్శమైన సందేశము. అట్టి శ్రీకృష్ణుని ఒక్కసారి పూజించినను జీవితము ధన్యము కాగలదని రచయిత ప్రబోధిస్తున్నారు. మనసు భగవానుని యందు పూర్తిగా లయించిన చాలు. ఆ మనసు భగవదాధీనమై పోతుంది.

మనోనిగ్రహం లేక,చంచలత్వముతో జీవించినంత కాలము పూజలు, జపధ్యానాదులుచేసి మాత్రం పొందే ప్రయోజన మేముంటుంది? మనో నిగ్రహంతో ఏకాగ్రదృష్టితో ఒక్కసారి అర్చించినను ఫలం అనంతమని భావము. ఎన్నో సంవత్సరాలుగా గదిలో వుండిన చీకటి దీపం వెలిగించగానే మటుమాయమవుతుంది. అలాగే మనసును ఒక్కసారి భగవంతునియందు లగ్నం చేయుట వలన అనేక ... కాగలదు. మురారిని ఒక్కసారి

అర్చించినను మృత్యు భయముండదని తెలుపుటలో ఉద్దేశ్యమిదియే.

"ముర" అను రాక్షసిని సంహరించుటచేత కృష్ణుడు మురారి అయ్యాడు. రాక్షసులు అజ్ఞానులు. మనలోవున్న అజ్ఞానమే ముర అనెడి రాక్షసి. ముర అనెడి రాక్షసిని సంహరించినట్లే మనలోని అజ్ఞానమును కూడా పరమాత్మ నశింపచేయగలడు. అజ్ఞానము నశించగానే ఆత్మైక్యము జరుగుతుంది. ఆత్మజ్ఞానానికి మృత్యు భయమెందుకుంటుంది? యముని వలన భీతి ఎలా కలుగుతుంది?

మన బ్రతుకునకు, జ్ఞాని ఉనికికి చాలా తేడావుంది. మనం చావడం పుట్టడం కోసం. పుట్టడం చావడం కోసం. జ్ఞాని విషయమలా కాదు. జ్ఞాని పుట్టుక మళ్ళీపుట్టకుండా ఉండటానికి. చావు పుట్టుకల చక్రభ్రమణంలో జ్ఞాని చిక్కడు. గనుక అతనికి యమునితో వివాదముండదు.

పునరపి జననం పునరపి మరణం
పునరపి జననీ జఠరే శయనమ్
ఇహ సంసారే బహుదుస్తారే
కృపయాఽపారే పాహి మురారే 21

పునరపి = మళ్ళీకూడా, జననం = జననము, పునరపి = మఱల, మరణం = మృత్యువు, పునరపి = మఱల, జవనీ = తల్లియొక్క, జఠరే = గర్భమునందు, శయనమ్ = పడుటయు, ఇహ = ఈ, సంసారే = సంసారమందు, బహు = చాలా, దుస్తారే = దాటటానికిదుస్తరమైన, అపారే = అపారమైన సంసారమునుండి, కృపయా = దయతో, మురారే = మురారి, పాహి = రక్షింపుము.

భావము:- మళ్ళీపుట్టుట, మళ్ళీ చచ్చుట, మళ్ళీ మళ్ళీ తల్లి గర్భంలో పడుట, ఈ విధమైన చావుపుట్టుకల సంసారమును దాటుటకు సాధ్యము గాకున్నది. అనంత



దయాస్వరూపుడవైన ఓ మురారీ! కృపతో నన్ను కాపాడి రక్షింపుము.

ఈ శ్లోకమును దృఢభక్తి రచించిరి.

## వ్యాఖ్య

పుట్టిన వ్యక్తి నశిస్తాడు. నశించిన వ్యక్తి జన్మిస్తాడు. జీవితరంగస్థలిపై జన్మ ప్రవేశద్వారము, మృత్యువు నిష్క్రమణద్వారము. ప్రవేశించడములోనే నిష్క్రమణ చోటుచేసుకొనియున్నది. పుట్టుకలోచావు, చావులో పుట్టుక అంతర్భూతములై యున్నవి.

జీర్ణమైన వస్త్రములను విడచి నూతన వస్త్రములను ధరించులాగున, ఉద్యోగి ఒక గ్రామమునుండి మరియొక గ్రామమునకు బదిలీయగులాగున జీవుడు ఒక శరీరమును వదలి మరియొక శరీరమును పొందుచున్నాడు. ఒకచోటునుండి మరియొక ప్రదేశమునకు బదిలీ కావడము వలన ఉద్యోగ విరమణ జరిగినట్లు కాదు. జీవి ఒక దేహమునుండి మరియొక దేహమును పొందుటవలన జీవితము అంతముకాలేదు. జీవితమొక అనంతమైన అనుభవయాత్ర. మృత్యువొక దీర్ఘ నిద్ర.

గత జన్మలో మనం చేసిన కర్మలయొక్క ఫలితమే ప్రస్తుత జీవితము. గత జన్మలో ఆచరించిన పాపపుణ్యాల జాబితాననుసరించి ఈ జన్మలో సుఖదుఃఖాలు కలుగుతున్నాయి. ఈ జన్మలో ఆచరించే కర్మలు రాబోవు జన్మలను నిర్ణయిస్తాయి. కర్మాచరణ వల్లనే మానవుడు జీవిత సుడిగుండాన్ని తయారుచేసుకొని అందులో దుఃఖపీడితుడై పరిభ్రమిస్తున్నాడు.

"యాదృశం క్రియతే కర్మ తాదృశం భుజ్యతేఫలం
యాదృశం వాప్యతేబీజం తాదృశం ప్రాప్యతేఫలం"

మనం ఏ బీజాన్ని నాటుతామో తత్సంబంధిత ఫలమే ఆ చెట్టులో కనుపించులాగున మనం ఆచరించిన కర్మానుసారం ఫలితాలు నిర్ణయింప బడు

కొన్నివేల ఆవులలో లేగదూడ తనతల్లిని గుర్తించి అనుసరించులాగున గతజన్మలలో ఆచరించిన కర్మ దాని నాచరించిన కర్తను వెంబడించి వుండునని మహాభారతంలో తెలియచేయబడింది.

ఫలితాల నాశించియే మానవుడు కర్మనాచరిస్తాడు. ఫలితాల ననుభవించడానికే క్రొత్త జన్మ వస్తుంది. ఆ జన్మలో మరికొన్ని కర్మలు ఆచరిస్తాడు. అవి మరొక జన్మను తయారుచేస్తాయి. ఈ విధంగా జననమరణచక్రము ఆపుటకు దుస్సాధ్యమైన సంసారమును వృద్ధిచేయుచున్నది.

గతజన్మలలో మనం చేసిన అహంకారపూరిత కర్మలవలన ఏర్పడిన ఫలితాలు మనోఫలకంపై వాసనలుగా స్థిరపడి ఉంటాయి. మనసులో స్థిరపడియున్న వాసనలు వ్యక్తీకరించబడి తృప్తి చెందుటకు అనుకూలమైన వాతావరణములో జీవి మనుగడ సాగించాలి గనుక తదనుగుణ్య ప్రదేశమునందు జన్మించడం జరుగుతుంది. జన్మించడం అందరికీ ఒకటే అయినా జీవించడంలో వ్యత్యాసములు కన్పిస్తాయి.

రంగస్థలంపై కనుపించి అభినయించు నటీనటులందరు నాటకం సమాప్తి అగువరకు కనుపించరు. కొందరుప్రారంభంలో ప్రవేశించి చివరివరకు నటిస్తారు. కొందరు ప్రవేశించిన కొన్ని నిమిషాలలోనే నిష్క్రమించి తరువాత కనుపించరు. మరికొందరు కొంతకాలము నటించి కనుమరుగవుతారు. కాలనిర్ణయాలు ఆయాపాత్ర పోషణనుబట్టి వుంటాయి. అలాగే జన్మకు వచ్చిన జీవులలో కొందరు తల్లి గర్భంలోనే మరణిస్తారు. మరికొందరు కొన్ని రోజులు జీవించి కన్నుమూస్తారు. కొందరు పూర్ణాయుష్కులై శతవత్సరాలు జీవిస్తారు. ఇలా ఎందుకు జరుగుచున్నది? ఈ జీవన కాలనిర్ణయాలు చేసిందెవరు; ఒకడు పుట్టుకలోనే అంధుడు. మరొకడు పుట్టిన కొంతకాలానికి చెవిటివాడు. ఒకడు మహామేధావి. మరొకడు నిరక్షరకుక్షి. ఒకడు నీతికినిలువుటద్దంలాంటివాడు. మరొకడు అవినీతికి మారుపేరు. ఒకడు అగర్భశ్రీమంతుడు, మరొకడు వీధులవెంట తిరిగే బిచ్చగాడు. ఈ తేడాలకు కారణమేమిటి?

పై అన్ని ప్రశ్నలకు పునర్జన్మ సిద్ధాంతమే సమాధాన మివ్వగలదు.



నిర్ణయించి నడిపిస్తున్నాయి. మన సంకల్పాలు, కర్మలు గతంలో ఏ మార్గాన పయనించాయో ఆ విధమైన మార్గంలోనే రూపం దిద్దుకుంటాయి. వాటిని మధ్యలో దారి మరల్చను ఎవ్వరికీ శక్యముకాదు.

"వ్యాఘ్రబుద్ధ్యా వినిర్ముక్తోబాణః పశ్చాతు గోమతౌ
నతిష్ఠతి ఛినత్యేవ లక్ష్యం వేగేన నిర్భరమ్

పులి అని భావించి బాణము వదలిన తరువాత అది పులికాదని ఆవు అని గ్రహించినను బాణము వెనుకకు మరలలేదిలేదు. ఎక్కుపెట్టిన విధంగానే అది లక్ష్యం వైపుకు వెళ్తుందని శంకరాచార్యులవారు వివేక చూడామణిలో తెలియ చేస్తారు.

ఇలా సంచిత కర్మానుసారము ప్రాప్తించిన శరీరము తదనుగుణ వాతావరణములో జీవించి, అలా జీవించుటలో నూతన వాసనలు ఏర్పరచుకొని తద్వారా మరొక జన్మకు కారణమగుచున్నది. వాసనారూప సంసారము తయారు చేయబడుచున్నది. మరణానంతరము మరొక శరీరము పొందడము జరుగుచున్నది. నవ మాసములు తల్లిగర్భములో మ్రగ్గి దుర్గంధ పూరిత మాలిన్యముతో జన్మించడము ప్రాప్తిస్తున్నది. జీవించినంతకాలము అయోమయ, అజ్ఞాన పరిధులలో పరిభ్రమించి మృత్యుముఖంలో ప్రవేశించడం అనివార్యముగుచున్నది. చావుపుట్టుకల దారుణ చక్రవలయము నుండి బయటపడుటకు ప్రయత్నించవలయునని. అందుకై కరుణా సముద్రుడైన మురారిని శరణుజొచ్చుటయే మార్గమని రచయిత ఈ శ్లోకము ద్వారా తెలియజేయుచున్నారు.

"ఓ మురారీ! నీవు కరుణామూర్తివి. ఆశ్రితజన రక్షకుడవు. నాపై కృపచూపి కాపాడుము. నేనొక అజ్ఞానిని. సత్యాసత్య వివేకం తెలియని అవివేకిని. నా మూర్ఖత్వంలో శ్రేయస్సుకు, ప్రేయస్సుకు తేడా తెలియని వ్యర్థమానవుడను. నా నిన్ను ఏది కోరాలో తెలియనివాణ్ణి.

నేను కోరే కోర్కెలు నాకు హానికరం కావచ్చు. బ్రతుకు బాటనే వక్రింపచేయవచ్చు.

"హే భగవాన్! కృపాసాగరా! నా అవసరాలు నాకన్నా నీకే బాగా తెలుసు. నీవు సర్వజ్ఞుడవు. నేను కోరడంలో కలిగేది అజ్ఞానం. నీవు తీర్చడంలో మిగిలేది ఆనందం. నా అవసరాలు నీవే తీర్చాలి. నేను కోరను. నీవు అనుగ్రహించేదే నాకు ప్రసాదము" అని శరణాగత భావంతో భగవాను నాశ్రయించి, జనన మరణ చక్రమునుండి బయటపడి బ్రతుకును ధన్యత చేసుకోవాలి.

రథ్యా చర్పట విరచిత కన్థః
పుణ్యాపుణ్య వివర్జిత పన్థః
యోగీ యోగ నియోజిత చిత్తో
రమతే బాలోన్మత్తవ దేవ 22

రథ్యా = దారిలో, చర్పట = చిరిగిన గుడ్డల, విరచిత = తయారుచేయబడిన, కన్థః = బొంత, పుణ్యాపుణ్య = పాప పుణ్యములు, వివర్జిత = లేని, పన్థః = దారిలో, యోగ = యోగమునందు, నియోజిత = నియమింపబడిన, చిత్తః = చిత్తము యోగీ = యోగి, బాలోన్మత్తవ దేవ = బాలునివలె, పిచ్చివానివలె, రమతే = రమిస్తుంటాడు.

భావము:- దారిలో దొరికే గుడ్డపేలికలతో తయారయిన బొంత మాత్రం ధరిస్తూ, పుణ్యాపుణ్యముల కతీతమైన మార్గము ననుసరిస్తూ, మనసునుపూర్ణయోగమునందు నియమించిన యోగి ఆ పిమ్మట (బ్రహ్మమునందు) రమించుచున్నవాడై పిల్లవానివలె పిచ్చివానివలె సంచరిస్తుంటాడు.

ఈ శ్లోకమును నిత్యానాథుడు రచించినట్లు తెలియుచున్నది.

ఆత్మనిష్ఠుడైన జ్ఞానియొక్క స్థితిని, ప్రవర్తనను గురించి ఈ శ్లోకములో



## వ్యాఖ్య

జ్ఞాని సత్యస్వరూపుడు. మిథ్యాజీవన విధానానికి స్వస్తి చెప్పిన వాడు. మనో మాలిన్యమును కడిగి శుద్ధిచేసినవాడు. ఆడంబరాలకు అతీతుడు. ప్రశంసలను వాంఛింపడు. విమర్శలను లెక్కచేయడు. సాధారణంగా కనుపిస్తాడు. సాధారణ వ్యక్తులకు అర్థంగాని రీతుల్లో జీవిస్తాడు. ఇతరులపై ఆధారపడడు. ఇతరులకు ఆదర్శంగా మిగులుతాడు. మంచి చేస్తాడు. కానీ మంచి చెడుల కందనివాడు. మనసును చూడనివ్వడు. మనసు ద్వారా తానుచూస్తాడు. సామరస్య జీవనమేగాని సమస్యా దృక్పథము తెలియనివాడు. తనశరీరమును కప్పుకొనుటకు బొంతను మాత్రమే ధరిస్తాడని ఈ శ్లోకంలో ఆచార్యులు తెలియచేయుచున్నారు. బొంత అనగా రహదారిలో ఇతరులు పడవేసిన వివిధరంగుల గుడ్డపేలికలతో తయారుచేసుకొనిన వస్త్రము. మానవుని మనుగడకు ఆహార మెలా అవసరమో అలాగే సభ్య ప్రపంచములో మసలుటకు వస్త్రము చాలా అవసరము. జ్ఞాని ధరించు వస్త్రము విచిత్రమైనది. తాను ధరించు వస్త్రమునకై ఇతరులపై ఆధారపడవలసిన అవసరం లేదు. త్రోవలో నడుస్తూ నిరుపయోగమని భావించి ఇతరులు పారవేసిన జీర్ణవస్త్రములను ఏరుకొని, వాటిని ఒక వస్త్రముగా కుట్టుకొని ధరిస్తాడు. దారిలో దొరికే గుడ్డలు ఒకేరంగులో లభించవు. వివిధరంగులలో దొరుకుతాయి. ఆలయంలో అనంతుడైన భగవానుని మెడలో రంగు రంగుల పూలతో తయారైన పుష్పహారము శోభిల్లునట్లు, విశాలమైన ఆకాశమున సప్త వర్ణములతో ఇంద్రధనుస్సు వెల్గొందునట్లు, ఆనంద స్వరూపుడైన జ్ఞాని శరీరముపై రంగు రంగుల గుడ్డ పేలికలతో తయారైన బొంత ప్రకాశిస్తూ వుంటుంది. గోనె సంచిని వాంఛించినా ధనమవసరము కానీ బొంతను పొందుటకు ధనమవసరములేదు. వ్యక్తుల సహాయముతో పనిలేదు. కావలసిందల్లా సంతృప్తిచెందే అంతఃకరణ. జ్ఞాని ఆ విషయంలో పరిపూర్ణుడై యున్నాడు. అందమైన వస్త్రాలు, ఆధిక్యతను తెలియచేయు ఆభరణాలు జ్ఞాని కనవసరము. పరుల [illegible] సమాజమందించే అభినందనలు తనకు

ఇలా బొంతను ధరించి సంచరించే జ్ఞాని పుణ్యాపుణ్యముల కతీతుడని ఆచార్యులు తెలియచేయుచున్నారు. పుణ్యా పుణ్యములు, మంచి చెడులు, జయాప జయాలు, సుఖదుఃఖాలు మనోకల్పితములు. అశాశ్వతములు. మనసిచ్చే అసత్యపు నిర్ణయాలే ద్వంద్వాలకు పరిపుష్టిని కల్గిస్తాయి. భేదదృష్టియే అసత్య అవగాహనకు ఆధారమై యున్నది. భేద దృష్టి అజ్ఞానము వలన జనించినది. తనలో భాసించే జ్ఞానజ్యోతి ద్వారా అజ్ఞాన తిమిరాలను అదృశ్యం చేసిన జ్ఞానికి భేద దృష్టి ఉండదు. భేదదృష్టి పొడసూపని మనసులో అసత్యపు ఆలోచనలు అంకురించవు.

జ్ఞాని మనసుకు అతీతుడు. తాను మనో పరిధిలో నివసించడు. మనసులో మంచి చెడులు కదుల్తుంటాయి. మనసులో కదిలే ద్వంద్వాలను తాను తెలుసుకుంటున్నాడు. తెలుసుకొనే తాను తెలియబడే వాటి కన్నా అన్యమైనవాడు. మనసులో నడిచే మంచి చెడులను కూడా తాను గ్రహించడము వలన తాను మనసుకు అతీతుడు. మనసుకు చేతనత్వమును కల్పించి నడిపించువాడు.

మనోస్థాయిలో మెలుగుతున్నంతవరకు సంకల్పాల కనుగుణంగా వ్యక్తి ప్రవర్తిస్తుంటాడు. సత్సంకల్పాలద్వారా సత్కర్మలు, దుస్సంకల్పాలద్వారా దుష్కర్మలు ఆచరించబడుతాయి. వితనమున కనుగుణముగ ఫలితాలు లభిస్తుంటాయి. సత్కర్మల వలన పుణ్యం ప్రాప్తిస్తే దుష్కర్మల వలన పాపం సిద్ధిస్తుంది. పాపకర్మలు అనంతమైన జనన మరణ చక్రానికి ఆహుతిచేస్తాయి. పుణ్య కర్మలు ఇంద్రాది పదవుల నధిష్ఠింపజేసి, పుణ్యం తరిగిపోగానే మళ్ళీ మానవ లోకంలో పడదోస్తాయి. ఈ పుణ్యా పుణ్యాల సుడిగుండంలో తగుల్కొనిన మానవుడు సంసార చక్రమునుండి విముక్తి పొందలేడు. జ్ఞాని ఆత్మ విదుడు. తను పాప పుణ్యాల వలలో చిక్కడు. మనసు కతీతుడై జీవించుటచేత అతడు జీవన్ముక్తుడు. నిర్వికల్ప చిత్తుడు. నిరంజన స్వరూపుడు.

మనసు కతీతుడై తన స్వస్వరూపంలో సంధానముచేయు యోగి సదా నిర్వికల్ప సమాధిలో నిమగ్నుడై యుంటాడు. అట్టివాడు సంఘములో



పిల్లలు నిష్కల్మష చిత్తులు. రాగద్వేషరహితులు. స్వార్థమెరుగనివారు. సంపాదన తెలియనివారు. జ్ఞానికూడా పిల్లలవలె నిర్మలంగా ఉంటాడు. తనకంటూ భద్రపరచుకోవడం తెలియదు. తనలో ప్రేమ ఉదయిస్తుందేగాని ద్వేషం కనుపించదు. పిల్లలవలె తాను సదా ఆనందంలో ఉంటాడు. నీటిమీద వ్రాతల్లాగ అతనిలో సంకల్పాలు కదుల్తాయి. దీర్ఘ ద్వేషాలు, కాఠిన్యాలు, పగలు, స్వార్థాల్లాంటివి తనకు తెలియవు.

జ్ఞాని పిచ్చివానివలె కూడా కనిపిస్తాడు. పిచ్చి ఒక విచిత్రమైన అనుభూతి. పిచ్చివాడు పదుగురు నివసించే సమాజంలోనే సంచరిస్తుంటాడు. అందరిలో ప్రత్యేకంగా కనుపిస్తాడు. అతని ప్రవర్తన ఆశ్చర్యంగా ఉంటుంది. అందరూ కలసి వానిని పిచ్చివాడని పిలుస్తారు. ఇతరులు చూచే దానిని తాను చూడడు. తాను చూస్తున్నదేమిటో ఇతరులకు అర్థంకాదు. అతడు పొందుతున్న అనుభూతి అనూహ్యమై భిన్నంగా ఉండుటవలన అతడు పిచ్చివాడని నిర్ధారణ చేస్తారు. బాగుంది. మరి ఆ పిచ్చివానికి అనుభూతి కలుగుతున్నదా? లేదా? ఏదో ఒక విధంగా అనుభూతిని వ్యక్తం చేస్తున్నాడు. కాబట్టి అతని అనుభవమేమిటి? ఇతరులకు అవగతం కావడంలేదు. ఇతరులకు అర్థంకానంత మాత్రాన తాను పొందిన అనుభూతి అసత్యమవుతుందా? అనుభవించినవానికి అనుభూతి వాస్తవమే. అతని అనుభవాన్ని స్వయంగా అనుభవించలేని వ్యక్తులు దానికి పిచ్చి అని నామకరణం చేయడం సమంజసమా? కనుక పిచ్చి అంటే ఏమిటి? పిచ్చిలేని పదుగురు వ్యక్తులు పిచ్చినిగూర్చి ముచ్చటించడమే పిచ్చి. పిచ్చిలేని వ్యక్తులు పిచ్చియొక్క నిజ స్వరూపమును అనుభూతి పొందకనే సాగించే అప్రస్తుత ప్రసంగమే పిచ్చి.

జ్ఞాని సమంగా ఇలాంటి పిచ్చివాడు. తాను నివసించే సమాజంలోని వ్యక్తులకు తనకు ఎలాంటి సామ్యము కనుపించదు. ఏమీలేక పోయినను సంతోషంగా వుండేవాడు జ్ఞాని. అన్నీ వున్నా ఏడుస్తూ తిరిగేవాడు అజ్ఞాని. జ్ఞాని అరుదుగా కనపడతాడు. అజ్ఞాని అన్నిచోట్లా ప్రత్యక్షం. అసంఖ్యాకులైన

నిర్ణయింపబడుతాడు.

పిచ్చివానివలె జ్ఞానికి ఒక స్థిర నివాసమంటూ వుండదు. తిరుగుతూ తిరుగని వాడిలా వుంటాడు. చూస్తూ చూడనివాడై కనుపిస్తాడు. మాట్లాడుతూ మూగవానిలా మెలుగుతాడు. వింటూ చెవిటివానిలా సంచరిస్తాడు. అనంతమైన సంసార దుఃఖాగ్నికి దూరమై ప్రశాంత మనుగడను సాగిస్తాడు.

కస్త్వం కోహం కుత ఆయాతః
కా మే జననీ కోమే తాతః
ఇతి పరిభావయ సర్వమసారం
విశ్వంత్యక్త్వా స్వప్న విచారం 23

త్వం = నీవు, కః = ఎవరు, అహం = నేను, కః = ఎవరు?, కుత = ఎక్కడనుంచి, ఆయాతః = వచ్చినాను, మే = నాయొక్క, జననీ = తల్లి, కా = ఎవరు? మే = నాయొక్క, తాతః = తండ్రి, కః = ఎవరు? ఇతి = అని, సర్వం విశ్వం = సమస్తప్రపంచము, అసారః = సారహీనమైనది, స్వప్న విచారమ్ = కలయనెడి ఆలోచనతో, పరిభావయ = విచారణ చేయవలెను.

భావముః– నీవెవరు? నేనెవడను? నేనెక్కడనుండి వచ్చాను? నా తల్లి ఎవరు? నా తండ్రి ఎవరు? సారహీనమై స్వప్నతుల్యమైన ఈ విశ్వాన్ని విచారణ ద్వారా విడిచి పెట్టుము.

యోగానందులవారు ఈ శ్లోకమును రచించిరి.

## వ్యాఖ్య

మనసొక ఇంద్రజాలము. చలికాలము వేడిని కోరుతుంది. వేసవికాలము



ఉద్యోగ నిర్వహణలో నిరుద్యోగమే హాయని భావిస్తుంది. ఒకప్పుడు సంతానం లేనందుకు బాధపడుతుంది. సంతానం కలుగగానే ఎందుకు కలిగారా అని దుఃఖిస్తుంది. విపరీత ధోరణులతో సతమతమవుతుంటుంది. తనలో తాను తృప్తి చెందని మనసు బాహ్యములో ఆనందమును పొందడమనేది సత్యదూరమైన విషయము. మనసుకు మరుపొక వరంలాంటిది. మరువతగిన విషయాలేగాక మరువకూడని విషయాలను కూడా మరచిపోవడం ఒక శాపం వంటిది.

అసత్యపుటాలోచనలు చేయు అలవాటు మనసుకు తగ్గించాలి. ఆత్మానాత్మ వస్తువివేకమే దానికి మార్గం. సత్యాసత్య విచక్షణే తరుణోపాయం.

మనము ప్రశాంతముగా కూర్చుండి విశ్రాంతి తీసుకొను సమయములో ఒక ఆలోచన మెరుపులా వస్తుంది. ఇప్పుడు ఏంచేస్తే బాగుంటుందని? సినిమాకివెళ్తే? లేదా క్లబ్ వైపు నడిస్తే? ఇలా ఆలోచనలు తీవ్రస్థాయికి రాగానే ఏదో ఒకటి నిర్ణయించుకొని దానిని మనం అనుసరిస్తాము. అలాంటప్పుడే మనస్సును జాగ్రత్తగా పరిశీలించి, పునర్విమర్శించి సరిదిద్దుకోవాలి. ఏదో ఒకవైపు నడకసాగించాలని మనసు కుతూహలపడుతున్నది. ఏ వైపూ వెళ్ళకుండా కూర్చుంటే ఎలా వుంటుంది? సరిపోతుంది. మనసు కుంటుపడిపోతుంది. నూతన దృక్పథం ఏర్పడుతుంది. ప్రతివిషయంలో ఆ విధంగా ఆలోచించి నిర్ణయాలు తీసుకోవడం సంపూర్ణ అవగాహనమవుతుంది. మనసిచ్చే నిర్ణయాలను వెంటనే అమలు పరచడమువలన యాంత్రిక జీవనము అలవడుతుంది. మనిషి యంత్రముకాదు, కాకూడదు. ప్రతి విషయాన్ని క్షుణ్ణంగా పరిశీలించి నిర్ణయించడములో సత్యానికి సన్నిహితుడవుతాడు. పరిశీలనా దృక్పథము నిర్ణయించుకొని తద్వారా సత్యమును అవలోకించు విచారణ మార్గమును ఆచార్యవర్యులు ఈ శ్లోకంలో తెలియజేయుచున్నారు.

మనకు అనుభవములను పంచియిచ్చే విశ్వము సారహీనమని, స్వప్నతుల్యమని ఆచార్యులు తెలియజేయుచున్నారు. అనిత్యమైన విశ్వముపై మమకారమును వీడి శాశ్వతమైన మన నిజతత్త్వమును గూర్చి విచారణ చేయమని సూచిస్తున్నారు.

సాధారణంగా మనం నిద్రించునపుడు కలలు వస్తుంటాయి. అనేక విధములైన అనుభూతులను మనం స్వప్నంలో రుచి చూచినట్లు అవగతమగుచున్నది. మన మనుభవించిన స్వప్నము సత్యమా? ఆ స్వప్నంలో మనం పొందిన అనుభూతులు నిత్యమా? స్వప్నము యదార్థము కాదు. జాగ్రదావస్థలో ఫలించని కోరికలు స్వప్నంలో రూపురేఖల్ని దిద్దుకుంటున్నాయి. మనోసృష్టియే స్వప్నము. కనుక కల యదార్థము కాదు. స్వప్నము యదార్థమయిన, కలలో నేను పొందియున్న వస్తువులు మేల్కొన్న తరువాత కూడా నాతోనే ఉండాలి. మన అనుభవం అందుకు భిన్నంగా వుంది. కలలోని వస్తుప్రపంచము జాగ్రదవస్థలో అదృశ్యమై హాస్యాస్పదంగా మిగిలిపోతున్నది. కనుక స్వప్నం అబద్ధం. అలాగని ఆ విషయం ఎప్పుడు తెలిసింది? స్వప్నానుభవాన్ని పొందుతున్నప్పుడు స్వప్నము అబద్ధమని తెలిసిందా? లేదు. మేలుకొన్న తరువాతనే కల అబద్ధమనే నిజం తెలిసింది. కల ఎప్పుడైతే అబద్ధమైనదో ఆ కలలో కనుపించిన వ్యక్తులు, వస్తువులు, అవి అందించిన అనుభవములు సర్వమూ అసత్యమని తేలిపోయింది.

స్వప్న ప్రపంచము ఏ విధంగా అసత్యమో అలాగే జాగ్రత్ప్రపంచము కూడా అసత్యమని ఆచార్యులు తెలియచేస్తున్నారు. స్వప్న దృష్టాంతము ద్వారా బాగా విచారణచేసి జాగ్రదవస్థ ఎరుకపడే ఈ విశ్వముకూడా స్వప్నమువలె నిస్సారమైనదని గ్రహించమంటున్నారు. జాగ్రదవస్థలో వస్తువులెలా కనుపిస్తున్నవో స్వప్నావస్థలో కూడా అలాగే వస్తువులు గోచరమైనవి. కనుక రెండు అవస్థలు క్షణిక మనుగడను కలిగియున్నవని ధృవపడుచున్నది. కనపడే దేదైనా నశించిపోతుంది. స్వప్నములో అగుపించినవి, జాగ్రదవస్థలో కనుపించినవి. రెండూ దృశ్యములై యున్నందున శాశ్వతములు కావు. అంతియే గాక స్వప్నావస్థలో వస్తువులపై మన కెలాంటి మోహమున్నదో, అలాంటి మోహ జనిత ప్రవర్తనే జాగ్రదావస్థలో కనుపిస్తున్నందున జాగ్రదవస్థ కూడా స్వప్నం లాంటిదే.

స్వప్నమునకు ఆది యున్నది. అంత్యమున్నది. కనుక ఇది ఒక కాలములో కనిపిస్తున్నది. ప్రారంభములో లేదు గనుక దీనికి ఆది యున్నట్లు తెలుస్తున్నది. మేలుకొన్న తరువాత అదృశ్య మవుతున్నందున దీనికి



అంత్యమున్నట్లు కూడా తెలియుచున్నది. ఆదియందు అంత్యమందు ఏదయితేలేదో అది మధ్యలో ఉన్ననూ లేనట్లే. త్రాడునందు సర్పము ఆదిలోలేదు. త్రాడును తెలుసుకున్న తరువాత కూడా ఉండదు. ఆద్యంతములందు లేనందున మధ్యలోకూడా సర్పము లేనిదేయగుచున్నది. అలాగే స్వప్నము ఆద్యంతములందు లేనందున స్వప్నమునకు ఆద్యంతములున్నందున అది అనిత్యము, అశాశ్వతము.

స్వప్నమునకు ఎలాగయితే ఆద్యంతములున్నవో జాగ్రత్ ప్రపంచమునకు కూడా ఆద్యంతము లున్నందున అదికూడా లేనిదే యగుచున్నది. కనుక నిస్సారమై, మోహమును జనింపచేయు ఈ జగత్తు కూడా స్వప్నతుల్యమని భావించి, దానిపై భ్రాంతిని వీడి జీవించమని తెలియచేయుచున్నారు. విశ్వముయొక్క అస్థిరత్వమును గుర్తించి, అది కల్పించు మోహమునుండి విడిపడుటకుగాను "నీవెవరు? నేనెవరు? నేనెక్కడినుండి వచ్చాను? నా తల్లి ఎవరు? నా తండ్రి ఎవరు?" అని విచారణ చేయుటయే చక్కని మార్గమని తెలియజేయు చున్నారు.

నేనెవరు? నేను అన్నిటిని తెలుసుకునే వాడిని. నా శరీరము ఎఱ్ఱగా యున్నదని, పొడవుగాయున్నదని నేను తెలుసుకుంటున్నాను. తెలుసుకుంటున్న నేను తెలియబడే వస్తువులకన్నా అన్యమైన వాడిని గనుక నేను శరీరంకాదు. నాకంటికున్న గ్రుడ్డితనాన్ని, చెవికున్న చెవిటితనాన్ని తెలుసుకుంటున్నందున నేను ఇంద్రియాలుకాను. ఆకలిని తెలుసుకుంటున్నందున నేను ప్రాణముగాను. మనసులో నడిచే సంకల్పాలు, బుద్ధిలో జరిగే నిర్ణయాలు కూడా నేను చూస్తున్నందున నేను మనోబుద్ధులను కాను. అజ్ఞానమున్నట్లు కూడా నాకు ఎరుక గనుక నేను అజ్ఞానముకూడా కాను. అయితే నేనెవరు? దానికన్నా వ్యతిరేకమైన వాడిని. అనగా జ్ఞానాన్ని. నేను జ్ఞానమైనపుడు నీవూ జ్ఞానమే. జ్ఞానమునకు అవధులు లేవు. అది సర్వాంతర్యామి. అలాంటప్పుడు నేనెక్కడినుండి వచ్చాను? నేను వచ్చేవాణ్ణి కాదు. పోయేవాణ్ణి కాదు. ఆకాశమువలె అంతటా ఉన్నాను. నేను కదలడము లేదు. అన్నీ నాలోనే కదులుతున్నవి. నేను పుట్టుక లేనివాణ్ణి. పుట్టుక లేనివానికి తల్లిదండ్రులెవరు? శరీరము పుట్టిందేగాని నేను పుట్టలేదు. పుట్టుక లేనివాడను గనుక మరణించే ప్రసక్తి అసలే లేదు. ఇలా విచారణ కొనసాగించినచో సత్యము ఎరుకపడుతుంది. అనిత్యమైన జగత్తు, తత్సంబంధిత భ్రాంతి దూరమవుతుంది.

త్వయి మయి చాన్యత్రైకో విష్ణుః
వ్యర్థం కుప్యసి మయ్య సహిష్ణుః
భవ సమచిత్తః సర్వత్ర త్వం
వాంఛస్య చిరా ద్యది విష్ణుత్వమ్ 24

త్వయి = నీలో, మయి = నాలో, అన్యత్ర = ఇతరులలో, చ = కూడా, ఏకః = ఒకేఒకడు, విష్ణుః = భగవానుడే, అసహిష్ణుః = ఓర్పులేకపోవుటచేత, వ్యర్థం = వృథాగా,మయి = నామీద, కుప్యసి = కోపపడుతున్నావు, త్వం = నీవు, అచిరాత్=త్వరలో, విష్ణుత్వం = భగవత్తత్వమును, వాఞ్ఛసియది = కోరుచున్నచో, సర్వత్రః = అన్నిచోట్ల, సమచిత్తః = సమదృష్టిని, భవ = కలిగియుండుము.

భావముః– నీలో, నాలో అంతటా ఉన్నది సర్వ వ్యాపకుడైన భగవంతుడే. విగ్రహం లేక అనవసరంగా నాపై కోపగించుకుంటున్నావు. నీవు వెంటనే విష్ణుత్వమును పొందగోరినచో, అన్ని పరిస్థితులలో కూడా సమాన దృష్టిని కలిగియుండుము.

ఈ శ్లోకము సురేంద్ర రచించిరి.

## వ్యాఖ్య

పూలతోటలో ప్రవేశించినపుడు అందమైన పూల బంతులను చూడగానే మన మనసు రంజిల్లుతుంది. పుష్పాలలోని మకరందమును జుర్రుకొని తుమ్మెద సంతృప్తి చెందుతుంది. దూరంగావుండి దర్శించడములో వున్న సొగసు వేరు. మకరందమును పానము చేయుటలో కలిగే ఆనందానుభూతి వేరు.



వేదాంతపరిజ్ఞానము కూడా అలాంటిదే. శాస్త్ర పుష్పవన వాటికలో మహావాక్య పుష్పముల అందమును వీక్షించడము, అవి అందించే తార్కిక సౌరభమును ఆఘ్రాణించడము వేరు. వాటిలోని మకరందమును జుర్రుకొని తృప్తిచెందడము వేరు. ఔషధనామం స్మరించినంత మాత్రాన రోగం కుదరదు. ఔషధసేవనమే రోగమును నిర్మూలించగలదు.

ఆధ్యాత్మిక రంగంలో ప్రయాణము చేయు సాధకులు రెండు విధములు. 1.స్థిరచిత్తులు, 2.అస్థిర చిత్తులు. మొదటి తెగకు చెందినవారు అనుభవించి తరిస్తారు. రెండవ తెగకు చెందినవారు అనుభవమును పొందలేక వీక్షించి నిలిచిపోతారు. సాధన చతుష్టయ సంపత్తి గల్గి, గురువు నాశ్రయించి, గురువు ద్వారా శ్రవణము చేసిన విషయమును మననము చేసి, నిధి ధ్యాసద్వారా విషయమును స్థిరపరచుకొని, అనుభూతిని పొందువారు స్థిర చిత్తులు. సత్యము, అహింస, బ్రహ్మచర్యాది సద్గుణముల నలవరచుకొని విశాల దృక్పథముతో జీవిస్తారు. అట్టివారిలో ఉద్రేకము, ఆవేశము కనుపించవు. అభిమానము, దంభము పొడసూపవు. కామము, క్రోధము లాంటివి అగుపించవు. అట్టి సాధకులు, స్థిరచిత్తులైన శిష్యులు తమ జీవితములను తరింపచేసుకొనుటయే గాక గురువుగార్కి సంతోషాన్ని కల్గిస్తారు. ప్రజలలో గురువు ప్రతిష్ఠను వృద్ధిచేస్తారు.

రెండవ తెగవారు అస్థిరచిత్తులు. వీరు క్షణిక వైరాగ్యవంతులు. విషయ వాసనలతో స్వార్థాభిమానాలతో కలత చెందిన మనసు కలవారు. వారిలో క్రమశిక్షణ కుందేటికొమ్ము. అలజడి అధికమేగాని అవగాహన శూన్యము. ఆవేశము కనిపిస్తుందేగాని వారిలో ఆచరణ అగుపించదు. శ్రవణం చేసిన తరువాత వారిలో జరిగేది మననం గాదు. మరపు. నిత్యము వేదాంత శ్రవణము చేస్తూనే యుంటారు. దృష్టిని సవరించుకోలేరు. ప్రవర్తన సరిచేసుకోలేరు. అనుభూతి అందలేదని విసుగు చెందుతారు. ఆ విసుగులో ఎవరినీ లెక్కచేయరు. గురువును కూడా ధిక్కరిస్తారు.

పైన తెలిపిన రెండవ తెగకు చెందిన అస్థిర చిత్తుడు, కోపిష్టి అయిన
[illegible] తెలియుచున్నది.

"కుపితం శిష్యం ప్రతికోపశాంతిం ఉపదిశతి" గురువు పదే పదే చెప్పిన విషయమునే చెప్పుచుండగా విసుగుజనించిన శిష్యుడు కోపించగా గురువు కోపిష్టి అయిన ఆ శిష్యుని చూచి "వ్యర్థంకుప్యసి మయ్యసహిష్ణుః"నిగ్రహంలేక అనవసరంగా నామీద కోపగించుకుంటున్నావు అని తెలియచేసినట్లు అవగత మగుచున్నది.

ఇతర శాస్త్రములవలె వేదాంత శాస్త్ర మునందు పునరుక్తి దోషము లేదు. వేదాంతము కేవలము శ్రవణయోగ్యముకాదు. ఆచరణయోగ్యము. అనుభవ ప్రధానము. శిష్యుడు సంపూర్ణముగ గ్రహించు నంతవరకు గురువు పదేపదే ఆ విషయమునే తెలియజేయు చుండవలెను. విషయ గ్రహణ చక్కగా జరిగినచో అనుభూతి కరతలామలకము. అనుభూతి ఏర్పడనిచో విషయ గ్రహణ చక్కగ జరుగలేదని భావము. అట్టి శిష్యునకు పదేపదే ఉపదేశించ వలసిన భాధ్యత గురువుమీద యున్నది. అది తెలిసిన సర్వజ్ఞుడైన గురువు పదేపదే బోధచేయుచుండ, ఆచరణ శూన్యుడైన శిష్యుడు గురువు ప్రబోధములో పునరుక్తి దోషము చోటు చేసుకొనియున్నదని భావించి విసుగుచెందుతాడు. కోపగించుకుంటాడు, అర్థంచేసుకోదగిన విషయములో ఆవేశమును ప్రకటించడం అనర్థదాయకం. అట్టి శిష్యునిచూచి "నిగ్రహం లేక అనవసరముగా నామీద కోప పడుతున్నావు" అని ఆచార్యులు తెలియజేయుచున్నారు.

శిష్యుని కోపములో రెండు విషయములను ఇచ్చట గురువు గ్రహించడము జరుగుచున్నది. 1.నిగ్రహం లేకపోవడం 2.అనవసరమైయుండటము.

ఆచరించలేని శిష్యుని అసమర్థత అతనిలో ఆగ్రహమును తెచ్చి పెట్టింది. తన అశక్తత గ్రహించలేక కోపగించడం అసందర్భము. అసందర్భముగ ప్రవర్తించే మనసుకు అవసరమేదో అనవసరమేదో తెలియదు. కనుకనే అకారణంగా ఆవేశపడటం జరిగినది. ఆత్మజ్ఞానమును బోధించు గురువుపై అనర్థదాయకమైన ఆక్రోశమును ప్రకటించడం అనవసరం.

కోపం రాగానే నిగ్రహించలేక పోవడం రెండవది. ఇది మనోబలహీనతకు ... వివేకహీనమైన మనసు అనవసర విషయములను ప్రస్తావించడమేగాక,

అట్టి నిరుపయోగ విషయ ప్రస్తావనయందు తనను తాను నిగ్రహించుకోలేని అశక్తతతో నిండియున్నది. మనసులో కలిగిన భావాలు ఇంద్రియాల ద్వారా వ్యక్తమవుతాయి. మనసులో స్ఫురించిన భావాలు కదలగానే వెంటనే అవి పంజరము తెరవగానే చిలుక బహిర్గతమగునట్లు, ఇంద్రియాలద్వారా వ్యక్తమవుతున్నాయే గాని వాటిని నిగ్రహించే శక్తి కూడా మనసుకు లేకపోయింది. దీనికి కారణమేమిటి? విషయ వాసనలతో మనసు సంకుచితం కావడమే. మనసులో వున్న సంకుచిత తత్వాన్ని నిర్మూలించి దానికి విశాల దృక్పథం కల్పించడమే సరియైన మార్గం. అందుచేతనే విష్ణుత్వమును పొందగోరు ముముక్షువు అన్ని పరిస్థితులలో కూడా సమదృష్టిని కలిగియుండవలయునని గురువు ఆదేశించుచున్నాడు.

సమదృష్టి అంటే అందరిలో యున్న ఒకే చైతన్యమును దర్శించడం. భేదదృష్టి పొడసూపకూడదు. మట్టిపాత్రలను అనేక నామములతో పిలిచినా వాటిలో నిండియున్నది మట్టేనని మనకు బాగా తెలుసు. అలాగే సకల చరాచర భూత ప్రపంచము నందున్న ఉపాదాన కారణము భగవంతుడే గనుక "ఈశావాస్య మిదంసర్వం" ఈ ప్రపంచమంతయు భగవంతునిచే కప్పబడి యున్నది. అంతటా భగవంతుడే నిండియున్నప్పుడు ఇక రెండవ వస్తువంటూ లేదు.

అందరిలోనే గాకుండా అన్ని పరిస్థితులలోకూడా సమదృష్టి కలిగి యుండమని ఆచార్యులు ప్రవచిస్తున్నారు. పరిస్థితులు మన స్వాధీనంలో లేవు. కానీ ప్రవర్తన మన ఆధీనమే. పరిస్థితులు ఎప్పుడూ ఒకే విధంగా వుండవు. మారుతున్న పరిస్థితులను నేను తెలుసుకుంటున్నాను. కనుక నేను చైతన్యాన్ని. పరిస్థితులు మారుతుంటాయి. కానీ నేను మారేవాడనుకాను. అలాంటప్పుడు మారుతున్న పరిస్థితులలో కూడా సమదర్శనం కలిగియుండాలి. అలా సమ దృష్టిని కలిగియుండవలెనని "త్వయి మయిచాన్యత్రైకో విష్ణుః" నీలో నాలో అంతటా వున్నది సర్వవ్యాపకుడైన భగవంతుడేనని గ్రహించవలయునని రచయిత తెలియజేస్తున్నారు. అంతటా, అందరిలో భగవంతుడే వున్నప్పుడు ఇక ఎవరు ఎవరిని కోపగించుకుంటారు. సత్యం తేటతెల్లమయింది. ఆవేశము అదృశ్యమై ఆనందం మిగిలింది.

శత్రౌ మిత్రే పుత్రే బన్ధౌ
మా కురు యత్నం విగ్రహ సన్ధౌ
సర్వస్మిన్నపి పశ్యా త్మానం
సర్వత్రోత్సృజ భేదాజ్ఞానమ్ 25

శత్రౌ = శత్రువునందు, మిత్రే = మిత్రునియందు, పుత్రే = కుమారుని యందు, బన్ధౌ = బంధువునియందు, విగ్రహ = విరోధము, సన్ధి = స్నేహము, యత్నం = ప్రయత్నములను, కురు = చేయుట, మా = వద్దు, సర్వస్మిన్నపి = ప్రతివస్తువుయందు, ఆత్మానం = సత్యపదార్థమును, పశ్యా = చూడవలెను, భేదాజ్ఞానం = భేదరూపమైన అజ్ఞానము, సర్వత్ర = అంతట, ఉత్సృజ = వదిలించుకో.

భావము :– శత్రువుగాని, మిత్రడుగాని, పుత్రుడుగాని, బంధువుగాని వారియందు శత్రుత్వంగాని, స్నేహం గాని చేసే యత్నమునకు స్వస్తి చెప్పుము. అంతటా ఆత్మనే దర్శిస్తూ అజ్ఞానం వలన పుట్టిన భేదబుద్ధిని వదలి పెట్టుము.

ఈ శ్లోకము మేధాతిథి రచించినట్లు తెలియు చున్నది.

## వ్యాఖ్య

వెలుగు లేనిచోట చీకటి అలుముకుంటుంది. సత్యము లోపించినచో అసత్యము తాండవిస్తుంది. ధర్మము నశించగానే అధర్మము వ్యాపిస్తుంది. జ్ఞానము లేనియెడల అజ్ఞానము దర్శనమిస్తుంది.

అజ్ఞానము మాయాజనితము. లేనిదానిని ఉన్నట్లు చూపేది మాయ.



జీవిస్తాడు. అందుచేతనే అజ్ఞానంవలన జనించే భేదబుద్ధిని విడిచి పెట్టమంటున్నారు ఆచార్యులు

జ్ఞానమును గూర్చిన ఎరుక లేకపోవడమే అజ్ఞానము. అజ్ఞానమును గూర్చిన జ్ఞానము లేకపోవడము జ్ఞానమునకు అవరోధము. మండుటెండలో ప్రయాణము చేయువాడు వేడికి తట్టుకోలేక వృక్షఛాయలోకి వెళ్తాడు. వేడిగాల్పులోవున్నా హోరుగాలిలో వున్నా పిచ్చివాడు చలించడు. తనలోని వెలితి ఏమిటో అర్థం చేసుకొని, తనకు కావలసిందేమిటో తెలుసుకున్నవాడు ఆ కావలసిన వస్తువుకై పరితపించగలడు. ప్రయత్నించగలడు. మతితప్పిన మానవునికి వ్యసనము వ్యవస్థలాగ కన్పిస్తుంది.

అజ్ఞానం వలన భేదదర్శనం జరుగుతుంది.భేదదర్శనమును వదలిపెట్ట మంటున్నారు ఆచార్యులు. సముద్రములో అలలున్నాయి. సాగరములోని తరంగాలు సాగరముకన్నా అన్యంకాదు. సముద్రములో అలలున్నాయేగాని అలలలో సముద్రం లేదు. అలలను చూస్తున్నంతవరకు ఒకటి చిన్న అల, ఒకటి పెద్ద అల అంటున్నాము. తరంగాల్ని చూసే దృష్టి భేదదృష్టి. సాగరమును చూచు దృష్టి అభేద దృష్టి.

ఉన్నది ఒకే చైతన్యము. చైతన్యము ఒకటేగాని రెండుగాదు. అంతా చైతన్యమే వ్యాపించియున్నప్పుడు అంతకన్నా అన్యమైన వస్తువు మరొకటి లేదు. కనుక కనుపిస్తున్నదంతా బ్రహ్మ స్వరూపమే. సర్వత్రా అచలమై భాసించుచున్న బ్రహ్మపదార్థమును దర్శించుటయే అభేదదృష్టి. అభేదదృష్టి లేకపోవుటకు అజ్ఞానమే కారణము. అజ్ఞానమే భేద దృష్టిని కల్పించి కలవరపరుస్తుంది. పంచదారతో అనేకబొమ్మలు తయారుచేస్తారు. బొమ్మలలో ఉన్నదంతా పంచదార తప్ప మరేమీకాదు. ఈ సత్యమును గ్రహించని పిల్లలు ఏనుగ బొమ్మే కావాలని, నెమలి బొమ్మేకావాలని మారాం చేస్తుంటారు. వారిని ఎంత వారించినా వినరు. ఎంతగా నచ్చచెప్పాలని ప్రయత్నించినా పట్టించుకోరు. తాము కోరిన బొమ్మలలోనే తీపి ఉన్నట్లు భావిస్తారు. అన్యంగా కనుపించే వాటిలో ఉన్నదికూడ పంచదారేనని గ్రహించరు. తానుకోరే బొమ్మను ప్రేమించడమేగాక,

తనకు నచ్చని చక్కెర బొమ్మను పారవేయడానికి, పగులగొట్టడానికి కూడా వెనుకాడరు. సత్యం తెలియక పోవడమే ఈ అస్తవ్యస్త ధోరణులకు కారణము.

చక్కెర బొమ్మలన్నిటిలో పంచదారను చూడటమే అభేదజ్ఞానము. వాటిని అన్యముగా భావించడమే భేద జ్ఞానము. బొమ్మలను వేరుగా భావించే భేదదృష్టి తొలగగనే పంచదారయనెడి అభేదదృష్టి కలుగుతుంది. అలాగే నామ రూపాత్మకమైనటువంటి ఈ దృశ్యమాన ప్రపంచము ఆత్మకన్నాఅన్యం కాదు. ఉన్నది ఆత్మ ఒక్కటే. ఆత్మ సర్వాంతర్యామి. అంతటా నిండియున్నది. ప్రపంచాన్నంతా తనలోనే ఇముడ్చుకునుంది. తాను అన్నిటిని దర్శించగలదు. సర్వాన్ని తాకగలదు. సమస్తమూ వినగలదు. తనకు పైన క్రింద అంటూ లేదు. ముందు వెనుకలుండవు. కుడి ఎడమ తెలియదు. మడి తడి అంటదు.

ఉన్నదంతా ఆత్మయే అయినపుడు ఆత్మకన్నా అన్యంగా ఏది దర్శించినా అది భేదదృష్టియే అవుతుంది. ఈ ప్రపంచములో వ్యక్తులు వస్తువులు వేరువేరుగా కనుపించడానికి అసత్య దర్శనమే కారణము. సత్య దర్శనమే సమ దర్శనము. చూచేవాడు, చూడబడే ప్రపంచము అంతా బ్రహ్మమయంగా దర్శనం కావాలి. సమదృష్టిలో వ్యత్యాసాలు తొలగిపోతాయి. తారతమ్యాలు అంతరించి పోతాయి. ప్రత్యేకమైన ప్రేమ కనుపించదు. అనర్థమైన ద్వేషము పొడసూపకూడదు. అంతటా ఆత్మదర్శనం జరగడమే ఈ మార్పుకు కారణము. కనుకనే సర్వత్రా ఆత్మను దర్శిస్తూ భేదజ్ఞానాన్ని వదలి పెట్టమని, శత్రు మిత్ర పుత్ర బంధువులయందు అనురాగముగాని, ద్వేషాన్నిగాని లేకుండా జీవించమని ఆచార్యులు తెలియజేయుచున్నారు.

యదార్థానికి శత్రువుగాని, మిత్రుడుగాని మనకు లేడు. ఉన్నది ఒకే చైతన్యమని గ్రహించినపుడు ఇక శత్రువెవరు? మిత్రుడెవరు? అవగాహన కుదిరితే ఆత్మయే మిత్రుడు. అపార్థం జరిగితే ఆత్మయే శత్రువు. శత్రు మిత్రాదులను తయారుచేసేది మనసు. మనసులో విశేషంగా రాగద్వేషాలుంటాయి. తనకు అనుకూలంగా శృతికలిపినవాడు మిత్రుడని తనకు ప్రతికూలంగా ఢంకా మ్రోగించినవాడు శత్రువని నిర్ణయము చేస్తుంది. మిత్రుడు తడిసిపోయేటంత



ప్రేమ వర్షము కురిపిస్తుంది. శత్రువు మండిపోయేటంత ద్వేషాన్ని క్రుమ్మరిస్తుంది. ఈనాటి శత్రువుని రేపు మిత్రుడుగా స్వీకరిస్తుంది. ఈనాటి మిత్రుని రేపు శత్రువుగా పరిత్యజిస్తుంది. "The mind in its own place and in itself can make a heaven of hell or a hell of heaven" "స్వర్గమున నరకమును, నరకమున స్వర్గమును తానున్న చోటనే మనసు తయారుచేసుకుంటుందని" మిల్టన్ అభిప్రాయపడ్డారు. మనసే చపలము గనుక అది ఇచ్చే నిర్ణయాలు స్థిరంగా వుండవు. అస్థిరము, చంచలము అయిన మనసును నమ్ముకొని లేని మిత్రత్వాలు శత్రుత్వాలు తయారుచేసుకొని, మిత్రుని ప్రేమించుటయందు, శత్రువును ద్వేషించుట యందు శక్తినంతా వృథాచేసుకోవద్దని ఆచార్యులు హెచ్చరిస్తున్నారు.

ఇతరుల విషయంలోనే మనము స్నేహాన్నిగాని, ద్వేషాన్నిగాని సృష్టించు కుంటాము. మనవారనబడే సంతానము నందుగాని, బంధువులయందుగాని సహజంగానే అనురాగము కలిగియుంటాము. తోటివారినే గాక తన వారిని కూడా అభిమానించ లేని వారుంటారు. అట్టి వృశ్చిక సర్ప జన్మలు భూమికి భారమై, గాలికి అడ్డమై నిరర్థకంగా జీవిస్తారు. వారి అజ్ఞానాన్ని వర్ణించుటకు ఆదిశేషునికికూడా అసాధ్యమేనేమో? ప్రేమజలం లోపించి బీడువారిన ఆ మనోక్షేత్రాలలో వివేకబీజాలు మొలకెత్తవు. ఆత్మానంద ఫలాలు లభించవు.

తోటివారి విషయములోనే గాక తనవారైన పుత్ర బంధువుల విషయంలోకూడా మిత్రత్వం శత్రుత్వం రెండూ మంచిది కాదంటున్నారు ఆచార్యులు. అలా ప్రవచించడములో పైన కనుపరచిన నిరర్థక జీవులవలె ప్రేమరహిత జీవితాన్ని కొనసాగించమని ఉద్దేశ్యం కాదు. నామరూపాలను, ఉపాధులను దర్శిస్తూ, వాటిపై విశేషానురాగాన్ని, అపరిమిత ద్వేషాన్ని ప్రకటించకుండా అందరిలో భాసించే ఆత్మనే ప్రేమించి, అభేదదృష్టిని కలిగియుండమని భావము.

వ్యక్తులను, వస్తువులను ప్రేమించినా ద్వేషించినా అది ఆత్మకు దూరం కావడమే అవుతుంది. ప్రపంచమును ప్రేమించడము వలన కలిగే అనురాగము

ప్రపంచముపై అధిక వ్యామోహమును పెంచి ఆత్మకు దూరంచేస్తుంది. అలాగే ప్రపంచాన్ని ద్వేషించడము వలన హృదయంలో కాఠిన్యము ఆవిర్భవించి ఆత్మను చేరేందుకు అడ్డుగోడలా నిలుస్తుంది. కనుక ప్రపంచముపై, వ్యక్తులపై, వస్తువులపై, రాగద్వేషాలను వదలి, అందరిలో ప్రకాశించే చైతన్యమునే ప్రేమించడము వలన అభేదజ్ఞానము, సమస్తాన్ని ఆత్మలో దర్శించే మంగళకర దృష్టి ఏర్పడుతుంది.

కామం క్రోధం లోభం మోహం
త్యక్త్వాఽత్మానం పశ్యతి సోహం
ఆత్మ జ్ఞాన విహీనా మూఢా
స్తే పచ్యన్తే నరక నిగూఢాః 26

కామం = కోరికను, క్రోధం = క్రోధమును, లోభం = లోభమును, మోహం = మోహమును, త్యక్త్వా = విడిచి, ఆత్మానం = పరమాత్మను, సోఽహమ్ = నేనే అతడనెడి, పశ్యతి = గాంచుచున్నాడు, ఆత్మజ్ఞాన విహీన = ఆత్మజ్ఞానములేని, మూఢాః = మూర్ఖులైన, తే = వారు, నరకనిగూఢాః = నరకంలో బంధింపబడి, పచ్యన్తే = హింసింపబడుతారు,

భావము :- కామ క్రోధ లోభ మోహాదులను విడిచి పెట్టిన సాధకుడు "అతడే నేను" అని ఆత్మదర్శనం చేస్తాడు. ఆత్మజ్ఞానము లేనివారు మూఢులై నరకంలో బంధింపబడి హింసింపబడుతారు.

ఈ శ్లోకము భారతీవంశ విరచితమని తెలియుచున్నది.

## వ్యాఖ్య

మనసొక మహత్తరమైన యంత్రము. శక్తిసమన్వితమైన కూడలి. మానసిక



అక్రమ పద్ధతులలో నడిపిస్తే వినాశకరమైన దుష్ఫలితాలొస్తాయి. అస్థిరమై, అశాశ్వతమైన ప్రాపంచిక విషయ వాసనలను వెంబడించిన మనసు నరక హేతువవుతుంది.

నిత్యమై, సనాతనమైన భగవంతుని సాన్నిధ్యమును పొందుటకు ప్రయత్నించిన యెడల మోక్షదాయకమవుతుంది. అందుచేతనే బంధ మోక్షములకు మనసే కారణమని ఉపనిషత్ ప్రవచించింది.

మనసులో జనించే కామ, క్రోధ, లోభ, మోహాదులను విడిచి పెట్టిన సాధకుడు స్వస్వరూప దర్శనం చేసి తరిస్తాడని రచయిత ఈ శ్లోకంలో తెలియజేయుచున్నారు.

కామ క్రోధ లోభ మోహాదులనే ఈ దుర్గుణ చతుష్టయము మానవునిలో ఆధ్యాత్మిక జ్యోతిని ఆర్పివేసి, నిరర్థక జీవితాన్ని కొనసాగించునట్లు చేసి, చివరకు అన్యాయమైన మృత్యువుకు గురిచేసి, శ్మశాన వాటికకు తరలించేందుకు శవవాహకులై యున్నవి.

అజ్ఞానం వలన కోరిక జనిస్తుంది. తానెవరో తనకు తెలియకపోవుటయే అజ్ఞానము. అజ్ఞాన ప్రేరిత మానవుడు తాను సుఖ స్వరూపుడయ్యును, అది గ్రహించలేక ఆనందం కొరకు వస్తు ప్రపంచములో అన్వేషిస్తుంటాడు. అర్రులు చాస్తుంటాడు. కోరికలను ఫలింపచేసుకొనుటకు నిరంతరము కృషి చేస్తుంటాడు. ఫలించని కోరికలు మనసులో నిరాశా జ్వాలను రగుల్కొల్పుతాయి. ఫలించిన కోరికలు నూతన కోరికలకు అంకురమవుతాయి. కోరికలను తృప్తి పరచడంలో గాక వాటిని లేకుండా చేసుకోవడములో మానవునికి సంతృప్తి లభిస్తుంది. మాయలేడిని గూర్చిన కోరిక సీతలో ఉదయించడమువలన ఆమె బ్రతుకే ఒక సమస్యగా మారిపోయింది.

ఒకే వస్తువు అన్ని కాలాలలో, అన్ని దశలలో తృప్తిని కలిగించలేదు. మనోభిప్రాయాల ననుసరించి వస్తువుల ప్రాబల్యం పెరుగుతూ తగ్గుతూ ఉంటుంది. కనుక వస్తువులపై, వ్యక్తులపై మనకున్న అనురాగము మనోకల్పితమే

గాని వస్తు ప్రాబల్యము కాదు. సంతృప్తిగాని, అసంతృప్తిగాని మనసులో అవగాహనపై ఆధారపడి యున్నవేగాని, వస్తు సాన్నిధ్యంలో ఏమీలేదు. పైగా మనం వస్తువులపై ఏర్పరచుకొనే సంబంధాలు, వ్యక్తులపై కల్పించుకొనే అనుబంధాలు శాశ్వతంగా నిలిచేవికావు. కాలంలో జనించి కాలంలో నశించే వస్తుసంతతిలో, క్షీణించే వ్యక్తుల సమూహంలో మనకు శాశ్వత ఆనందం లభించదు. కనుక నిత్యమై, సత్యమై, బుద్ధమై వెలుగు ఆత్మయందు మనసును లగ్నంచేసి, ఆత్మానుభూతిని పొంది తరించాలి.

కోరికలు ఎప్పుడైతే ఫలించవో దానికి కారణమైన వ్యక్తులపై క్రోధం జనిస్తుంది. "కామాత్ క్రోధోభిజాయతే" కామము నుండి క్రోధము పుడుతుంది. "క్రోధః ప్రాణహరః" క్రోధము మృత్యువును ప్రాప్తింపజేస్తుందని రామాయణ ప్రబోధము. దుర్యోధనునిలో జనించిన క్రోధము కురుక్షేత్రాన్ని తయారు చేసింది. మారణహోమాన్ని సృష్టించింది. మహారాజుల్ని సైతం మంట కలిపింది.

క్రోధాన్నెప్పుడూ విచారణలోనే జయించాలి. క్రోధాత్ములు మూడు విధాలుగా తెలుస్తారు. క్రోధము వస్తున్నదని గ్రహించేవారు మొదటి తెగకు చెందినవారు. క్రోధము కలిగిన సమయములో గుర్తించేవారు రెండవ తెగకు చెందినవారు. క్రోధము వచ్చి వెళ్ళిన తరువాత నిర్ణయించేవారు మూడవ తెగకు చెందినవారు. మొదటివారు క్రోధం రాబోయేముందుగ్రహిస్తారు. కనుక విచారణ ద్వారా, క్రోధము వలన కలిగే పర్యవసానములను గూర్చి చింతించుట ద్వారా పోగొట్టుకొనగలరు. వీరు ఉత్తములు.

రెండవ తెగవారు క్రోధము కలిగిన సమయములో గుర్తించే వారు.మొదటివారిలాగ క్రోధముయొక్క ఆగమనాన్ని గ్రహించి సరిచేసుకొనే అవకాశం వీరికి లేకపోయినా, క్రోధము కలిగిన సమయములోనైనా ఆలోచించుకొని సవరణ చేసుకొనే అవకాశం ఉంది. "నాలో ఈ క్రోధమెందుకు కలగాలి? ఎవరిమీద నాకీ క్రోధం? నా క్రోధానికి గురయ్యే వ్యక్తిలో ఉన్నది కూడా చైతన్యమే కదా? చైతన్యమును బాధించడం ధర్మమా? అసలు క్రోధానికి నేనెందుకు గురికావాలి? నా మనసెందుకు గురికావాలి? నా మనసు నెందుకు కల్లోలం చేసుకోవాలి? ఈ క్రోధ ప్రకటన తరువాత ఏర్పడే పరిణామాలేమిటి?" ఇలా తన ఆలోచనా సరళిని మార్చుకొని క్రోధమును నిర్మూలించవచ్చు. వీరు మధ్యములు.

మూడవ తెగవారు క్రోధము కల్గి, దానిని యథావిధిగా ప్రదర్శించి దానివలన ఏర్పడవలసిన అరిష్టములన్నీ సంప్రాప్తమైన తరువాత నిర్ణయించి తెలుసుకునేవారు. వీరు తమస్వభావాన్ని సరిచేసుకొనే ప్రసక్తే లేదు. క్రోధమును నశింపచేసే ప్రశ్నేలేదు. అవసరం కలుగగానే కోపోద్రిక్తులై, ఆ తరువాత పశ్చాత్తాపము చెందే ఆలోచనారహితులకు తమను తాము సరిచేసుకొనే అవకాశము కనుపించదు. వీరు అధములు. బ్రతుకుబాటను వక్రింప చేసుకునే విధివంచితులు. నిర్భాగ్యులు.

క్రోధం రాబోయేముందు గుర్తించి సరిచేసుకోవాలి. లేదా వచ్చిన వెంటనే పునర్విమర్శ చేసుకొని శాంతి పొందాలి. "యదార్థముగా క్రోధము నా స్వభావమేనా?" అని విచారించాలి. క్రోధమే నా స్వభావమైతే తలచినప్పుడల్లా క్రోధం కలగాలి. అలా జరగడం లేదు. నేను కోరినప్పుడు క్రోధం రాదు. క్రోధం వచ్చినప్పుడు నేను నటిస్తున్నాను. తెలుసు కుంటున్నాను. పరిస్థితుల ప్రభావాలపై, స్థితిగతులపై మానసిక ప్రతి చర్యలపై క్రోధం ఆధారపడి వ్యక్తీకరించబడుతున్నది. నేను క్రోధము కాదు. నాలో క్రోధము కలుగుచున్నది. నాలో కదిలే క్రోధాన్ని నేను చూస్తున్నాను. క్రోధాన్ని నేను తెలుసుకుంటున్నాను గనుక నేను క్రోధముకన్నా అన్యమైనవాణ్ణి. క్రోధము నన్ను పిచ్చివాణ్ణి చేస్తున్నది. నేను క్రోధానికి బానిసను కాకూడదు. నేను శాంతి స్వరూపుడను. నిష్కళంక ప్రేమ స్వరూపుడను. ఇలా విచారణచేసి క్రోధాన్ని మనసునుండి తరిమివేయాలి.

తరువాత గుణము లోభము. "త్యాగాసహిష్ణుతాలోభః" తాను కలిగియున్న వస్తువులను విడచి జీవించలేని అశక్తతే లోభము. కామ క్రోధాల ద్వారా ఆర్జించిన ఆస్తిని వదులుకోవడానికి లోభి ఇచ్ఛగించడు. లోభిలో ఆత్మోద్ధరణ అగుపించదు. పరోపకారం కనిపించదు. జీవచ్ఛవంలాగా జీవితాన్ని అయోమయంగా సాగిస్తాడు. లోభి అంటే తాను పొందియున్న వస్తువులను వదలడానికి ఇచ్ఛగింపని

వాడేకాదు. తనలో నిండియున్న దుర్గుణాలను విడచిపెట్టడానికి ఇష్టపడని వాడు కూడా లోభియే.

ఈ కామ క్రోధ లోభాలను మనసునుండి తొలగించి, అంతః కరణను క్షాళనం చేయాలి. ఇవే ఆత్మదర్శనానికి ప్రతిబంధకాలై యున్నవి. ఈ విషయాన్నే శంకరాచార్యులవారు మరొక శ్లోకంలో తెలియచేస్తారు.

కామః క్రోధశ్చ లోభశ్చ
దేహే తిష్ఠంతి తస్కరాః
జ్ఞాన రత్నాప హారాయ
తస్మాజ్జాగ్రత జాగ్రత

మనలో ఉండే జ్ఞాన రత్నమును అపహరించడానికి కామక్రోధ లోభాదులనే చోరులు మనదేహంలో ప్రవేశించి యున్నారు. కావున మానవుడా! జాగ్రత్తగా యుండుము. అతి జాగ్రత్త కల్గి యుండుము.

ఈ కామక్రోధ లోభాదులు మోహము వలన ఏర్పడ్డాయి. మోహమనగా భ్రాంతి. సత్యాన్ని అసత్యంగా, అసత్యాన్ని సత్యంగా భావించే అయోమయ పరిస్థితి. మోహ ప్రేరితుడగు వానికి సత్యము అవగతము కాదు. ముత్యపు చిప్పలో వెండిని దర్శించడము మోహము. ఎండమావిలో దప్పిక తీర్చుకొనుటకు చేయు యత్నమే మోహము. ఎండమావి అని తెలిసినంతవరకు అచ్చట గోచరమయ్యే జలాశయం అదృశ్యం కాదు. ఎండమావిని చూడగానే ఎండమావి అనే భావన కలుగలేదు. సత్యదర్శనంతో అసత్యం అదృశ్యమవుతుంది. అసత్యమును అవలోకించినంత వరకు సత్యము అనుభవమునకు అందదు. సత్యము అనూహ్యము కాగానే అసత్యం విలయతాండవం చేస్తుంది. అదియే మోహము. మోహము వలన కామక్రోధ లోభాలు జనిస్తాయి.

కనుక "సోహం" భావన కలిగియుండాలి. "నేను భగవంతుడు" అనే సత్యము అవగాహనకు రావాలి. అప్పుడు జీవభ్రాంతి తొలగుతుంది. కామక్రోధలోభ [illegible] కలుగుతుంది.



ఆత్మజ్ఞానము లేనివారు మూఢులు, మలిన చిత్తులు. అట్టివారు జనన మరణ చక్రవలయంలో తగుల్కొని పరిభ్రమిస్తుంటారు. జన్మలో కలిగే అనంత దుఃఖాగ్నికి వారసులై, నరక యాతన అనుభవిస్తారు. కనుక ముక్తినికోరు ముముక్షువులు కామక్రోధ లోభమోహాదులను మనసునుండి దూరం చేసి ఆత్మను దర్శించాలి.

గేయం గీతా నామ సహస్రం
ధ్యేయం శ్రీపతి రూప మజస్రం
నేయం సజ్జన సంగే చిత్తం
దేయం దీన జనాయచ విత్తం 27

గీత = భగవద్గీత, నామ సహస్రం = విష్ణు సహస్రనామము, గేయం = గానము, శ్రీపతి రూపమ్ = విష్ణు స్వరూపము, అజస్రమ్ = ఎల్లప్పుడూ, ధ్యేయం = ధ్యానించదగినది, చిత్తం = చిత్తము, సజ్జనసఙ్గే = సజ్జన సాంగత్యమునందు, నేయం = నడుపదగినది, దీనజనాయచ = దీనజనులకు, విత్తం = ధనము, దేయం = ఇవ్వదగినది.

భావము :- భగవద్గీత, సహస్రనామములు గానం చేయాలి. నిరంతరము లక్ష్మీపతియొక్క రూపాన్ని ధ్యానం చేయాలి. మనసును సత్సాంగత్యము నందు నడిపించాలి. దీనులకు ద్రవ్యసహాయం చేయాలి.

ఈ శ్లోకము సుమతి రచించినట్లు తెలియుచున్నది.

## వ్యాఖ్య

ఆత్మ సాక్షాత్కారముగోరు సాధకుడు ఆచరించవలసిన సాధన ప్రక్రియనంతను నాలుగు భాగాలుగా విభజించి ఈ శ్లోకంలో రచయిత [illegible]

1. భగవద్గీత, సహస్రనామములను గానం చేయుట.

2. నిరంతరము లక్ష్మీనాథుని రూపమును ధ్యానించుట.

3. సజ్జనసాంగత్యము కల్గియుండుట.

4. దీనజనులకు సహాయము చేయుట.

భగవంతుడు స్వయముగా గానము చేసినది భగవద్గీత. కురుక్షేత్ర సంగ్రామములో కర్తవ్య విముఖుడైన అర్జునునకు ప్రేమతో శ్రీకృష్ణుడు బోధించిన తత్త్వజ్ఞానమే భగవద్గీత. అర్జునుడు, కృష్ణుడు. నరనారాయణ అవతారము. నరుడనగా పరిచ్ఛిన్నుడైన మానవుడు. నారాయణుడనగా అ పరిచ్ఛిన్నుడైన భగవానుడు. అర్జునుడు మానవుని సమస్యలకు పరిష్కారాన్ని కోరుతూ సకల మానవాళి తరపున ప్రతినిధియై నిలిచాడు. అతని ప్రశ్నలే మన ప్రశ్నలు. అతనిలో జనించిన ఆవేదన దుఃఖార్తులైన మానవులయొక్క ఆవేదనకాగా అతనికి శ్రీకృష్ణుడందించు సమాధానము మానవాళిని తరింపచేయుటకు పరమాత్మ అనుగ్రహించు దివ్య సందేశమై యున్నది.

గీత ఉపనిషత్తుల సారమని మనకు తెలుసు. ఉపనిషత్ ప్రబోధానికి, గీతాప్రబోధానికి విషయంలో తేడా లేకపోయినా సందేశ సందర్భమునందు కొంత తారతమ్యము కనిపిస్తుంది. విరక్తితో, శ్రద్ధాసక్తులు కలిగి, గురువు నన్వేషిస్తూ, అరణ్యముల కేగిన వ్యక్తికి ప్రశాంత వనవాటికలో ఆశ్రమ వాతావరణంలో బోధించిన శుద్ధతాత్త్విక సందేశాలు, ఉపనిషత్తులు. సంఘంలో మనుగడను కొనసాగిస్తూ, భయశోక మోహాదుల మధ్య చెదిరిపోయిన అంతఃకరణగల సాధారణవ్యక్తికి, వ్యక్తిగత, సాంఘిక సమస్యా పరిష్కార నిమిత్తం ప్రబోధించబడి, వ్యక్తిగత, సామాజిక స్థితిని సమిష్టి ఆధ్యాత్మిక స్థాయిలో లయింపచేసిన పవిత్ర గ్రంథము శ్రీమద్భగవద్గీత.

మానవుడు పరిసరాలకు, పరిస్థితులకు బానిస కారాదు. తాను యదార్థాని కిఆత్మ స్వరూపమై ఉన్నాడు. అతడు రాజులకు రాజు. చక్రవర్తులకు చక్రవర్తి



ప్రసాదిస్తుంది. జనన మరణ సంసార చక్రము నుండి విడుదల చేసి మానవునికి ఆత్మ సాక్షాత్కారము నొసంగి ఆశీర్వదించుటయే భగవద్గీత ముఖ్యోద్దేశము. భగవద్గీతను గానం చేయడమంటే గీత ప్రబోధించు విషయములను ఆచరించడమని భావము.

గీతను గానము చేయులాగునే సహస్ర నామములను కూడా గానం చేయమని రచయిత తెలియజేస్తున్నారు. ఈ విష్ణు సహస్రనామస్తోత్రము మహాభారతములోని అనుశాసనిక పర్వములో భీష్మయుధిష్ఠిర సంవాద రూపమున జరిగినది. అంపశయ్యపై పవ్వళించియున్న భీష్ములవారు ధర్మరాజు అడిగిన ఆరు ప్రశ్నలకు సమాధానంగా చేసిన స్తోత్రమే ఈ విష్ణు సహస్రనామ స్తోత్రము. అంతకుపూర్వమే భీష్మాచార్యులవారు వ్యాసభగవానునివద్ద ఆసీనులై విష్ణు సహస్రనామమును ఆలకించి యున్నారు. వ్యాసభగవానుని శిష్యులు అక్కడక్కడ గానం చేసినట్లు కూడా తెలియుచున్నది. కాని భీష్మాచార్యులవారు మృత్యుశయ్యపై పవళించి దేహత్యాగం చేసే ముందు పాండవులు, వ్యాసుడు, ధర్మరాజు శ్రీకృష్ణుని ఎదుట మొదటిసారిగా పారాయణ చేయడం జరిగింది. అది దైవమైన శ్రీకృష్ణ పరమాత్మకు సహస్రనామార్చన ప్రత్యక్షముగా భీష్ములవారు చేసినట్లయింది. రామచంద్రుని ఎదుట రామాయణము గానము చేయబడినట్లు కృష్ణభగవానుని ఎదుట విష్ణు సహస్రనామం గానం చేయడం జరిగింది.

విష్ణు సహస్రనామానికి అనేకమంది వ్యాఖ్యలు వ్రాశారు. వానిలో శ్రీ శంకర భగవత్పాదులు, శ్రీపరాశర భట్టాచార్యులు వ్రాసిన వ్యాఖ్యలు ముఖ్యములు. అందులో శ్రీశంకరుల వ్యాఖ్య సర్వజన సమ్మతమై ప్రచారము నొందినది. శంకరులు ముగ్గురు శిష్యులను వేరువేరుగా పిలచి తన గ్రంథాలయమునుండి ఒక పుస్తకమును తీసుకొనిరమ్మని చెప్పగా ఆ ముగ్గురు శిష్యులు విష్ణుసహస్రనామ స్తోత్రమునే తీసుకువచ్చిరనియు, అంతట సరస్వతీ దేవియే ప్రత్యక్షమై విష్ణుసహస్రనామస్తోత్రానికి భాష్యం వ్రాయమని కోరగా శంకరులు వ్రాసినట్లు తెలియుచున్నది.

నామమునకు నామికి తేడా లేదు. భగవంతుని వేయి నామములను కూర్చి అందించిన ఈ విష్ణు సహస్రనామస్తోత్రము భక్తజనుల హృదయ మందిరాలలో

అఖండమై అలరారుచున్నది. ప్రతినామము వేయినామముల మహిమను, శక్తిని కల్గియున్నదని శఠగోప యతీంద్రులు తన "భగవద్విషయ"మనే గ్రంథములో రచించారు.

అనంతుడైన భగవానుని కళ్యాణ గుణములను వేయి సంఖ్యతో అర్చించడము ఒక గొప్ప విశేషము. నాలుగు వేదములలో వ్రాయబడిన పురుషసూక్తములో భగవానుని విరాడ్రూపాన్ని వర్ణిస్తూ "సహస్ర శీర్షాంపురుషః సహస్రాక్ష సహస్రపాత్" "వేయితలలు, వేయి నేత్రములు, వేయిపాదములు కలిగి యున్నట్లు" వర్ణించబడినది. కనుక వేదసారభాన్ని వెదజల్లుచున్న ఈ సహస్రనామ స్తోత్రం పావనమై దరిచేరువారలను పవిత్రులను చేయుచున్నది.

కలియుగములో భగవన్నామమే భవసాగరమును దాటింపశక్తి గల దివ్యనౌకయని శాస్త్రములు ఘోషిస్తున్నవి. మహాత్ములు ప్రవచిస్తున్నారు. "యజ్ఞానాం జప యజ్ఞోస్మి" యజ్ఞాలలో నేను జపయజ్ఞమని స్వయంగా శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీత విభూతి యోగంలో తెలియజేసారు. నామాన్ని ఆశ్రయిస్తేచాలు. నామము మనలను నామి దగ్గరకు చేర్చుతుంది. "రామ" అని ఉచ్చరించలేని వాల్మీకి శ్రద్ధతో "మరామరా" అని ఆదికావ్యమైన రామాయణాన్ని రచించాడు. రామనామానుచ్ఛరిస్తూ హనుమంతుడు సముద్రాన్ని లంఘించాడు. నామ మహిమ వర్ణనాతీతం.

భగవద్గీత సహస్ర నామములను గానం చేయుటతోపాటు ఆచరించవలసిన రెండవ విషయము లక్ష్మీపతి రూపమును నిరంతరము ధ్యానం చేయుట. భగవంతుని రూపమును ధ్యానించుట యనిన తనకు నచ్చిన రూపములో భగవంతుని ఆరాధించుట. అన్ని రూపాలు భగవానునివే గనుక ఏ రూపములో ధ్యానించినా అది భగవానుని ధ్యానించినట్లే అవుతుంది. శివ కేశవాది భేదాలకు వేదాంతములో స్థానంలేదు. అందుచేతనే శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీత 4వ అధ్యాయం జ్ఞానయోగములో,

"యే యథా మాం ప్రపద్యన్తే తాంస్తథైవ భజామ్యహమ్



"అర్జునా! ఎవరే ప్రకారముగ నన్ను సేవింతురో వారిని ఆ ప్రకారముగనే నేను అనుగ్రహిస్తాను. మనుజులు అన్ని విధాల నా మార్గమునే అనుసరిస్తున్నారు" అని ప్రబోధించారు. ఏ రూపములో ధ్యానిస్తున్నాడనేది కాదు కావలసింది, ఎంతటి శ్రద్ధతో చేస్తున్నాడా అనేది గమనించాలి.

గీత, సహస్రనామ పారాయణచేస్తూ, నిరంతరము శ్రీపతి రూపమును ధ్యానిస్తున్నను ఒక్కొక్కప్పుడు సంస్కార ప్రభావము చేత ధ్యానం నిశ్చలంగా కుదరదు. నిర్మల భక్తి ఏర్పడదు. అలాంటి విషమసమయాల్లో మనలను కాపాడి రక్షించే ఒకానొక సాధనము సత్సంగము. అందుచేతనే సజ్జన సాంగత్యమును కలిగి యుండుటను మూడవ లక్షణంగా రచయిత తెలియజేశారు.

ఒక చిన్న నిప్పురవ్వ అరణ్యాల్ని దహించివేయునట్లు, సత్సంగము సంచిత కర్మ సముచ్చయమును దహింపచేసి మనలను బంధ విముక్తులను చేస్తుంది. సత్ పురుషుల దర్శనంతో మనసులో ఆధ్యాత్మిక చైతన్యము నిండుకుంటుంది.

"సదా ముఖే నామ సంతాచేదరిశన"

నిరంతరము భగవన్నామస్మరణ, సంత్ పురుషుల దర్శన భాగ్యము కల్పించమని నామదేవులవారు పాండురంగని ప్రార్థించారు.

"సత్సంగరూపీ గంగా మాంప్రేమే కరీన్హావ"

సత్సంగమునే గంగలో మునకవేసి పవిత్రుడవు కమ్మని మీరాబాయి గానం చేసింది.

గీతాపారాయణ, సహస్రనామస్తోత్రపారాయణ, శ్రీపతి ధ్యానం సత్పురుషుల సాంగత్యమును గూర్చి తెలుపుతూ చివరి సాధనగా దీనజనులకు సహాయము చేయమని తెలియజేస్తున్నారు.

భక్తుడు అందరిలో భగవంతునే దర్శిస్తాడు. అలాంటప్పుడు ఎదుటివారి దుఃఖాన్ని చూచి సహించలేడు. వెంటనే వెళ్ళి వారికి సహాయపడుతాడు. ... సహాయంలో నారాయణ సేవను అనుభూతి పొందుతాడు.

కుటుంబములో సభ్యులందరిని ద్వేషిస్తూ ఆ ఇంటి యజమాని స్నేహాన్ని ఎలా పొందలేమో అలాగే సృష్టిలోని భగవానుని సంతానమునకు సేవచేయలేనిచో సృష్టికర్తను కూడా తృప్తి పరచలేము. దీనులలో దీనదయాళుడైన భగవానుని దర్శించి సేవించడములో పరమార్థము నిండియున్నది.

పైన సూచించిన నాలుగు సాధనలను ఆచరణలో పెట్టగలిగినచో జన్మ చరితార్థమవుతుందని రచయిత తెలియచేస్తున్నారు.

శంకర భగవత్పాదుల వారి పదునలుగురు శిష్యులు ప్రవచించిన చతుర్దశమంజరీక స్తోత్రము ఈ శ్లోకంతో సమాప్తమైనది. శ్రీశంకరులు ఆశీర్వచనముగా తెలియచేసిన చివరి నాలుగు శ్లోకములు ప్రారంభమగుచున్నవి.

సుఖతః క్రియతే రామా భోగః
పశ్చాద్ధన్త శరీరే రోగః
యద్యపి లోకే మరణం శరణం
తదపి న ముఞ్చతి పాపాచరణమ్ 28

సుఖతః = సుఖమనకై, రామాభోగః = లైంగికభోగము, క్రియతే = ఆచరించబడుతుంది, పశ్చాత్ = తదుపరి, హంత = అయ్యో, శరీరే = దేహమునందు, రోగః = రోగము, యద్యపి = అదేగాక, లోకే = ఈలోకము నందు, మరణం = చావు, శరణమ్ = తప్పనిది, తదపి = అయినప్పటికి, పాపాచరణం = పాపము చేయుట, నముఞ్చతి = విడిచిపెట్టడు.

భావము :- లైంగిక వికారములకు లోనై వ్యక్తి భోగజీవితము ననుభవిస్తాడు. తరువాత శరీరం రోగభూయిష్టమవుతుంది. ఈ లోకంలో మరణం అనివార్యమయినప్పటికి అప్పుడుకూడా మనిషి పాపభూయిష్టమైన ప్రవర్తనను



## వ్యాఖ్య

ప్రాపంచిక భోగలాలసత్వములోపడి వ్యక్తి తన కర్తవ్యాన్నే విస్మరించి, పిచ్చివాడిలా సంచరిస్తున్నాడు. శారీరక వాంఛలను సంతృప్తిపరచుటకై తన కాలాన్నంత వృథా చేసుకొనుచున్నాడు. ఈనాడు భోగము ననుభవించే ఈ శరీరము రేపు రోగ భూయిష్టమవుతుందని గ్రహించలేక పోతున్నాడు. శోకగ్రస్తమైన భోగజీవితము అందించే గుణపాఠాన్ని అర్థం చేసుకోలేక, జీవితాన్ని నిరర్థక మార్గాల్లో నడుపుతున్నాడు.

ఇంద్రియ విషయాలలో ఆనందం లేదు. ఇంద్రియజన్యమైన సుఖం కూడా దుఃఖము యొక్క స్వరూపమే. ఇసుకలో నూనె, నీటిలో నేయి, నిప్పులో చల్లదనము ఎలా లభించవో భోగజీవితములో కలిగే ఆనందం కూడా అలాంటిదే. కనుక భోగవస్తువుల నాశ్రయించి, వాటి ద్వారా శాశ్వతమైన ఆనందం లభిస్తుందని భావించేవారు చివరకు నిరాశా నిస్పృహలకు లోనుగాక మానరు. విషయసుఖాలకు బానిసయై ఇంద్రియములను సంతృప్తి పరచు మానవుడు నిరంతరము భోగవస్తువులను సమీకరించుటలోను, అనుభవించుటలోను మనసును లగ్నం చేసి భోగానంతరము ప్రాప్తించే అనంత దుఃఖమునకు వశుడై క్రుంగి పోతున్నాడు.

భోగము ననుభవించుటయందు ఆసక్తి గల మనసులో వివేకము నశిస్తుంది. మంచి చెడులనునిర్ణయించే శక్తి సన్నగిల్లుతుంది. మానావమానాలు స్ఫురించవు. భవిష్యత్తును గూర్చిన ఆలోచనలు మిగలవు. సంఘంలో పలుకుబడి క్షీణిస్తుందనే భయం కలగదు. తనను నమ్ముకున్నవారు అన్యాయమవుతారనే విచక్షణ వుండదు. తనలో మూర్తీభవించే స్వార్థపరత్వము ఉన్నతస్థాయిలో యోచన చేసే అవకాశము కల్పించదు. ఉజ్జ్వలమైన భవిష్యత్తును మట్టిపాలు చేయక మానదు.

ఇంద్రియ భోగాలనే ఈ సుడిగుండంలో తగుల్కొనిన మానవుడు సమాజంలో ఒక సమస్యగా నిలుస్తాడు. తానుభోగాను భవములో సఫలీకృతుడు కాగానే తనకన్నా గొప్పవాడు లేడని మదించిన ఏనుగు వలె ప్రవర్తిస్తూ,

తోటివారిని లెక్కచేయక అహంకారిగా మారుతాడు. అలాగాక తాను పొందదలచుకున్న విషయ సుఖాలు దూరమైనచో చెదిరిన మనస్కుడై తోటివారిపై విసుగుచెంది, అనవసరమైన పగను సృష్టించుకుంటాడు. ఈ అహంకార క్రోధాలు మనిషిని ఉన్నతస్థాయిని కల్పించవు. శారీరకంగా, మానసికంగా వ్యక్తిని బలహీనంచేసి, సాంఘికంగా నైతికంగా పతితుణ్ణిగామార్చి జీవితాన్నే పేలవంగా తయారుచేస్తాయి.

తామర గోకుతున్న కొద్దీ ఆనందముగానే ఉంటుంది. గోకడం ఆపగానే అపరిమిత బాధను కల్గిస్తుంది. ఇంద్రియభోగాలు కూడా అనుభవిస్తున్నంత వరకు రుచిగానే ఉంటాయి. చివరకు శోకకూపంలో పడదోస్తాయి. "Things sweet to taste prove in digestion sour" "జిహ్వకు రుచియైనది జఠరమునకు చేదు" అని షేక్స్పియర్ తెలియచేస్తారు. భోగ జీవితము ననుభవించే మనిషి ఎప్పుడు కలత చెందే ఉంటాడు. భోగవస్తువు లభించకపోయినా దుఃఖమే, ఒకవేళ లభించిననూ దుఃఖము ఆగదు. అగ్నిలో నేయి పోయడమువలన మంట ఎలా ఆరదో, పైగా ఎలా వృద్ధిచెందుతుందో అలాగే భోగాలనుభవించడము ద్వారా ఇంద్రియాలు భగ్గునమండి జీవినే దహింపచేస్తాయి గాని, ఇంద్రియ దావాగ్ని చల్లారే ప్రసక్తే వుండదు.

ఈ ప్రాపంచిక విషయ సుఖాలలోని నిస్సార జీవనాన్ని అర్థం చేసుకున్నప్పుడే వాటిమీద విరక్తి కల్గుతుంది. వైరాగ్యమే మనిషికి వివేకాన్నిస్తుంది. ఇంద్రియ సుఖాలు నిరుపయోగము, నిరర్థకమనేభావన కలుగనిచో ఆ భోగజీవితమే అమృత తుల్యమనిపిస్తుంది. దారి తప్పి మురికి గుంటలో పడిపోయిన నిషాదాసు, ఆ మురికి గుంటనే మానససరోవరంగా భావించి ఈదులాడుతుంటాడు. ఆ బురదనీరే అతనికి పన్నీరులా కనిపిస్తుంది. దుర్గంధపూరితమైన ఆ మలినకూపం పుష్పసుగంధ సౌరభాలను వెదజల్లే ఇంద్రమహల్‌లా అనుభూతి కలుగుతుంది. భోగచత్వారము ఆవరించిన మనసుకు దృష్టి ఎల్లప్పుడూ విపరీత ధోరణిలోనే నడుస్తుంది.

ఎన్ని భోగాలనుభవించినా, ఎంతకాలం జీవించినా తుదకీ శరీరము [illegible] తెలియజేయుచున్నారు. పుట్టిన

ప్రతివ్యక్తికి మృత్యువు అనివార్యము. మనము భోగాల ననుభవించే ఈ స్థూల శరీరం మట్టిపాలవుతుంది. వాసనా పూరితమైన సూక్ష్మ శరీరం జనన మరణ చక్రంలో తగుల్కొని యాతన ననుభవిస్తుంది. క్షణికమైన ఈ పాంచభౌతిక శరీరానికి మృత్యువు తప్పదని తెలిసి కూడా ఎందులకో మానవుడు పాపకార్యములను విడిచిపెట్ట లేకున్నాడని ఆచార్యులు ఆశ్చర్యాన్ని ప్రకటిస్తున్నారు.

మృత్యువు శరీరానికే గాని ఆత్మకుకాదు. భోగాల ననుభవించేది కూడా శరీరమే. అనుభవించే దేహము అవస్థల పాలవుతున్నది. సాక్షీ భూతమైన ఆత్మ ఆనందముగానే వుంది. నశించే శరీరముపై భ్రాంతి ఏర్పరచుకొనుటవలన, భోగాల వెంబడి నడకసాగించి, రోగాలకు ఆలవాలమై చివరకు దుఃఖమయమై మృత్యువుకు గురికావలసి వస్తున్నది. నిత్యమై సత్యమై భాసించే ఆత్మయందు మనసును లగ్నంచేసినచో అమరత్వమే సిద్ధించగలదు.

ఈనాడు మనము అనుభవించే భోగజీవితము ఇంతటితో ఆగేదికాదు. నేటి అనుభవాలే రేపటికి అంకురాలై, ఎడతెగని భోగానుభవవిషవలయంలో పడదోస్తాయి. జన్మలు పొడిగించబడుతాయి. దుఃఖము విస్తరింపబడుతుంది. కనుక నిరుపయోగమైన భోగజీవితమును కొనసాగించక, మృత్యు ఒడిలో పడకముందే అమరత్వమును పొంది తరించమని ఆచార్యుల సందేశము.

అర్థ మనర్థం భావయ నిత్యం
నాస్తి తతః సుఖలేశః సత్యమ్
పుత్రాదపి ధనభాజాం భీతిః
సర్వత్రైషా విహితా రీతిః 29

నిత్యం = ఎల్లప్పుడు, అర్థం = ద్రవ్యము, అనర్థం = నిరర్థకమైనది భావయ = భావించు, తతః = దానినుండి, సుఖలేశః = కొద్దిసుఖము, నాస్తి = లేదు, సత్యమ్ = సత్యమైనది, పుత్రాదపి = పుత్రునినుండి కూడా, ధనభాజాం = ధనము గలవానికి, భీతిః = భయమే, సర్వత్ర = అన్నిచోట్ల, ఏషా = ఈ, రీతిః = విధము, విహితా = నిర్దేశించ బడియే యున్నది.

భావము :- ధనమెప్పుడూ దుఃఖహేతువని మరచిపోకు. దానిలో కొద్దిసుఖం కూడా లేనిమాట వాస్తవము. ధనవంతునికి తన కుమారుడి నుంచి కూడా భయం కలుగుతూ వుంటుంది. ఎక్కడైనా ధనం యొక్క పరిస్థితి ఇంతే.

## వ్యాఖ్య

గత శ్లోకంలో భోగజీవితము నరకతుల్యమని తెలిపి ఈ శ్లోకంలో ధనసంపద కూడా విసర్జనీయమేనని పూజ్యపాదులు తెలియ జేయుచున్నారు.

నీరు పల్లానికి ప్రవహిస్తుంది. నిప్పు ఊర్ధ్వంగా పయనిస్తుంది. ధర్మం సద్గతిని ప్రసాదిస్తుంది. ధనం అనర్థాన్ని ప్రవేశ పెడుతుంది.

సృష్టిలో మానవునితోపాటు జంతువులు కూడా తన మనుగడకు భూమాత నాశ్రయించి ఉన్నాయి. అయితే మానవ ప్రపంచము వేరు. మానవుడు గ్రామాల్ని నిర్మించుకొని జీవిస్తున్నాడు. జంతువులు ముందే నిర్మించబడియున్న అరణ్యాల్ని కైవసం చేసుకొని బ్రతుకుతున్నాయి. మానవుడు అడవుల్లో ఎలా జీవించలేడో అలాగే జంతువులు గ్రామాల్లో నివసించలేవు.

జంతు ప్రపంచములో కూడా ఒక క్రమశిక్షణ కన్పిస్తుంది. జంతువులకు ఆహార నిద్రాదులలో ఒక నియమం కనిపిస్తుంది. ఆకలిగా వున్నప్పుడే జంతువులు ఆహారానికి అన్వేషణ జరుపుతాయి. ఆకలి తీరగానే ప్రశాంతంగా ఉంటాయి. రాగద్వేషాలతో ఆశాపాశాలతో అలమటించకుండా ప్రశాంత మనుగడను కొనసాగిస్తాయి. తృప్తిగా బ్రతుకుతాయి.

బుద్ధిగల మానవుడు అందుకు వ్యతిరేకంగా కనపడుతాడు. సంతృప్తి అనేది తనకు తెలియదు. అతని కోరికలకు ఒక హద్దంటూ వుండదు. అసూయ, క్రోధము, స్వార్థము మొదలగు దుర్గుణాలకు ప్రతిరూపమై ఉంటాడు. కోపోద్రేకంలో తాను జంతువుకన్నా క్రూరంగా ప్రవర్తిస్తాడు. తన బ్రతుకులో ప్రశాంతతే



మానవునిలో చోటుచేసుకొనియున్న స్వార్థమే అతనిని జంతువు కన్నా హీనంగా తయారుచేసింది. తన స్వార్థ జీవనానికి చేయరాని పనులు చేస్తాడు. అక్రమ మార్గాల్లో ధనార్జన ప్రారంభిస్తాడు. మానవుడు ఈనాడు ధనాశతో చేయని రాక్షసకృత్యమంటూ లేదు. కనుక మానవుణ్ణి నైతికంగా దిగజార్చే ధనము అనర్థమని పూజ్యపాదులు ఈ శ్లోకంలో తెలియజేస్తున్నారు.

మానవుని జీవితకాలము అతి స్వల్పం. తన జీవిత కాలానికి సరిపోయే ధనంతో తృప్తి చెందక, తన కుటుంబీకులు కొన్ని తరాలు కూర్చుని నిమ్మళంగా జీవించుటకు సరిపోయేటంత ధనార్జన చేయాలని మానవుడు ఈనాడు ప్రయత్నిస్తున్నాడు. ఇంతకన్నా అవివేకం మరొకటి లేదు. ధనార్జన చెయ్యాలనుకుంటున్నాడేగాని దానివలన కలిగే పర్యవసానాన్ని గుర్తించలేకున్నాడు.

మితిమీరిన ధనం బ్రతుకులో శాంతిని భగ్నం చేస్తుంది. అన్యాయార్జితము వలననే అధిక ధనం లభించాలి. అక్రమ మార్గాల్లో ధనార్జన చేసే వ్యక్తి నైతికంగా పతనమయ్యాడని అర్థం. పవిత్రమైన జన్మకు అంతకన్నా దుర్గతి మరొకటి లేదు. ధనం ఆర్జించగానే సరిపోదు. తాను అక్రమ సంపాదన చేసినట్లు సూక్ష్మంగా మనసు హింసిస్తుంటే, ధనవంతుడనే అసూయతో బయట స్థూలంగా శత్రువులు తయారవుతారు. శాంతి జీవనానికి ధనాన్ని ఆర్జిస్తాడు. ఆర్జించిన విత్తాన్ని కాపాడుకోవడంలో శాంతిని భగ్నం చేసుకుంటాడు. సుఖ జీవనానికి ధనము అవసరమైనా, సుఖం ధనంలో లేదని ఆలోచిస్తే తెలుస్తుంది. అందుచేతనే "నాస్తితతః సుఖలేశః సత్యం" ధనంలో కొద్ది సుఖం కూడా లేదని ఆచార్యులు తెలియజేయుచున్నారు.

తాను ధనాన్ని ఆర్జించేది తన కొరకేకాదు. తనవారనుకొనే వారందరూ సుఖంగా జీవించాలనే ఉద్దేశ్యంతో ధనాన్ని కూడబెడతారు. ఎవరి సుఖం కొరకైతే తాను అక్రమ మార్గాల్లో సంచరించి ధనార్జన చేశాడో వారుకూడా తనకు శత్రువులవుతారు. తాను ఎంత కష్టించి సంపాదించాడో తనకు తెలుసు. అందుకని అతిజాగ్రత్తగా ఖర్చుపెడతాడు. కానీ అనుభవించే తన కుటుంబీకులకు ఆర్జనలోవున్న బాధలేమితెలుసు? అందుకని దుబారాగా ఖర్చుపెడతారు. యజమానికి

ఇలా ఖర్చు చేయటం నచ్చదు. సంఘర్షణ ప్రారంభ మవుతుంది. సమస్యలు తీవ్రమవుతాయి. ఇంటినుండి వీధిలోకి, వీధినుండి న్యాయస్థానాలకు ప్రాకుతారు. అశాంతి అలుముకుంటుంది.ఆనందం అదృశ్యమవుతుంది. కనుకనే "పుత్రాదపి ధనబాజాం భీతిః" ధనవంతునికి తన కుమారుని వలనకూడా భయం కలుగుతుంది అని అంటున్నారు శ్రీశంకరులు.

మమతలను దూరంచేసి, పగలుసృష్టించి, శాంతిని భగ్నంచేసే ఈ ధనమెందుకు? దారిద్ర్యమున్నా బ్రతికే మూడు రోజులు ప్రశాంతంగా జీవిస్తేచాలు. కనుక ధనంయొక్క పరిస్థితి ఎక్కడైనాఎవరికైనా ఇంతే. ఈ సత్యమును గ్రహించి అత్యాశకు లోనై దుఃఖానికి ఆహుతి గాక, భగవంతుడు ప్రసాదించిన దానితో తృప్తినిచెంది జీవించడమే శ్రేయోదాయకము.

నీవు ధనవంతుడవైనచో బాధలేదు. ధనమును పరిత్యజించి అక్షయపాత్ర నాశ్రయించమని శాస్త్రము చెప్పదు. నీకు ధనాన్ని అనుగ్రహించింది భగవంతుడు. భగవత్ప్రసాదితమైన భాగ్యము భగవంతునిదే గాని మనది కాదు. గతంలో నీవు ఆచరించిన సత్కర్మల ఫలితంగా నీకీ ఐశ్వర్యము ప్రసాదించబడింది. దానిని సక్రమంగా వినియోగించనియెడల నీవు ధర్మం తప్పినవాడవు అవుతావు. ధర్మకార్యాలు నిర్వహించే అవకాశము భగవంతుడు నీకు అనుగ్రహించాడు. స్వార్థపూరిత జీవనంతో పుణ్యమును ఆర్జించే ఈ మహదవకాశమును దూరం చేసుకొని, గత జన్మ సుకృతఫల విశేషంగా ప్రాప్తించిన పుణ్య సంపదను వృథాచేసుకోవడం అనుచిత మవుతుంది.

భగవదారాధన బుద్ధితో ఎప్పుడైతే ఇలా జీవిస్తుంటావో, నీవు చేసే ధర్మకార్యాలలో కూడా నీకు కర్తృత్వం మిగలదు. నీ సహాయం మరియొక వ్యక్తికి అవసరమైనప్పుడు ఆ వ్యక్తి సాక్షాత్తు నారాయణుడేననే భావము కలిగి సహాయం చేయటం జరుగుతుంది. అక్కడ సహాయమనే ఆలోచనకూడా నశించి సేవయనే పవిత్రభావం ఏర్పడుతుంది.

దయాస్వరూపుడైన భగవంతుడు మనకు ప్రసాదించిన ఐశ్వర్యమును త్యాగపూరిత అంతఃకరణతో, సేవాదృక్పథముతో వినియోగపరచి బ్రతుకును



ప్రాణాయామం ప్రత్యాహారం
నిత్యానిత్య వివేక విచారమ్
జాప్యసమేత సమాధి విధానం
కుర్వవధానం మహదవధానం 30

ప్రాణాయామం = ప్రాణాయామము, ప్రత్యాహారము = ఇంద్రియనిగ్రహము, నిత్యానిత్య = సత్యాసత్యములు, వివేక జ్ఞానము = విచక్షణా పరిజ్ఞానము, జాప్యసమేత = జపముతో కూడిన సమాధి విధానం = సమాధి జ్ఞానము, అవధానం = స్థిరమైన ఏకాగ్రతతో, మహదవధానమ్ = గొప్ప జాగ్రత్తతో, కుర్వ = ఆచరించుము

భావముః– ప్రాణాయామము, ప్రత్యాహారము, ఆత్మానాత్మ వివేకము, జపము, సమాధి వీటిని జాగ్రత్తగా అనుష్ఠించుము. అతి జాగ్రత్తతో అనుష్ఠించుము.

## వ్యాఖ్య

ఆత్మ సాక్షాత్కారము పొందగోరు సాధకులు జాగ్రత్తగా అనుసరించవలసిన ఐదు సాధన మార్గములను ఆచార్యులు ఈ శ్లోకంలో చెబుతున్నారు. ఇందులో మొదటిది ప్రాణాయామము.

యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన, సమాధులు అను ఎనిమిది సాధనములను అష్టాంగ యోగములని పతంజలి మహర్షి తమ యోగదర్శనమునందు తెలియజేసియున్నారు. యమ నియమ ఆసనాదుల తరువాత ఆచరించదగినది ప్రాణాయామము. మానవ శరీరములో జరుగు ప్రాణ, అపాన, వ్యాన, ఉదాన, సమానవాయువులను నిరోధించి సక్రమమార్గమున నడుపుటయే ప్రాణాయామ మనబడుతుంది. మనము ముక్కుద్వారా గాలిపీల్చి లోపలనిలిపి, వదలి, వదలినగాలిని బయటనిలిపి మరల లోపలికి పీల్చు ఈ

క్రమము శ్వాసయామమే గాని, యదార్థానికి ప్రాణాయామము కాదు. అయినను ప్రారంభదశలో స్థూలమైన ఈ ప్రాణాయామమే ఆచరించదగినది. ఇది సాధ్యపడిన తరువాత సూక్ష్మరీతుల్లో పంచప్రాణాలను నడిపించడం సాధ్యపడుతుంది.

"తస్మిన్ సతిశ్వాస ప్రశ్వాసయోర్గది విచ్ఛేదః ప్రాణాయామః

ఆసనస్థితి కలిగిన తరువాత ఉచ్ఛ్వాస నిశ్వాసములయొక్క గమనాగమనముల నిరోధము చేయుటయే ప్రాణాయామ మనబడును.

ఈ విధమైన ప్రాణాయామము మనము గుర్తించినా లేకున్నా నిరంతరము మనలో జరుగుచునే యున్నది. అయితే ఇది ప్రాణాయామమనిపించుకోదు. వ్యక్తి క్రమశిక్షణతో పూరక, రేచక కుంభకములను క్రమబద్ధంగా నడిపించడము ప్రాణాయామ మవుతుంది. ప్రాణ నిరోధనము వలన మనసు నిగ్రహింపబడుతుంది. మనసును నిగ్రహించుటకు ప్రాణాయామము ఉత్తమమైన ప్రక్రియ. భగవాన్ రమణ మహర్షులవారు తన ఉపదేశసార గ్రంథములో

ప్రాణ బంధనా ల్లీ యతేమనః
జాలపక్షి వ ద్రోధ సాధనం

ప్రాణబంధనమువలన, వలలో చిక్కిన పక్షివలె మనసు నిగ్రహింప బడుతుందని ప్రబోధించారు.

ఇలా ప్రాణాయామము ద్వారా ప్రశాంతతను పొందిన మనసును మళ్ళీ విషయ ప్రపంచమువైపుకు పరుగులిడకుండా నిగ్రహించాలి. ఈ కారణము చేతనే రెండవ సోపానముగా ప్రత్యాహారమును ఈ శ్లోకంలో ఆచార్యులు తెలియజేస్తున్నారు.

అష్టాంగయోగ విధానములో ప్రత్యాహారము అతిముఖ్యమైన అంగము. ప్రత్యాహారమే వాస్తవమైన యోగ భూమిక అని కూడా కొందరు అభిప్రాయ పడుతుంటారు. యమ నియమ ఆసన ప్రాణాయామాదులద్వారా శారీరక మనోబుద్ధులు పరిశుద్ధ మవుతాయి. ప్రత్యాహారములో వాస్తవముగ యోగసాధన



స్వవిషయా సంప్రయోగే చిత్తస్వరూపానుకార ఇంద్రియాణాం ప్రత్యాహారః

ఇంద్రియములను ఇంద్రియ విషయములందు పోనీక నిర్మల చిత్తమునకు మరల్చి తమ తమ స్థానమున నిల్పుటయే ప్రత్యాహారము.

ఇంద్రియములెప్పుడూ బహిర్ముఖ మవుతుంటాయి. ఇంద్రియములు బహిర్ముఖంకాగానే మనసు ఇంద్రియాలలో సంయోగము చెంది ఇంద్రియ విషయ లోలత్వములో చిక్కుకొని రమిస్తుంది. విషయ ప్రపంచము మీదకు నడకసాగించే ఇంద్రియాలను అరికట్టి దారి మళ్ళించాలి. ఎప్పుడైతే ఇంద్రియాలను విషయముల మీదికి వెళ్ళనీక ఆపుతామో, ఇకవాటికి మనసే గత్యంతరము. అందుచేత వెనుదిరిగి మనసులో లయించిపోతాయి. అప్పుడు మనసు ఏ వస్తువు యొక్క రూపాన్ని ధరించలేదు. ఏ విషయముతోను తాదాత్మ్యం చెందలేదు. అట్టి మనసు అంతర్ముఖమై ఆత్మలో లయిస్తుంది. మనసు ఆత్మలో లయిస్తే ఆత్మానందము ప్రాప్తిస్తుంది.

అయితే ఇంద్రియాలను విషయ ప్రపంచమునుండి మళ్ళించి మనసులో లయింప చేయడం అంత సులభసాధ్యంకాదు. విషయములపై మనకు వ్యామోహ మున్నంతవరకు అదిసాధ్యపడదు. విషయ ప్రపంచము యొక్క యదార్థ స్వరూపం అవగతం కావాలి. వైరాగ్య ముదయించాలి. అందుకనే తరువాత మూడవ లక్షణంగా నిత్యానిత్య వస్తువివేకాన్ని గూర్చి శ్రీశంకరులు తెలియజేస్తున్నారు.

ఆత్మానాత్మ వివేక జ్ఞానం లేకపోవడమే సర్వ దుఃఖాలకు కారణమై యున్నది. అజ్ఞానంచేత మానవుడు ఆత్మజ్ఞానం కోల్పోయి అనాత్మను కౌగలించుకుంటున్నాడు. నశించిపోయే దేహము తానని భావిస్తున్నాడు. దేహముతో తాదాత్మ్యం చెంది, ఇంద్రియమనోబుద్ధుల ద్వారా విషయ ప్రపంచ గారడిలో చిక్కుకొని జీవితమును వృథా చేసుకొనుచున్నాడు. తాను శరీరము కాదు. మనసు కాదు. ఇంద్రియాలు కాదు. బుద్ధికాదు. వీటన్నిటిని తాను తెలుసుకొనేవాడు.

ఆత్మ సత్యమైనది. అనాత్మ అసత్యమైనది. ఆదిలో కనుపించక అంతర్యములో అగుపించక మధ్యలో మాత్రమే తెలియబడేది అసత్యము.

అనాత్మ శరీరం ఒకప్పుడు లేదు. పుట్టుక పూర్వములేదు. గిట్టిన తరువాత ఉండదు. మధ్యలోనే కనుపిస్తున్నందున అది అనిత్యము. అలాగే ప్రపంచానికి కూడా సృష్టి, స్థితి లయము ఉన్నది గనుక అది కూడా అనిత్యమే. ఆత్మ సర్వత్ర ఉంటుంది. సర్వకాలాలలో స్థిరమై ఉంటుంది. కాలాతీతమై ఉంటుంది. ఆత్మజ్ఞానము మనలో నశించడము వలననే అనాత్మతో సంబంధం ఏర్పరచుకుంటున్నాము. కనుక ఆత్మానాత్మ జ్ఞానములో అనాత్మను విసర్జించి ఆత్మలో ఐక్యంకావాలి.

నిత్యానిత్య వస్తువివేకం జరిగిన తరువాత అనిత్య వస్తువును విడిచి పెట్టి నిత్యవస్తువును గురించి సదా చింతన చేయాలి. మాటలురాని బిడ్డకు మనం తన పేరును నేర్పునపుడు అనేకసార్లు ప్రతిరోజు నేర్పుతాం. ఇలా కొంతకాలం విన్నతరువాత అది తన నామమని బిడ్డ గుర్తించి తదనుగుణ్యముగ ప్రవర్తిస్తుంది. అనాదిగా మనం అనాత్మతో తాదాత్మ్యంచెంది యున్నాము. ఇప్పుడు ఒక్కసారిగ మనం ఆత్మ స్వరూపులమని గ్రహించలేము. అందుకై మనం సాగించు అభ్యాసమే జపయోగము. జపంలో ఏకచింతన ఉంటుంది. సాధన సూక్ష్మతరంకాగానే జపం ఆగిపోయి సమాధి అనుభవానికి వస్తుంది.

సమాధిలో విషయ జ్ఞానమే ఉండదు. అక్కడ కేవలం ప్రశాంత చైతన్యము భాసిస్తుంది. సుషుప్తిలో కూడా విషయ జ్ఞాన ముండదు. సుషుప్తి సమాధి ఒకటని భావించకూడదు. ఇంద్రియాలు అంధకారంలో లయిస్తే అది సుషుప్తి. దివ్య వెలుగులో లయిస్తే అది సమాధి. మనో వృత్తులను అరికట్టి మనోబుద్ధులను ఆత్మయందు లయింప చేయుటయే సమాధి. అలా లయించిన మనోబుద్ధులు తిరిగి బహిర్ముఖం కానిచో అది నిర్బీజ సమాధి అనబడుతుంది.

సమాధి జ్ఞానములో అనాత్మ సంబంధము పూర్తిగ తెగిపోతుంది. స్వస్వరూపము ఎరుక పడుతుంది. జనన మరణ చక్రము ఛేదింపబడుతుంది. మంగళదృష్టి ఏర్పడుతుంది.

అట్టి పరిపూర్ణ ఆనందమునుగోరు ముముక్షువు ప్రాణ, యమ, ప్రత్యాహార,



అయితే ఈ సాధనలను జాగ్రత్తగ అనుసరించమని ఆచార్యులు తెలియ చేయుచున్నారు.

ఆధ్యాత్మిక సాధకులకు సాధన సమయములో తొందరపాటు, ఉద్వేగము పనికిరాదు. అంతరంగిక సాధనలు నిమ్మళంగా స్వానుభవానికి రావాలి. తీవ్ర సాధనలు చేయు అభ్యాసకులు అనుభవము సిద్ధించలేదని ఆవేదన చెంది తమ ఆందోళనాపూరిత మనస్తత్వముతో సాధననే వక్రింప చేసుకుంటారు. అందువలన "కుర్వవధానం, మహదవధానం" జాగ్రత్తతో సాధన కొనసాగించమని ఆచార్యులు తెలియజేస్తున్నారు. అనుభూతి కాలము ననుసరించిరాదు. సాధన తీవ్రతపై ఆధారపడి యుంటుంది.

గురుచరణాంబుజ నిర్భర భక్తః
సంసారా దచిరా ద్భవ ముక్తః
సేంద్రియ మానస నియమాదేవమ్
ద్రక్ష్యసి నిజ హృదయస్థం దేవమ్ 31

గురుచరణాంబుజ = గురుదేవుని చరణ కమలముల ఎడ, నిర్భర భక్తః = పూర్ణభక్తి కలిగి, సేంద్రియ = ఇంద్రియములు, మానస = మనస్సు, నియమాత్ = నియమించుట ద్వారా, అచిరాత్ = అతి త్వరలో, సంసారాత్ = సంసారమునుండి, ముక్తః = ముక్తుడవు, స్థంభవ = అగుదువుగాక!, నిజ = నీయొక్క, హృదయం = హృదయములోవున్న, దేవమ్ = దేవుని, యేవమ్ = మాత్రమే, ద్రక్ష్యసి = దర్శించెదవు!

భావము :- సద్గురు చరణ సేవారతుడవైన ఓ భక్తుడా! ఇంద్రియములను, మనసును నిగ్రహించి ఈ జనన మరణ చక్రమునుండి విముక్తుడవు కమ్ము. అలా చేయడము వలన నీ హృదయములో నున్న పరమాత్మను దర్శించ గలవు.

## వ్యాఖ్య

ఈ శ్లోకము భజగోవింద గ్రంథములో చివరి శ్లోకము: గురుశిష్యుల సంబంధమును, శిష్యుని కుండవలసిన గురుభక్తిని ఈ శ్లోకము వివరించుచున్నది.

ఆధ్యాత్మిక రంగములో గురువు లేకుండా నడక సాగించడమనేది బహు కష్టతరమైన విషయము. ప్రాపంచిక వృత్తులలోనే శిక్షణ పొందుటకు గురువు అవసరమైయుండ, ఇక ఆధ్యాత్మిక రంగములో ఆచార్యుని అవసరాన్ని గురించి చెప్పనవసరం లేదు. గురువు దూరంగా వున్నను అవసరమైతే సలహాలు దూరంనుండి ఇవ్వవచ్చును. కానీ బోధవేరు. ఇచ్చట శిష్యుడు గురువు పాదాలచెంత ఆసీనుడై గ్రహించాలి. అంతకన్నా మరో మార్గంలేదు. అందుచేత తన తండ్రి, గురువు అయిన వరుణుని దగ్గర ఆసీనుడై భృగువు వేదాంత శ్రవణము చేశారు. అలాగే శ్వేతకేతు తన తండ్రి, గురువు అయిన ఉద్దాలకుని చెంత ఆసీనుడై తత్వాన్ని గ్రహించాడు. శ్రీకృష్ణుడు సాందీపనివద్దను, అర్జునుడు శ్రీకృష్ణ పరమాత్మ చెంతను ఆసీనులై వేదాంత శ్రవణము చేశారు.

గురువులేక వేదాంతమును గ్రహించడము దుస్సాధ్యము. "ఆచార్యవాన్ పురుషోవేద" "గురువును పొందినవాడే ఆత్మను తెలిసికొనును" అని ఛాందోగ్యోపనిషత్తు నిర్ణయించింది. "శాస్త్రజ్ఞోపి స్వాతంత్ర్యేన బ్రహ్మజ్ఞానా న్వేషణమ్ నకుర్యాత్" బాగా శాస్త్రాధ్యయనము చేసినవాడు కూడా తనకు తానుగా బ్రహ్మజ్ఞానమును అన్వేషించకూడదని శంకరాచార్యులవారు ముండకోపనిషత్తుపై వ్రాసిన వ్యాఖ్యానములో తెలియజేసియున్నారు.

గు' శబ్దస్త్వంధ కారస్యాత్ 'రు' శబ్దస్తన్నిరోధకః
అంధకార నిరోధత్వాద్గురురిత్యభిధీయతే.

'గు' అను శబ్దము అంధకారమునకు పేరు. 'రు' అను శబ్దము దానిని నశింపచేయు వెలుగు అని అర్థము. బ్రహ్మోపదేశములో అజ్ఞానమనే చీకటిని నశింపచేసి, స్వప్రకాశమై వెలుగు ఆత్మను అనుభవమునకు అందజేయువారు [illegible] చున్నది.



గురుశిష్యుల అర్హతలేమిటి? గురువు ఎట్టివాడై యుండాలి? శిష్యుడు ఎట్టివాడై అర్హతలు కలిగియుండాలి? ఈ విషయములో శాస్త్రము సునిశితమైన తన అభిప్రాయములను తెలియచేసియున్నది.

గురువు శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడై ఉండాలి. గురువు వేదసారము నెరింగినవాడై ఉండాలి. తాను తెలుసుకొనిన శాస్త్రజ్ఞానమును అనుభవమునకు తెచ్చుకున్న బ్రహ్మనిష్ఠుడై ఉండాలి. అట్టివాడే గురువు. అట్టిగురువే శిష్యుని సక్రమమైన మార్గంలో నడిపించగలడు.

అవిద్యా హృదయ గ్రంథిర్బంధమోక్ష భవేద్యతః
తమేవ గురురిత్యాహుర్గురు శబ్దార్థ వేదినః

ఏ మహాత్ముని వలన శిష్యునియొక్క అవిద్యాహృదయ గ్రంథి పటాపంచలగునో అట్టివాడు గురువని వేదము తెలియచేస్తున్నది.

ఇక శిష్యుని విషయం. ప్రాపంచిక విషయ భోగము లందలి నిస్సార జీవనమును తిలకించినవాడై ఈ ప్రపంచములో సుఖమని పిలువబడేదంతయు దుఃఖముయొక్క ప్రతిరూపమేనని గుర్తించి, ఆత్మను తెలిసికొని ధన్యత చెందవలయుననెడి కుతూహలము, శ్రద్ధ కలిగిన వాడుగా వుండాలి. నిత్యానిత్య వస్తువివేకము, ఇహాముత్రార్థ ఫలభోగ విరాగము, శమాది షట్కసంపత్తి, ముముక్షుత్వము అను సాధన చతుష్టయము కల్గియుండాలి. అట్టి సాధన చతుష్టయ సంపత్తి కల్గిన ముముక్షువు.

తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా
ఉపదేక్ష్యన్తి తే జ్ఞానం జ్ఞానిన స్తత్వ దర్శినః

సద్గురువు నాశ్రయించి, నమస్కరించి, సేవించి, అనుకూల సమయమందు ప్రశ్నించి, ఉపదేశమును పొంది తరించమని శ్రీకృష్ణపరమాత్మ భగవద్గీత జ్ఞానయోగములో తెలిపారు.

పరమ పవిత్రులైన అట్టి గురుదేవుల పాదముల నాశ్రయించిన శిష్యుడు తప్పక తరించును. సంసార చక్రమునుండి బయటపడును.

మనసును, ఇంద్రియములను నిగ్రహించమని, సంయమనము చేయమని సద్గురువు బోధిస్తాడు. మనసెప్పుడూ చలించే స్వభావము కలిగియుంటుంది. గాలికన్నా వేగంగా చలించే మనసును నిగ్రహించాలి. ఇంద్రియాల పరిచ్ఛేదమునుండి

విడిపడాలి. ఇంద్రియ విషయాల్ని చూడగానే లేదా తలచగానే ఇంద్రియాలు బలవత్తరములై విషయములపై నడక సాగిస్తాయి. ఇంద్రియాలను నడిపిస్తూ మనను కదులుతుంది. విషయ ప్రపంచములో ఇంద్రియాలు సాగించే నృత్యభంగిమలకు వెనుక మనను లయ ప్రధానమై ఉంటుంది. కనుక ఇంద్రియాలను, మనసును నిగ్రహించాలి.

ఆత్మానాత్మ వస్తు వివేకం ద్వారా మనసుకు పరిపుష్టిని కలిగించాలి. విషయసుఖాలు అనర్థములని, దుఃఖహేతువులని విచారణచేసి ఇంద్రియాలను నిగ్రహించి, మనసులో లయం చేయాలి. మనసును వెనుకకు మరల్చి సచ్చిదానందమైన ఆత్మయందు లయింపచేయాలి.

ఇంద్రియ మనోబుద్ధులు ఎప్పుడైతే స్వాధీన మవుతాయో వెంటనే సత్యము ఎరుక పడుతుంది. ఏ బ్రహ్మపదార్థమును గూర్చి ఇంతవరకు అన్వేషణ జరిపామో ఆ బ్రహ్మమును మన హృదయంలోనే దర్శించడము జరుగుతుంది.

సత్యదర్శనమంటే ఉన్నదానిని గ్రహించేదే కాని లేనిదానిని ప్రయత్నించి పొందేదికాదు. మనం ఆచరించే సకలసాధనలు ఆత్మను అడ్డుపరచే ఆటంకమును తొలగించుటకేగాని ఆత్మను ప్రత్యేకించి పొందేటందుకు కాదు. ఆత్మ స్వయం ప్రకాశము. అది మన స్వస్వరూపము. మేఘము తొలగగానే సూర్యుడు స్వయంప్రకాశమై విరాజిల్లునట్లు అజ్ఞాన మేఘాలు తొలగగానే ఆత్మ తనంతట తానే ప్రకాశిస్తుంది.

మనలోవున్న ఈ సత్యాన్ని గ్రహించుటకు శ్రవణము కన్నా మరోమార్గం లేదు. శబ్దప్రమాణము ద్వారానే జ్ఞానం కలగాలి. కనుక సాధన చతుష్టయ సంపత్తి కలిగి, శ్రోత్రియ బ్రహ్మనిష్ఠుడైన సద్గురువు నాశ్రయించి, వేదాంత శ్రవణముచేసి, శ్రవణము చేసిన విషయమును మననం చేసి, మననం చేసిన విషయమును నిధిధ్యాసయందు స్థిరపరచుకొని ఆత్మానుభవము కలిగియుండాలి. జీవించి యుండగనే ఇట్టి అపూర్వఅనుభూతిని పొందాలి. ఇక్కడ, ఇప్పుడే అట్టి అనిర్వచనీయానందమును పొందు మార్గమును సనాతన ధర్మము నొక్కి వక్కాణించుచున్నది. సనాతన ధర్మమార్గములో పయనించే అందరూ అనుభూతిని పొందెదరుగాక!

ఓం తత్ సత్.

ప్రబోధాత్మక వ్యాఖ్య

కామ, లోభ, మాత్సర్యము లనెడి సజీవ పాశములలో తగుల్కొనిన మానవాళిని ఆధ్యాత్మికంగా పునర్జీవింప చేయుటకు భగవాన్ శంకరాచార్యులవారు రచించిన గ్రంథములలో "భజగోవిందం" అత్యుత్తమమైనది. ప్రాపంచిక విషయవాసనాభిలాషల కామ క్రోధ జ్వరమునకు ఇది ఒక దివ్యౌషధము. ఈ గ్రంథము "నేనెవరు?" అనే వేదాంత విచారమును ప్రేరేపించి, అన్వేషకుని ఆత్మశాంతి, ఆనందములవైపు నడిపించును.

భగవాన్ శంకరుల వారి ఈ అమృత గానమునకు స్వామి సుందర చైతన్యానందులవారి ప్రబోధాత్మక మైన వ్యాఖ్యానమును గాంచుటకు నేను కడు ముదితుఁడను. జ్ఞాన స్ఫూర్తిని కలిగించు ఈ గ్రంథము ప్రతి ఒక్కరు పఠించదగినది.

శ్రీ సుందర చైతన్యానంద సనాతన ధర్మ దీపికాధారి. అతని ఆధ్యాత్మిక కార్యక్రమములను ఆశీర్వదించుచున్నాను.

శుద్ధానంద భారతి



శ్రీ మహాగణాధిపతయే నమ:

పరమానంద స్వరూపుడను, జ్ఞానోపదేశము చేయువాడును, ఈశ్వరుడును, వ్యాపకుడును,

లక్ష్యార్థ వివరణ:

1. ఆనందమునకు పరమైన స్థితి యందున్న శ్రీహరి, సర్వులకు ఆత్మయైన గురువువైన ఈశ్వరునకు, విశ్వమంతా వ్యాపించి, ఉపాదాన, నిమిత్త, సర్వ కారణముగా వున్న స్థితిని ఉపదేశముతో అందించెడి సద్గురు స్వరూపమునకు నా నమస్సులు.

2. సృష్టి, స్థితి, లయములనెడి ఆనందమునకు సాక్షిగా నున్న శ్రీహరి స్థితిని ఉపదేశముచే అందించెడి సర్వవ్యాపి, సర్వలోకములకు కారణము అయిన ఈశ్వరస్థితికి నా నమస్సులు.

3. మూలాప్రకృతి అయిన "శ్రీ" సహితుడు, సర్వసాక్షి అయిన హరిని తెలియ చెప్పెడి సద్గురు ఉపదేశము అనేది అనుగ్రహము, సర్వవ్యాపకము, సర్వకారణము, సర్వ లోకములు తానే అయిన ఈశ్వరుని అనుగ్రహమేనని తలచి నన్ను నేను అర్పించుకొనుచున్నాను, అట్టి హరి ఈశ్వరుడు, సద్గురువుకు వశుడనై వర్తించెదను.

1. మోక్షము సిద్ధ స్థితి.

2. మోక్షము గురించి అనుభవము గల పెద్దలు చెప్పవలసి వచ్చినప్పుడు అపరోక్షానుభూతియని తెలిపినారు.

3. సదసద్వివేకము కలిగిన సాధకులు కార్యకారణ వివేకము పొందుటకు నిరంతరాయముగా చేయవలసిన బ్రహ్మాను సంధానమును గురించి, విశేష ప్రయత్నము చేయుట యందు నిష్ప్రపంచ, నిర్వికార, నిర్వికల్ప, నిరంజన స్థితి యందుండుటను సవిస్తారముగా వివరించుచున్నారు.

సచ్చిదానందమయుడు అయిన హరి అనగా సర్వమును హరించెడివాడు అనగా అజ్ఞానమును, జీవభావాన్ని, అవిద్యను, పంచీకరించబడిన సర్వమును హరించెడి స్థితియని అర్థము. అట్టి స్థితిని పొందే లక్ష్యంతో హరియందు ప్రేమ, ప్రీతితో ఆచరించబడే తపస్సు, స్వ ధర్మ, కర్మ, ఆశ్రమములు అన్ని తను తనువూ కాదని నిర్ణయించుటకు కావలసిన సాధన చతుష్టయమును అధికారిత్వమును పురుషునకు వైరాగ్యము చేత కలిగించును. ఇదే ఈశ్వరకృప.

సృష్టి ద్వివిధములు. క్రమ సృష్టి, సంకల్ప సృష్టి. క్రమ సృష్టి అంటే పంచభూతముల కలయికచే యేర్పడిన అధి భౌతికమైన పదార్థజాతము నుంచి - అండజ, ఉద్భీజ, స్వేదజము, జరాయుజములు అన్ని చైతన్య వికాసక్రమం లోనివి. మానవ ఉపాధి వ్యక్తం కావటంతో చైతన్యవికాసం పూర్తి అయ్యింది. ఇది పిపీలికా న్యాయం. ఇక బ్రహ్మము నుంచి సంకల్పముచే మానవుని వరకు జ్ఞాన ప్రధానముగా అశరీరులు అందరు అంటే యక్ష, కిన్నెర, కిం పురుష, సిద్ధ, సధ్య, చరన, విద్యాధర వంటి వారందరిలో ఆఖరివాడు మానవుడు లేక జీవుడు. యిది సంకల్పవత్ సృష్టి లేక యుగావత్ సృష్టి. యిది అంతా అధి దైవికము, ఆధ్యాత్మికము. కాబట్టి పిపీ

శ్రీమహాగణాధిపతయేనమః

# భజగోవిందం - ఉపోద్ఘాతము

పుణ్యభూమియైన ఆర్యావర్తనము ఆదినుండీ ఎన్నో క్లిష్టసమస్యలన
ఎదుర్కొంటూ నడక సాగించింది. అనూహ్యమైన భయంకర పరిస్థితుల
తలెత్తిననూ ఈ ఋషి భూమి చల్లటి నీడనిచ్చింది. నూతన జీవన దృక్పథాన్ని
ప్రసాదిస్తూ కాపాడిన సనాతన ధర్మవృక్షము సజీవంగానే వుంది. ఈ దేశ సంపదన
చూసి, మతి భ్రష్టులైన విదేశీయులు జరిపిన దారుణ దండయాత్రలనే సూర్యరశ్మికి
సనాతనధర్మవృక్ష పల్లవములు కలత చెంది వాడిపోయినవి. సాంఘిక దురాచారా
పెనుగాలులకు, వాడిన ఆకులు రాలిపోయినవి. కులతత్త్వాల పేరిట జరిగి
మారణహోమాలు సంస్కృతి వృక్షాన్ని కొమ్మలు విరచి నేలకూల్చాయి. భా
వివాదాలు, ప్రాంతీయ దురభిమానాలు, ధర్మ వృక్ష ఫలాలను నేలరాల్చాయి
భిన్న వ్యవస్థలను సుస్థిర పరుచుటకై ఆధ్యాత్మిక అవగాహన లేని కొందర
మతోన్మాదులు ఏర్పరచిన సిద్ధాంతాలు, పరస్పర ద్వేషభావంతో సాగించి
రాద్ధాంతాలు, ఫలించనున్న కాయలను ధ్వంసం చేశాయి. ప్రజల జీవనాన్ని
చావుదెబ్బ కొట్టిన రాజకీయ దురంధరులు, ఆడిన కపట నాటకాలు, బాధ్యతల
విస్మరించి, హక్కులకోసం పోరాడే, స్వార్థ ప్రజానీకం చేసిన, కల్లోల ప్రదర్శనల
చిగురిస్తున్న పూతను, పిందెను మట్టిపాలు చేశాయి.

తరతరాలుగా ఈ విధమైన దురదృష్టకర సంఘటనలతో, చిన్నాభిన్నమై
భారతీయ సంస్కృతి, ఈనాటికి సర్వాంగ సుందరవై వెల్గొందుట
ఆలోచనాపరుడైన ప్రతివ్యక్తిని ఆశ్చర్యంలో ముంచక మానదు. ఈ పరిస్థితే మరో
దేశమునకు ప్రాప్తించి యున్నట్లైతే, ఆ దేశము ఈనాడు అదృశ్యమై, చరిత్ర
గ్రంథాలలో మాత్రమే నిలిచియుండేది.

భారతదేశము పురాణ పురుషులు ఉదయించిన పుణ్యభూమి. భారత పుణ
సససంస్కృతి దెబ్బతినే ససయం ఆసన్నమైనప్పుడు, ఒక మహాత్ముడు

ఉదయించి, వ్యవస్థను చక్కబరిచే వాడు. ఎప్పటికప్పుడు మహాత్ముల చేత ఉద్ధరింపబడుతూ, భారత సనాతన ధర్మ ప్రవంతి, చిరంజీవత్వాన్ని సంతరించుకొన్నది,

యథాయథాహి ధర్మస్య గ్లాని ర్భవతి భారత ।
అభ్యుత్థానమధర్మస్య తదాత్మానం సృజామ్యహం ॥

ధర్మమునకు హాని, అధర్మమమునకు వృద్ధి కలుగునప్పుడు, నేనే స్వయముగా జన్మించి రక్షిస్తానని, శ్రీకృష్ణ పరమాత్మ భగవద్గీతలో తెలిపారు.

ధర్మోద్ధరణకై వచ్చిన మహాత్ములను, అవతారపురుషులుగా, భగవదంశాలుగా, భావించటం భారతీయ తత్త్వావగాహనలో ఒక విశేషం.

బౌద్ధధర్మ నాస్తిక భావ ప్రభావంతో, మోడుబారిన సనాతన ధర్మవృక్షం, నిర్జీవమై, నిర్వీర్యమై క్షీణించనున్న ఒక దుర్దశలో, ధర్మపరిరక్షణకై, కైలాసనాథుడైన మహేశ్వరుడు, శ్రీ ఆదిశంకరులై అవతరించారు.

పరస్పర భావవిరుద్ధమైన వివిధ మతసిద్ధాంతాలనే దట్టమైన మేఘాలను, అద్వైత సిద్ధాంతమనే చల్లటి గాలి చేత చెదరగొట్టారు. ససదర్శనమనే ఎఱువు వేసి, సత్ సాంప్రదాయమనే జలము పోసి, పూర్తిగా నశించనున్న హైందవ వృక్షాన్ని పునర్జీవింప చేశారు. వారి ప్రేమ హస్తాలలో పెరిగిన సనాతన ధర్మవృక్షం, అద్వైతం అనే అమృతఫలాన్ని ఇచ్చింది. "బ్రహ్మమొక్కటే సత్యము , జగత్తు మాయాజనితము". తాను వేరని భావించినా, యథార్థానికి జీవుడు బ్రహ్మమే కాని అన్యము కాలేడు. ఉన్న ఒకే సత్యము భగవంతుడు. నీవు భగవంతుడవేనని అద్వైతం బోధిస్తుంది. నామరూపాత్మకమైన ప్రపంచానికి వ్యావహారిక మనుగడే కాని, పారమార్థిక సత్యము భగవంతుడే నని శృతి సమ్మతముగాను, స్మృతి బద్ధముగాను, యుక్తి యుక్తముగానూ, తర్క విశేషములతోనూ, అద్వైతము బోధిస్తుంది. అద్వేత సిద్ధాంతము శ్రీ శంకరులతో ప్రారంభమైనది కాదు, బ్రహ్మదత్తుడు, గౌడపాదుడు, వశిష్ఠుడు, శంకరులకు ముందే, ఈ అద్వైత సిద్ధాంతానికి ఒక రూపం ఇవ్వటానికి,

ప్రయత్నం చేశారు. అద్వైతానికి శంకరుల పూర్వం ఎంత చరిత్ర నడిచిందో, వారి తరువాత కూడా అంత చరిత్ర వుంది. శంకరుల అనంతరం, విద్యారణ్యస్వామి, వాచస్పతి,....., మధుసూదన సరస్వతి లాంటి మహాత్ములు, వారి రచన ద్వారా అద్వైత సిద్ధాంత స్థిరీకరణకు తీవ్రంగా యత్నించారు. కాని అద్వైత మతస్థాపకులు అన్న పేరు ఒక్క శంకరులకే దక్కింది. అద్వైత మతాచార్యులైన వివిధ మహాత్ములు సమర్పించిన రంగు రంగుల విడిపూలను, శ్రీ శంకరులు ఏరి కూర్చి, తన జ్ఞాన నైపుణ్యంతో మాలగా తీర్చి, విశ్వనాథుని మెడలో అలంకరించి అర్చించారు. శ్రీశంకరులు బోధించిన అద్వైత సిద్ధాంతము, ఇటీవల సముద్రములు దాటి, పాశ్చాత్య తీరాలలో కాలిడింది. భౌతికవాదంతో అలసిపోయి, విసుగు చెందిన పాశ్చాత్యులకు నూతనోత్సాహాన్ని ప్రసాదించింది. తమ హృదయాలలో నిండియున్న అశాంతిని రూపుమాపగల పరమ ఔషధం అంటూ, యూరపు అమెరికా ఖండాలలోని, ఎందరో మేధావులు అద్వైతాన్ని కీరించారు. శంకరులకు జోహార్లు అర్పించారు. ఐన్‌స్టీన్,....,ఎడ్డింగ్‌టన్ లాంటి శాస్త్రజ్ఞుల రచనలు అద్వైత సిద్ధాంతానికి పరిపుష్టిని కలిగించాయి. విజ్ఞానశాస్త్రము నేడు నిర్మిస్తున్న సోపానాలు అద్వైత ఆలయాన్ని చేరటానికేనని తేలిపోయింది. కనిపిస్తున్నదే సత్యం అనుకున్న శైశవ దశ ప్రసంగాలను దాటి మనం చాలా దూరం వచ్చామని, శాస్త్రజ్ఞులు గుర్తించి విశాలభావంతో వెలిబుచ్చారు.

"పరిమితమైన మనోబుద్ధులు సత్యదర్శనం చేయలేవ"ని శ్రీ శంకరులు ప్రబోధించగా...

"మానవుని బుద్ధి సత్యచిత్రాన్ని కలతపెట్టుచున్నద"ని 'కాంట్' అను శాస్త్రజ్ఞుడు అభిప్రాయపడ్డాడు.

"మనో బుద్ధుల పరిమిత దృష్టిలో, ఇంద్రియాల పరిచ్ఛేదములో ఉన్నవాటిని ఉన్నట్లుగా చూడలేక పోతున్నామ"ని 'ఎడ్డింగ్‌టన్' అభిప్రాయపడ్డారు. 'సృష్టిని దర్శించే మహాకార్యంలో, దృష్టి సవరణ అవసరమ'ని శ్రీ శంకరులు బోధించారు. జ్ఞానాంజన ద్వారా మన మనోనేత్రంలోని భేదభావ చాతుర్యాన్ని తొలగించడానికి ప్రయత్నించారు.

శ్రీ శంకరులు కేరళ దేశంలో కాలడి అను గ్రామమున, శివగురు ఆర్యాంబ యను పుణ్యదంపతులకు క్రీ.శ. **788** వ సం॥మున వరప్రసాదమై జన్మించారు. తన యెనిమిదవ యేటకే వేదవిజ్ఞానమంతటినీ అభ్యసించిన అసమాన ప్రజ్ఞాదురంధరులు శ్రీ శంకరాచార్యుల వారు. దక్షిణ భారతదేశంలో జన్మించి, మధ్యభారతదేశంలో విద్యనార్జించి, ఉత్తరభారత దేశంలో సర్వజ్ఞ పీఠాన్ని అధిరోహించిన, అద్భుత మహిమాన్వితులు, **32** సం॥ల స్వల్ప జీవిత కాలంలో నిర్విరామముగా కాలినడకతో, సువిశాల భారతదేశమంతయు సంచరించి, అద్వైత సిద్ధాంతమును వ్యాప్తి చేశారు.

కన్యాకుమారి నుండి కాశ్మీరము వరకు, వారు దర్శించని పుణ్యక్షేత్రము, బాగుచేయని ఆలయము లేదు. జీర్ణావస్థలోయున్న ఎన్నో ఆలయాలను పునరుద్ధరించారు. మంత్రసాధనలను పరిశుద్ధపరిచారు. దేశాటనము చేయు సన్యాసులను దశనామీ సన్యాసులుగా క్రమపరిచారు.

శ్రీశంకరులకు పూర్వము విశ్వరూపాన్ని ధరించి, ప్రళయతాండవము చేయుచున్న బౌద్ధమతము, శంకరుని ఆగమనంతో పరిగెత్తి దేశ సరిహద్దులు దాటి, చైనా టిబెట్ దేశాలలో తలదాచుకొన్నది. **1200** సం॥లకు పూర్వము, పూజ్యపాదుల వారి ధాటికి నిలువలేక పారిపోయిన బౌద్ధమతము, ఈనాటికి జన్మభూమిలో కాలు పెట్టిన శక్తిలేక, భయ కంపితమై యున్నది. బౌద్ధమతాన్ని ఆచార్యుల వారు సమూలంగా నశింప చేశారని, భారతదేశంలో బౌద్ధమతం లేకుండా పోవటానికి, శ్రీ శంకరులే కారణమని, చాలామంది భావిస్తుంటారు. అది సరియైన అవగాహనయే కాదు. బుద్ధుడు ప్రత్యేకించి ఒక మతాన్ని స్థాపించాడని విశ్వసించే వారికి, పైన ఉదహరించిన వాదం తృప్తిని కలిగించవచ్చు. బుద్ధుడు యథార్థానికి మతస్థాపకుడు కాదు. ఆనాడు హిందూ సమాజంలో ఉన్న, కొన్ని అసమానతలను తొలగించటానికి, అస్థవ్యస్థ

ఆచారాలను, హింసాకాండను రూపు మాపటానికి బుద్ధుడు ప్రయత్నించాడు. తాను బోధించిన నైతిక సిద్ధాంతాలు, ధార్మిక విలువలు, హిందూ ధర్మశాస్త్రాలలో ఉన్నవే. కాని నూతనమైనవి కావు. ఆనాటి సాంఘిక నైతిక ఆధ్యాత్మిక రంగాలలో, అలుముకున్న అంధకారాన్ని తుడిచిపెట్టి, సమాజ శ్రేయస్సును ప్రయత్నించిన బుద్ధ భగవానుని, కదలిక సంస్కరణోద్యమమే కాని, మతస్థాపనకాదు. సతీసహగమన నిషేధానికి రాజారామ్మోహనరాయులు సాగించిన ఉద్యమాలు, ప్రచురించిన గ్రంథాలు నేటి సభ్య సమాజానికి ఎట్లు అవసరములు కావో, అలాగే బుద్ధుని అనంతరము వారు ప్రబోధించిన ధర్మము కూడా నిరుపయోగమే అయ్యింది. అయితే బౌద్ధ ధర్మాన్ని స్వీకరించిన చక్రవర్తులు రాజులు, ధర్మాల్ని వ్యాప్తి చేయు ఉద్దేశ్యముతో, బౌద్ధభిక్షువులను ఇతర దేశములకు పంపటము వలన, వారు బోధించిన ఆ ధర్మ నీతి, పాశ్చాత్యులకు క్రొత్తగా నున్నందు వలన, విరివిగా ప్రచారము గావించబడి, పాశ్చాత్య దేశాలలో బౌద్ధమతము వ్యాప్తి చెందటము జరిగినది. బౌద్ధ ధర్మము మాతృదేశములో మాయమగుటకు ఆ మతములలోని
అసంపూర్ణ సిద్ధాంతములే కారణం కాని, శంకరుల అద్వైతము కాదు. అన్ని మతాలలోని అసంపూర్ణతను తొలగించి, వాటిని పరిశుద్ధ మొనర్చుటయే శంకరుల మేథా విశేషం.

భగవత్పాదులు ప్రసన్న గంభీరమైన అద్వైత సిద్ధాంతము చేత, భిన్నాభిప్రాయముతో పోరాడు మతశాఖలన్నింటిని సక్రమ మార్గములో ఉంచి, షణ్మత స్థాపనాచార్యులు అయ్యారు. వీరిది నిర్మాణమే కాని నిర్మూలన కాదు. శంకరులు ఒక వ్యక్తి కాదు, వ్యవస్థ. అవేశపరులకు శంకరాచార్యులు అనేకులు, అలోచనాపరుకు శంకరులే శరణ్యము.

'శం' కరోతి ఇతి శంకర: - శుభములనొసగువాడు శంకరుడని భావము. దేశ సంచారము గావించి, ధర్మ ప్రచారము చేసి, జీర్ణాలయములను పునర్జీవింప చేసి, నిర్విరామముగా సేవచేసిన కర్మ యోగి శ్రీ శంకరులు.

భక్తి పారవశ్యంతో సామాన్య జనరంజకముగా, అష్టకాలు, షట్కాలు, దైవ ప్రార్థనలు, భక్తి గేయాలు రచించి, సర్వమానవాళి హృదయక్షేత్రాలలో భక్తి బీజాలు నాటిన, పరమ భక్తాగ్రేససులు శ్రీ శంకరులు. ముముక్షువులకు మార్గమును చూపు కాంతి పుంజమువలె, దేశం నలుమూలలా శంకర మఠం నిర్మించి, అవి ఈ నాటికీ అచంచల కార్య దీక్షతో నడచునట్టి, సంప్రదాయ ప్రణాళిక నేర్పరచిన, మార్గదర్శకులు , కార్య నిర్వాహక దక్షులు శ్రీ భగవత్పాదులు.

మతం పేరిట చలామణీ అయ్యే, సంఘవిద్రోహులను అదృశ్యం చేసిన సంఘసంస్కర్త శ్రీ శంకరులు. తన హృదయావేశంతో మనోరంజకమైన పదలాలిత్యముతో, ఆశ్చర్య చికితులను చేయు గంభీర భావంతో, కమనీయ కవిత్వమును రసమయ సాహిత్యమును, ప్రసాదించిన కవిశేఖరులు శ్రీశంకరులు. శంకరుల బహుముఖ ప్రజ్ఞ అసమానము ఆశ్చర్యము అద్వితీయము. కుశాగ్ర బుద్ధి, విశాల హృదయమనే నేత్రములతో, సత్యసాధమును అన్వేషించి, అపూర్వ ఆధ్యాత్మ మణిని లోకానికి అందించారు. బ్రహ్మ సూత్రములు, ఉపనిషత్తులు, భగవద్గీతయనెడి ప్రస్థానత్రయమునకు వారు వ్రాసిన భాష్యము శ్రీ శంకరుల అద్భుత మేథా శక్తి కి తార్కాణము. అట్టి అసమాన ప్రజ్ఞా దురంధరులై, వేదాంతాకాశంలో అప్రమేయ, అనూహ్య సిద్ధాంత అంబారీ వీధుల్లో విహరించే, ఆ మహాజ్ఞాని క్రిందనున్న సకల జీవరాశులను శాంతింప చేయుటకు, వర్షరూపంలో దిగవచ్చు, మేఘము వలె సాధారణ మానవులను సైతం తరింప చేయుటకు, క్రిందికి దిగి వారి స్థాయిలో అర్థమగునట్లు రచించిన శివానందలహరి, భజగోవిందం లాంటి గ్రంథములు ఆచార్యుల వారి హృదయ విశాలత్వమును నిరూపించు దర్పణములైయున్నవి. మనము ప్రస్తుతము అధ్యయనము చేయు గ్రంథము శ్రీ శంకరభగవత్పాదులు సర్వమానవాళికి ఉపయుక్తమగు నట్లు లిఖించిన 'భజగోవిందము'. శంకర గ్రంథావళిలో ఈ భజగోవిందము బహుళ

ప్రచారము గావించ బడి, సర్వజన సమ్మతమై అలరారు చున్నది. మానవుని జీవితలక్ష్యమును గుర్తుచేస్తూ, లక్ష్య సాధనకై మానవుని కర్తవ్యమును తెలియపరుస్తూ, వ్యక్తి ఆధ్యాత్మ ప్రగతిని నిరోధించే విరోధులను కనపరుస్తూ, అట్టి వ్యక్తి ఆధ్యాత్మ ప్రగతిని, శత్రువులను జయించే తరుణోపాయము చూపిస్తూ, మానవుని చేయిపట్టుకుని నడిపించి, మాధవుని స్థాయికి కొనిపోవు శక్తి కలది యగుటచే, యీ భజగోవిందము పండిత పామర జనరంజకమై వెల్గొందుచున్నది. ఒకనాడు శిష్యులు వెంటరాగా, శంకరాచార్యుల వారు కాశీనగరవీధుల్లో నడుస్తూ, వ్యాకరణ సూత్రాలను వల్లె వేయుచున్న వృద్ధ బ్రాహ్మణుని చూసారు. జీవిత సంధ్యాసమయమున కూడా, భగవంతునిపై దృష్టిని మరల్చక, ఇహిక సుఖాన్వేషియై, చరిస్తున్న ఆ వ్యర్థ జీవిపై సానుభూతి కలిగి, వెంటనే అతన్ని ఉద్దేశ్యించి ఒక శ్లోకాన్ని గానం చేశారు.

ఓ మందమతీ ! గోవిందుని భజింపుము, గోవిందుని కీర్తింపుము. మరణకాలమాసన్నమైనప్పుడు, యమపాశము మానవుని బంధించి వెంటకొనిపోవు చున్నప్పుడు, వ్యాకరణ సూత్రము నిన్ను రక్షించదు. గోవిందుని భజింపుమని అప్రయత్నంగా గానం చేసారు.

లౌకిక మానవుని అయోమయ జీవితము చూసి, హృదయము ద్రవించిన శ్రీ శంకరులు అంతటితో ఆగక, మానవ జీవనవికాసానికి ఉపయోగపడు **12** శ్లోకాలను చెప్పారు. వీటినే "ద్వాదశ మంజరీక స్తోత్రము" అని అంటారు. శంకరాచార్యుల వారిని అనుసరించి నడుస్తున్న పదునలుగురు శిష్యులు ఆచార్యుల వారి బోధతో ఉత్తేజితులై, ఒక్కొక్కరూ ఒక్కో శ్లోకము చొప్పున పదునాలుగు శ్లోకాలు చెప్పారు. వీటిని చతుర్దశ మంజరీక స్తోత్రం అంటారు. శిష్యులు రచించిన చతుర్దశ మంజరీక స్తోత్రమును ఆలకించి, సంతృప్తిని చెందిన పూజ్యపాదులు, ఆశీర్వచనముగా చివర నాలుగు శ్లోకములు చెప్పారు. మొత్తం కలసి ముప్పది శ్లోకాలుగా ఏర్పడిన, ఈ మహాగ్రంథము భజగోవిందమను పేరుతో ప్రాచుర్యమునొందినది.

మానవుని మనసులోని మోహమును పారద్రోలు శక్తి కలది కనుక, దీనికి మోహముద్గర అను పేరుకూడా కలదు. ఈ గ్రంథములో మొదట వరుసగా **12** శ్లోకములు, చివరి **4** శ్లోకములు కలిపి శ్రీ శంకర భగవత్పాదులు రచించినవి. **13** వ శ్లోకం నుండీ **26** వ శ్లోకము వరకు శంకరుల శిష్యులు రచించిన శ్లోకములు, సులభ గ్రాహ్యమగుటకు, శిష్యులు చెప్పిన శ్లోకములకు ఆయా శ్లోకములకు క్రిందనే వారి పేర్లను ఉదహరించడము కూడా జరిగినది. ఆచార్యుల వారు ఈ గ్రంథరచనములో ఉపయోగించిన భాష నిస్సంకోచముగా హెచ్చరికలు చేయు ప్రబోధము ఒక విచిత్ర పంథాలో నడిచినది. తల్లిలాగా బిడ్డను బుజ్జగించి, ఓదార్చే రీతుల్లో ఈ గ్రంథరచన జరుగలేదు. అపరాధియైన కుమారుని క్షేమంకోరి, కళ్ళెర్ర జేసి, చేతిలో కొరడా ఝుళిపించిన తండ్రి యొక్క నిర్దాక్షిణ్య మందలింపు ఇందు కనపడింది. అవసరాన్ని గుర్తించటమే ఇందులకు కారణము.

ప్రమాద పరిస్థితులలో వ్యక్తి మర్యాదలకు, సంఘ ఆచారాలకు తావు లేదు. అగ్ని ప్రమాదంలో చిక్కుకుని అల్లాడిపోతున్న వ్యక్తి, సార్వభౌముడైన చక్రవర్తియే కావచ్చు. అలాగని అతణ్ణి ఆ ప్రమాదము నుంచి తప్పించు సందర్భములో వారి గౌరవమును చాటు పల్లకీ కోసం అన్వేషించటం అనవసరం అప్రస్తుతం అసందర్భం. అతనిని పట్టి నడిపించుటకు వీలుకానిచో, కాళ్ళు పట్టుకొని ఈడ్చి బయటకు లాగిననూ తప్పులేదు. ప్రాణం రక్షించడమే ముఖ్యం. సంసార సముద్రములో భ్రాంతియనెడి నావ నెక్కి, సుఖ దు:ఖ తరంగాల మధ్య సతమతమౌతున్న మానవుడు, తన నావ మునిగిపోతున్నదని ఇతరులు హెచ్చరించిననూ లెక్క చేయక, అజ్ఞానముతో యాత్రసాగించు సమయాన వారిని రక్షించుటకు తీవ్ర పదజాలముతో, చేయు మందలింపే ఈ భజగోవింద శ్లోకంలో ప్రతిధ్వనిస్తూ ఉంటుంది.

సమాప్తము - సాయిరాం !!